

రాష్ట్ర శాసన సంఘం  ఆంధ్రప్రదేశ్ గవర్నర్ 1961 ఆగస్టు 1వ తేదీన హైదరాబాదు జూబిలీ హాలులో
రాష్ట్ర శాసన సంఘానికి ప్రారంభోత్సవము చేశారు.

నాగార్జునసాగర్ ఆనకట్టవద్ద వరదలతో ఉప్పొంగిన కృష్ణానది.

# ఆంధ్రప్రదేశ్

సంపుటి 5 | సెప్టెంబర్ 1961 భాద్రపద_ఆశ్వీయుజ 1883 శకము | సంచిక 11

# విషయసూచిక

ముఖచిత్రం : పశ్చిమ గోదావరి జిల్లా పాలకొల్లు ఎం. ఎం. కె. ఎన్. మునిసిపల్ హయ్యర్ సెకండరీ పాఠశాల "బుర్రకథ దళం". ప్రణాళికా ప్రచారంపై ఈ సంవత్సరం జరిగిన రాష్ట్ర స్థాయి సంగీత, నాటక పోటీలో వీరికి ప్రథమ బహుమతి లభించింది.

వెనుక అట్ట : "స్వాతంత్ర్య దినోత్సవ విన్యాసం 1961 ఆగస్టు 15 వ తేదీన సికింద్రాబాదు పరేడు మైదానంలో జరిగింది.

చందా వివరాలు

| | | |
|---|---|---|
| సంవత్సరానికి | — | 3 రూపాయలు |
| విడి ప్రతి వెల | — | 25 నయాపైసలు |

Edited & Published by the Director of Information & Public Relations, Andhra Pradesh, Hyderabad-1
Printed at Vir Milap Press, Mukarramjahi Road, Hyderabad-

# మహాంధ్రము

జ్ఞానానందము

తొలగఁ జీకటి రేలు వెన్నెలల కాంతుల్ నిండ నీనాడు నీ
వలపున్ బిడ్డలు స్వీయరాష్ట్రమును సంపాదించి నీ పూజకై
నిలువన్ జొచ్చిరి గోలకొండపురిలో నీ మేల్మియాశీస్సుతో
నెలమిన్ దస్పుము, ముద్దు గుబ్బలను తల్లీ! ఆంధ్ర రాజ్యేందిరా!.

ఎన్నాళ్ళైనదొ? యన్నదమ్ములకు నేఁడీ దివ్య సంధాన సం
పన్నత్వంబు లభించి నీ చలువ గర్భంబెంతగాఁ బండెనో
మన్నికై జగనొబ్బగండలయి బ్రహ్మాండమ్ముచే మ్రొక్కులన్
గొన్నంజాలెడి గున్నఁ జెల్లరొకచోఁ గూడంగ నాంధ్రావనీ!

ఈ జగానేలతో నిబ్రహీమ్ కుతుబుషా శారదాంబకు మేలిచీరఁ గట్టె
ఈ పుణ్య భూమిలోనే యన్న గోపన్న భద్రాద్రి శ్రీరాము భజనఁ జేసె
ఈ యోరుగలు త్రోవనే కళావేత్త్రి మాచలదేవి దివ్యలాస్యమ్మొనర్చె
ఈ కాకతీయ రాజ్యేందిరాంగణములో భక్తపోతన్న కావ్యమ్ము వ్రాసె
ఈ పసిండినేలనే బ్రహ్మనాయఁడు బాలచంద్రు తాంత్ర పాపరావు
నీ పదాంబురుహాపు నీడలో మెలగిరి దివ్య కల్పవల్లి! తెలుగుతల్లి!

పురి విప్పునే ? నేడు గిటి మీద నాంధ్రాన ప్రత్యగ్రమైన సాహిత్యబర్హి
వికసించునే ? నేడు సకలాంధ్ర వనవాటు ప్రేమార్ద్ర భావచాంపే యసుమము
తనియించునే ? నేడు తెనుగు పెత్తనదారికడుపు మాడిన బిచ్చగానిక్షుత్తు
విదళించునే ? నేడు ముదురు బుజ్జుల మేధకశ్మలంబైన వర్గాల పోరు
చివురులెత్తునె ? నేడు సుస్నిగ్ధ చిహ్నా దివ్య చైతన్య భావనోద్దీపిక తరు
లీ మహాంధ్రాన నా జన్మభూమిలోన అనుపమోజ్జ్వలపిక వాణి! ఆంధ్రవాణి!

ఈ నా తెలంగాణ బృహదాంధ్ర భూమికిన్ మకుటాయమానమై మసలునాడు
ఈ నా మహా గౌతమీనదీ తోయమ్ము చవిటిపట్టుకు యాత్ర సలుపునాడు
ఈ నా ప్రశుభవాణి యెనలేని గౌరవాదరణ కిరీటమ్ము దాల్చునాడు
ఈ నా తెలుగు జాతిలో నైకమత్యమ్ముఁ గలుపుగోలుతనమ్ము వెలయునాడు
తొల్లి కాకతీయ వల్లభుల్; చాళుక్య నృపులు, విజయనగర పృథివిపతులు
మఱియు రెడ్డి దొరల పరిపాలనపు సౌఖ్యమలరగలదు నేడు తెలుగుతల్లి

అలసిపోతివి తొంటి గొలకొండ సులతాను కలుషితంబైన రక్షణము వలన
నలిగిపోతివి తెగ్గు కొలమన్న మా కన్న, కరడుకట్టిన మతాంతరము వలన
విసిగిపోతివి యల్ల ముసునూరి ప్రోలయ్య బాధాకరపు మృత్యుగాథ వలన
వణకిపోతివి రణప్రౌఢుండు కాపయ్య తలపులో జనియించు వలపు వలన
అయిదువందలేఁడు లా మీద జరిగిన సంకులంపు సమరచరితమమ్మ
తెలుగు భాగ్యపురిని తొలికోడి కూసెను ఎగురనిమ్ము తెలుగు పృథుపతాక

ఇటనాగావళి, వంశధార, శబరీకృష్ణా మహాగౌతమీ
చటులోత్తుంగతరంగ తుంగ విచలత్ చంపావతీ, పెన్నా, యు
త్కట మంజీరయుఁ గిన్నెరమ్మయును, బంగారమ్ముఁ బండింపనీ
చిటుకూనల్ సుఖియింత్రుగావుత, కళాశ్రీ! ఆంధ్రరాజ్యేందిరా!

ఎలమిన్ ఖంగున మ్రోగుచున్నయవి తల్లీ! వేయి కంబాల దే
వళమున్ గంటలు, శాంతిదూతయని విశ్వఖ్యాతి నార్జించు ధీ
గల నెహ్రూఘను నాశిషమ్ములొక ప్రక్కన్ మేల్ ప్రసూనమ్ములై
చెలగెన్ నీవిక ధన్యురాలవు నమస్తే! ఆంధ్రయోషామణీ!

# 'సహకార పితామహుడు'

చామర్తి సుబ్రహ్మణ్యం

శ్రీ నరసింహదేవర సత్యనారాయణగారు సహకార సంస్థకు పితామహులవంటివారు. వారు 1955 వ సంవత్సరము సెప్టెంబరు నెల 30వ తారీకున బొంబాయినగరములో కాలధర్మము చెందిరి. మానవునకు ఉత్సాహం కార్యశూరత ఉండవలెనని ఆయన్నిగూర్చి తెలిసికొంటె తప్పకతెలియును. ఆంధ్రదేశములో ఆయన నెరుగనివారుండరు. తూర్పు గోదావరి జిల్లాలోని రామచంద్రపురం తాలూకాలో ఆలమూరు, గ్రామంలో అగ్రహారీకులు, శ్రీ నరసింహదేవర పేరుశాస్త్రిగారు అనే బ్రాహ్మణులుండేవారు. వారు నిరతాన్నదాతలు. ఎందరు ఏ సమయమున వచ్చిననూ, విసుగు చెందక, ఆప్యాయత. కరుణ ఉట్టిపడునటుల ఆహ్వానించి, ఆదరించి పంపేవారు. అట్టి పుణ్యపురుషునికి 1894 సంవత్సరమున శ్రీ సత్యనారాయణగారు జన్మించారు. ఆంగ్లవిద్యతోబాటు. అటు సంస్కృతము. వేదపారాయణ చేస్తూండే వారు కళాశాలలో విద్యాభ్యాసము చేస్తూండగా సి ఆర్. దాసు, గాంధీజీ రఘుపతి వెంకటరత్నంనాయుడు గారల స్వాతంత్ర సందేశాన్ని విన్నారు. వారి మనస్సు అటుమ్రొగ్గినది. శ్రీ సత్యనారాయణగారు 1918 లో కాంగ్రేసు వలంటీరు అయినారు గ్రామపునర్నిర్మాణం, గ్రామోద్ధరణ, హరిజనోద్ధరణ. సహకార కార్యములకై ఆయనఎంతో కృషిసల్పారు ఆయన గ్రామవాసి కాబట్టి ఆయనకు గ్రామప్రజల కష్టసుఖములు తెలుసును, ఆయన అప్పుడే సహకారోద్యమాన్ని స్థాపించారు.

## సహకార నిర్మాణము

తొలుదొల్త ఆలమూరులో "జిల్లా కో ఆపరేటివ్ ఫెడరేషన్"ను స్థాపించారు. దానికి సెక్రటరీగా ఉండేవారు. ఆ తరువాత "బెట్టర్ లీవింగ్ కో అపరేటివ్ సొసైటీ" ని స్థాపించారు. 1938వ సంవత్సరములో "రూరల్‌బ్యాంక్"అనే సంస్థను స్థాపిస్తూ దానికి అధ్యక్షులుగా ఆయనే ఉండేవారు అది ఆలమూరు లోనే స్థాపించారు. అటువంటి బ్యాంకు ఆంధ్ర దేశములో ఎక్కడనూ స్థాపించబడలేదు అదే ప్రథమ రూరల్‌బ్యాంకు. నేడా బ్యాంకు వేల కొలది సభ్యులతో లక్షలమీద వ్యాపారము చేయుచున్నది.

1928లో ఆలమూరులోనే ఆలమూరు కోఆపరేటివ్‌ల్యాండు మార్టిగేజీ బ్యాంకును స్థాపించి దానికికూడా అధ్యక్షులుగా ఉండేవారు. ఆ బ్యాంకు ఆంధ్రరాష్ట్రములోనేగాక సంయుక్త మద్రాసురాష్ట్రములలో ప్రముఖస్థానాన్ని ఆక్రమించి పదిహేను లక్షల రూపాయలకు పైగా వ్యాపారము చేస్తోంది.

ఆలమూరులో చే నేత ప రి శ్ర మ లేకపోయినా ఆలమూరు కోఆపరేటివ్ హేండ్‌లూమ్ వీవర్సు సొసైటీని స్థాపించారు, అది నేతపనివారికి కల్పతరువు వలెనున్నది, అంతేగాక వారు లోకల్ కోఆపరేటివ్ యూనియన్ అధ్యక్షులు. ఇంకా గోదావరి కో ఆపరేటివ్‌లో సెంట్రల్ స్టోర్సు డైరెక్టరుగా, రామచంద్రపురం సెంట్రల్ బ్యాంకు కార్య నిర్వాహకులుగా మద్రాసు కోఆపరేటివ్‌లో సెంట్రల్ బ్యాంకుకు డైరెక్టరుగా, సౌత్ ఇండియా కో ఆపరేటివ్‌లో ఇన్సూరెన్సు సొసైటీకి డైరెక్టరుగా ఇంకా అనేక సహకార సంస్థలకు ప్రాతినిధ్యం వహిస్తూ సహకార సేవ చేసారు.

## సాహిత్య సేవ

ఆయన సహకారములోనేగాక పత్రికా నిర్వాహకులుగను, పత్రికా రచయితగాను విశేషమైన కీర్తిని సంపాదించారు. స్వాతంత్రోద్యమ సమయంలో "గ్రామ పునర్నిర్మాణం" అనే పత్రికను నడిపారు. ఆంధ్ర రాష్ట్ర సహకార సమ్మేళనము తరపున వెలువడే "సహకారము" అనే మాస పత్రికకు ప్రధాన సంపాదకులుగను, "ఆల్ ఇండియా కో ఆపరేటివ్ రివ్యూ" అనే ఆంగ్ల పత్రికకు సహాయ సంపాదకులుగను ఉండేవారు. సహకారము పంచాయతీల మీద ఎన్నో వ్యాసములు వ్రాస్తూ ప్రజలకు సేవచేస్తూండే

(మిగతా 9వ పేజీలో)

# 'బలవంతపు సదువులు'

యస్. శ్రీనివాసాచార్య

రామయ్య:—
(ఇంటిలోకి వస్తూ)

సరకారోల్లు సల్లగుండ
అరకదున్ని బతికెటోల్ల,
కూలినాలి శేసెటోల్ల
కూశ్లెమన్ను బోత్తరంట
యిన్నావా వో మల్లీ!
ఉన్నావా వో మల్లీ!

మల్లమ్మ:—
(లోనుండి)

యెప్పుడైన యింతేగద!
శెప్పేదేందో సరిగజెప్పు
మనలముంచె కానూనులు
మనసరకారెట్ల జేసె?
ఉలికి పడత వెందుకయా!
తెలియజెప్ప రాదయ్యా!

(బయటికి వస్తుంది)
రామయ్య:—

శెప్పడానికేమున్నది?
శెప్పమనసు రాకున్నది.
అరకకాడనేనుంటే
అడివి పనికి నువుబోతే
ఇంటికాడ పొల్లగాండ్ల
యెత్తుకొనే యెంకమ్మను
దున్నిదున్ని నలిగిపోయి,
శిన్న కూర్కు తీత్తాంటే
నాగజెడ్ల మల్లేసే
నడిపి కొడుకు నాగయ్యను,
రెడ్డోల్లకు జీతముండి
బుడ్డెదొడ్లు తెచ్చుకుంట
సదిపట్టుకొచ్చెటోడు
పెద్దకొడుకు పేరయ్యను
బడికి సదువ దోలాల్నట
పడదంటే జరిమానట.

మల్లమ్మ:—

ఏడిది యీ అన్నాలం?
యెట్ల వచ్చె నీకాలం?
పొల్లగాండ్లు సదువకుంటె
అల్లదేమి పోతాందట
అడిగెటోండ్లు లేకపోతె
ఆడిత్తరు మనలనిట్ల
పల్లె పెద్ద నారాయన
బాబుగారి కాడికెల్లి
వూల్లోల్లందరు జెప్పితె
వుపాయమైన సెపుతడేమొ.

*　　*　　*

(నారాయణ బాబు గారింటిలో వూరి ప్రజలు చాలా మంది గుమి కూడతారు)

నారాయణ బాబు:—

ఏమిటి మీరంతా యిటు
యేకముగా వచ్చినారు?

వింత లేమి రావుగదా!
విశేషాలు లేవుగదా!

1 గ్రామీణుడు:—

శెప్పడానికేమున్నది?
తిప్పలొచ్చె యీనాటికి
ఉండిలేని సంసారము
తెండుతాంటె తింకి తేశ
పైబట్టను సూత్తాండగ
పచ్చులెత్క పోయినట్లు
పొల్లగాండ్లు యింతొ అంతొ
తల్లిదండ్రి కాసరగా
తోడోడుగ వుండకుండ
తోలాల్నరు సదివించగ

2 వ గ్రామీణుడు:—

రెక్కాడక బుక్కాడని
బక్కకూలి వాండ్లముగద!
పలకలంటు, పొయ్యిలంటు
బలపాలంటని, పోరలు
యేడిపించి సంపుతాంటె
యాడినించి తెచ్చిత్తము?

3 వ గ్రామీణుడు:—

మంచిమంచి బట్టలంట
సంచులంట, శెప్పులంట
ఉన్నోల్లంటే తెత్తరు
సన్నకారు కెట్లొత్తది?

4 వ గ్రామీణుడు:—

మేమంతా సదవకుంటె
యేమైనది బాబుగారు?
మాదారిన మేముండక
పేదోల్లకు సదువెందుకు?

5 వ గ్రామీణుడు:—

యెవరికట్ట మెట్టాడిదొ!
యెవరిగోస యెట్టాటిదొ!
తెలియకుండ తోలాల్నని
బలవంతము యెందుకున్ని?
మన సరకారని నమ్మితె
మా కట్ట మిసారించకుండ
జరిమానలు యేత్తామని
జబర్దస్తి యెందుకున్ని?

నారాయణ బాబు:—

ఓరిమితో మీరుకొంత
యోచించుట మంచిదిపుడు
వేగిరి పడి ముందువెనుక,
బాగోగులు తెలియకుండ
అందరు వాకచే తీరుగ
తొందరపడి పలుకరాదు.
సర్కారెపుడైన గాని
జనులమేలు యోచించక
ఘానూనులు చేస్తుందని
కలనైనను తలపరాదు.
విద్యలేక మనదేశం
వెనుక బడెను పలు తీరుల
మూర్ఖత్వం నిండిపోయి,
ముందు చూపుకరవైనది.
పామరుల త్యాచారుల
పాలబడిరి దోచబడిరి
పెత్తనదార్లు జమీందార్లు
పెట్టుబడిని పెట్టువారు
ప్రతివారలు యెంతో కొంత
బాధింతు రమాయికులను.
పొరుగు దేశముల వారలు
త్వరితగతిని అభ్యున్నతి
పథములోన పోవ మనము
పడియున్నామిట చీకటిలో
అజ్ఞానపు తెరలు చీల్చి
విజ్ఞానపు వెలగులలో
తల యెత్తుక తిరగాలని
తలపోయును భరతమాత

ఇంకా చదువెందులకని
ఇట్టు మీరు మూర్ఖముగా
భాషించుట పోవాలనె
శాసించెను సర్కారిటు.

ఒక గ్రామస్తుడు:—

సదువుకుంటె మంచిదే
సదివిత్తె మంచిదే,
అయినా మేం పేదోల్లం
అయినందున యీగోసలు
అన్నితీర్ల యెల్లినపుడు
యెన్నైనా శేయొచ్చును.

నారాయణ బాబు:—

నిజమే మరి మీరన్నది
నిమ్మళముగా మారుతుంది.
ఏదోవొక విధముగాను
యీ సమస్య తీర్చుటకే
సర్కారెన్నో రీతుల
సర్దుబాట్లు చేస్తున్నది
అర్హతలను విచారించి
అప్పుడపుడు వుపకారపు
వేతనాలనిస్తున్నది
పేదతనము చూస్తున్నది.
కొన్నికొన్ని ప్రాంతాలలో
అన్నము నొక పూటపెట్టు
నాలోచన చేస్తున్నది
అమలులోకి తెస్తున్నది
పుస్తకాలు, పలకలు మరి
వస్త్రంబులు పంచాయతి
సమితులలో నిప్పించెడి
సౌకర్యం చేస్తున్నది
ఇన్నితీర్ల సదుపాయము
లున్నప్పటికిని మీరలు
బాలుర చదివించకుంటె
బలవంతముగనైనా
పట్టి చదువు చెప్పాలని
చట్టములను చేస్తున్నది.
మంచి యెపుడు కటువేగద!
మందు తీయనుండదు గద!
మీరెన్నన్నా గాని.
మీబాలుర చదివించక
మొప్పెతనము చూపినచో
తప్పదు మరి జరిమానా

అందరు గ్రామీణులు:—

మీరు శెప్పినాక కూడ
మూరుకులము కాగలమా!
జబర్దస్తి లేకుండానె
సదివిత్తం పొల్లగాండ్ల
ఏదోపేదోల్లం గద
ఆదుకోన్రి బాబుగారు
మాకట్టమిచారించి,
మాపిల్లల సదువులకై
సర్కారుతో యేమైనా
సాయం శేయించండ్రి.
మా తప్పులు కాసి, బాబు
మమ్ములను మన్నించుండ్రి.

# సమస్య

ఎం. వి. రమణరావు

లాలిత్యమునకు సౌలభ్యమునకు ఆంధ్ర భాష పెట్టినది పేరు. మందారమకరంద మాధుర్యములూరుచు పఠితల నూరింపఁ జేయున దాంధ్ర సాహిత్యము. దీనింగూర్చి మురిసి ముచ్చటపడి ప్రాచ్య పుయిటాలి యనని పొగడి నేర్చికొని నిష్ణాతులరై విదేశీయులే బృహద్గ్రంథముల రచించిరన దీని ప్రాశస్త్యమును నుడువుట చర్వితచర్వణ మగును. ఆ యాంధ్ర సారస్వత చమత్కృతులలో సమస్యాప్రక్రియ యొకటి.

సంపన్నతతోఁబాటు బుద్ధి సంపన్నత గూడ గల ప్రభువులు దేశపరిపాలన గావించినారు. కవిపండిత పోషకులై విలసిల్లినారు. కృష్ణరాయాదులు తమ యాస్థాన కవులకు సమస్యల నిచ్చి పూరింపఁజేసిన విధముల విందుము. సంస్కృతాంధ్రముల మాత్రమే సమస్యాపూరణము గలదు. సంస్కృతము సార్వజనీన మౌ భాషగామి యాంధ్రమే సమస్యా పూరణా ఆ ప్రక్రియకు తావలమై విరాజిల్లుచున్నది

ఆశుకవిత్వ అవధానములలో సమస్యలు పూరణార్థ మీయ బడును. ఆగంతకుడీ కవి పరిజ్ఞానమును, పాండిత్యమును పరిశీలింప నీయబడిన సందర్భములును గలవు. కఠినాతి కఠినమౌ సమస్యల నైతమవలీల బూరించిన కవికుంజరులును గలరు. "కవిజనోజ్జీవని" యను పేర పూరింపఁబడిన సమస్యలు పుస్తక రూపమున ప్రకటింప బడెననియు విందుము.

సమస్య యన పద్య పూరణార్థ మీయబడు అసంబద్ధార్థము గల పదసముదాయము. "సమస్యాతు సమాసార్థా" యని యమరమును నుడువుచున్నది. దీని కాంధ్రమునకై పదము. సాధారణముగ నది పద్యమున చతుర్థపాదమై యుండును. తక్కిన చరణముల పూరించి, యీ పాద మందలి యసంబద్ధార్థముం దొలగించి రసవంతముగ మార్చుటే సమస్యా పూరణము. ఆంధ్రమున నెట్టి పదసముదాయ మైనను నసంగతార్థ మీయదని ఋజువు పఱచుచు ఆంధ్రభాషౌన్నత్యమును చాటునది సమస్య. ఆ సమస్యా పూరణమున గల పద్ధతులలో కొన్నిటి నరయుదము.

సమస్య నొక కవి వేశ్యనుపమానముగ గొని చమత్కరించి యున్నాడు—

"ఉదారాలంకారా సులలితపదా విష్కృతరసా
సమాపన్నా శయ్యామతుల గుణ మాణిక్య సుభగా
స్ఫురద్వర్ణా భ్యర్ణస్థిత జనఘనానంద వసతిః
సమస్యా వేశ్యేవ ప్రతి పురుష మేషా విలసతి"-

ప్రతి పురుషుని అలరఁ జేయునని చమత్కరించుట కవి పాండిత్యమును భావనా బలమును చూపునే గాని మరేమియు గాదు.

సమస్యా పూరణము నందనుసరించు పద్ధతులలో అక్షరముల గాని పదములగాని చేర్చి యర్థమును సమన్వయ పఱచుటొక పద్ధతి. చేర్చబడిన యక్షరములు సమస్యార్థమునకు వైపరీత్యము గల్పించి తక్కంగల పాదములతో సమన్వయ పఱచి రసాంచిత మొనర్చును- ఉదాహరణమున కొక సమస్యం గైకొందము- "పాదమ్ములు లేని తరులు పరుగిడ జొచ్చెన్"- ఇది యసంభవమే. మరెట్లు?

తిరుపతి వెంకట కవులీ సమస్యం బూరించిన విధమిది—

కం॥ ఏడెస వానలు గురియన్
గోదావరి పొంగివచ్చె గుములుగ నందున్
వేదొరలి నీరు దృఢతర
పాదమ్ములు లేని తరులు పరుగిడ జొచ్చెన్॥

సమస్యగ నిచ్చిన దానిని మధ్యనే యాపి యన్వయము మార్చుటొక తీరు. "గణ చతుర్థినాడు ఫణి చతుర్థి"- తిరుపతి కవులే దీని నిట్లు పూరించిరి.

"ఎన్ని దినములాయె నిట నన్నుడించి నీ
వరిగి" యనిన బత్ని కనియె భర్త

నేటి కెన్నగ బది నెలలాయెగా నేడు
గణ చతుర్థి: నాడు ఫణి చతుర్థి॥

సమస్యయంతక్లిష్టము కాకపోయినను దుష్కర ప్రాసము నిచ్చి పూరింపు మనుటయు గలదు. క్త్రప్రాసముతో నున్న నీ సమస్యం జూడుడు.– వక్త్రం బుల్పది కన్నులైదు కరముల్వర్ణింప గా వేయగున్" కందుకూరి రుద్రకవి యీ విధముగ పూరించి నాడు–

ఈ క్త్రాప్రాసము కష్టమౌ ననుచు మీరెంతేని వారాడగా
వాక్త్రా సంబిది సత్కవీశ్వరుల శ్రోవల్గామి నే జెప్పెదన్
దిక్త్రా రాతికి పార్వతీశ్వరులకున్ దిగ్మ ప్రభారాశికిన్
వక్త్రంబుల్పది కన్ను లైదు కరముల్వర్ణింపగా వేయగున్॥

సమస్యల నుపమాన సాదృశ్యమున సమర్థించుటయు గలదు. అటు కథాగమనమును గమనార్హము. ఉదాహరణకు "కుంజర యూధంబు దోమ కుత్తుక జొచ్చెన్"–తెనాలి రామకృష్ణు డిట్లు దీనిం బూరించి యున్నాడు–

రంజన చెడి పాండవులరి
భంజనులై విరటుగొల్వ పాల్పడి రకటా
సంజయవిధి నేమందును
కుంజర యూధంబు దోమ కుత్తుకఁ జొచ్చెన్॥

పాండవుల గాథయు, యుపమానమును రసోదంచితముగ పూర్తి గావించినది.

సమస్య యందున్న పదముల వింగడించి ఒక్కొక్క పద మొక్కొక్క ప్రశ్నకు సమాధానముగ వచ్చునట్లు తక్కిన పాదమున కూర్తురు, ప్రశ్నలకు క్రమముగ సమాధానములు సమస్య యందు గన్పట్టును. ఇదియొక రమ్య మార్గము. "చెలువుగ రామ లక్ష్మణులు సీతకు దమ్ములు శంభు డన్నయున్" అనిన సమస్యక నూచానముగ వచ్చుచున్న పద్యముదహ రింతును–

అలరగణింప పంక్తి రథు నాత్మజు లెవ్వరు? మైథిలుండు నే
లలనకు తండ్రి? మన్మథుని లా వుశరంబులు నేవి? శాంభవీ
చెలువుని నామమెద్ది? మరి సీరియు శౌరికి నేమి గావలెన్?
చెలువుగ రామలక్ష్మణులు సీతకు దమ్ములు శంభుడన్నయున్॥

దశరథుని కుమారులు రామలక్ష్మణులు–మైథిలుడు సీతకు తండ్రి– మన్మథుని శరములు తామరలు– శాంభవి భర్త శంభుడు–సీరి శౌరి కన్నయని సమాధానములు హృద్యముగ గూర్పబడినవి–

సమస్య యందున్న పున్నటుల గాక సంధి వేరుగ విడదీసి యర్థమును మార్చుటయు గలదు. "శిరోహీనః సులోచన" అను సమస్య గైకొందము, తల లేనివాడు మంచి కన్నులు గల వాడట– పూరణ మిట్లున్నది.

"భువనంబి భర్తియస్యైకం శిరోహీనః సులోచనః
సత్యాం ప్రణమితుం స్తోతుంద్రష్టుం శ్రోతుంక్షమ ప్రభోః
ఎవని శిరము భూమిని దాల్చు చున్నదో అట్టి వాడును, మంచి కన్నులు గలవాడును నగు శేషుడు నిన్ను స్తుతించుటకు చూచుటకు వినుట కర్హుడని భావము. శిరః+అహీనయని సంధి విడదీసి పూరించుటే చమత్కారము.

పద్యమునకనేకార్థములు వచ్చునట్లు పూరించుటయు గలదు. అటు సమస్యయందెన్ని వస్తువులుండినవో అన్ని యర్థములు వచ్చును. అది కవికి శబ్దములపై గల యధికారమును, ఆతని పాండిత్య ప్రకర్షను. భావనా బలమును ప్రతిబింబింపఁ జేయును. ఇట్టి సమస్యలరుదుగ గన్పట్టును 'పానీయస్య దశానన స్యకబరీ భారస్యతుల్యక్రమః" అను సమస్యంగొనుడు. దేవేశ్వరకృతమౌ కవి కల్పలతయందీ క్రింది విధముగ పూరింపఁబడియున్నది.

"బంధం క్వాపి కదాపి చానుభవతో మోక్షం చతన్మానసే"
తోషం వర్ధయ తస్సదాసుమనసాంసీ చైః స్తితింకుర్వత
శ్రీమత్పుష్పకవాసలబ్ధయ శస స్తస్మాదనంతర్హితః
పానీయస్యద శాననస్య కబరీభారస్యతుల్యక్రమః"–

జలమునకు రావణాసురునకు కొప్పునకు ఒక్కటే క్రమమని సమస్యా భావము. మూడు వస్తువుల కనుగుణ ముగ మూడర్థములు గలదీ శ్లోకము–శబ్దముల కూర్పావిధమున నున్నది. ఎక్కడనో (సేతు రూపమున) కట్టబడుటయు విడువ బడుటయు గలదియు, మానస సరోవరమున దేవతలకు సంతో షము వృద్ధి పఱచినదియు, పల్లమున నుండు నదియు, పద్మముల వాసనచే కీర్తి పొందు జలమునకు-ఎక్కడనో (వారివలన) కట్ట బడుటయు విడువబడుటయు గలవాడును, ఆతనికి సంతోషము కల్గించిన వాడును, దేవతలకు హైన్యత కలుగజేసిన వాడును, కుబేరుని గొట్టి పుష్పకము నెక్కి తిరుగువాడగు రావణునకు– ఎప్పుడో కట్టబడుటయు విడువబడుటయుగల్గి, రసికుల కానందము గలుగజేయునదియు, క్రిందుగ నుండు నదియు, పుష్పముల వాస నచే కీర్తిబొందు కొప్పునకు–తుల్యక్రమము. పోలికలున్నవనుట మృషావాదమేమియు గాదనుట. ఇట్లనేకార్థ సంశ్రయణముగ బూరించుటే చమత్కృతి.

విచిత్రమౌ పద్ధతిని పూరింపబడిన సమస్య యొకటున్నది. "బభౌమయూరోలవశేషసింహ"–ఇటబనుండిహ వరకుగల యక్షర

ముల క్రమముననే అర్ధవంతమగు సమస్యగ కూర్పఁబడినవి. తత్పూర్వాక్షరములన్నిటిని చేర్చి క్రమము దప్పింబక చమత్కారముగ మానవల్లి గంగాధరశాస్త్రిగారిట్లు పూరించియున్నారు.–

అనేక వర్ణ క్రమరీతి యుక్తః

కఖగఘఙచఛజఝఞటఠడ

ఢణతథదధనపఫబభ

మయరలవశషసహః ॥

క్లిష్టత, చమత్కారము, పాండితి, భావనము–అన్నియు గలదీ సమస్య. అయ్యది సమస్యా ప్రక్రియకు నికషోపలమని చెప్పవచ్చును.

ఇవ్విధమున సమస్య కవి భావనాస్పందనమును, పాండిత్యాదులను, రసదృగ్గారాశపాగ్గాటిని, చమత్కృతిని ప్రతిబింబింపజేయునదై యున్నది. రసావిష్కృతికి తావలమై యున్నది. అయ్యది సహృదయ హృదయానందకరము కాకపోవునా!

ఈ సమస్య పాఠకులకు :-

"చరణము తోడ నాథునకు సాధ్వి యొనర్చు సపర్యభక్తిమై"

ఎవరైనా పూరించి పంపితే వచ్చే సంచికలో ప్రకటిస్తాము. —సం.

# 'సహకార పితామహుడు'

(3వ పేజీ తరువాయి)

వారు. (1) "సకలార్థ సహకార సంఘములు–నిర్మాణము నిర్వహణము ఎందుకు?" (2) "భూమితనఖా బ్యాంకులు" అనే రెండు గ్రంథములను రచించారు. ఆస్థానకవి కీ॥ శే॥ శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిగారిచే "శంకరవిజయం" అనే పద్య కావ్యాన్ని వ్రాయించి దాన్ని కృతి తీసికున్న కవి పోషకులు.

ఇంకా సాహిత్య సభలంటే మరీ ఇష్టపడేవారు. "తరుణ సాహితీ సమితి" ని ఆలమూరులో వారే ప్రారంభోత్సవము చేసి అనేక సహాయ సహకారములందజేసారు. 1934వ సంవత్సరంలో గాంధీజీ సత్యనారాయణగారిని స్వయంగా "వార్ధా" పిలిపించి ఒక రోజు చర్చించారు. ఉప్పు సత్యాగ్రహం, వ్యక్తి సత్యాగ్రహాలలో పాల్గొని కారాగార శిక్ష లనుభవించారు. 1952 వ సంవత్సరంలో మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిలు సభ్యులుగాఉండేవారు. "ఆలమూరు" అనే పేరు చెబితే శ్రీ సత్యనారాయణగారి ఊరేనా! అని అడుగుతారు యిప్పుడు ఎవరైనా. ఆలమూరు ఒక సహకార పునాది. ఆ పునాదికి రాళ్ళువేసి కట్టుదిట్టం చేసినది శ్రీ సత్యనారాయణ గారే!

## నిర్యాణం

కామెర్ల రోగంతో 1955వ సంవత్సరం సెప్టెంబరు 30వ తేదీన ఆ వ్యాధి యెక్కువ కాగా బొంబాయి నగరములో సోదరులను, ఏకైక పుత్రులను, మనుమలను, ఆలమూరు ఫిర్కా ప్రజలను, సహకార సేవకులను దుఃఖములో ముంచి వేసి అమరులైనారు. సెప్టెంబరు 30 వ తారీఖున వారి వర్ధంతి ఉత్సవము.

# "తెలంగాణ వేంకటేశ్వరస్వామి"

టి. రాజేశ్వరరావు

త్రైలంగాణపు పుణ్య భూమిలో ప్రసిద్ధినొందిన ప్రదేశాలు, దేవళములు మరియు పుణ్య తీర్థాలెన్నో కలవు అందులో కొన్ని నామ రూపాలు లేకుండా పోయినవి–మరికొన్ని శిథిలావస్థలో యున్నవి. ఇంకొన్ని పూజార్చనలు లేక పాడుపడిపోయినవి కొన్ని ఇప్పటి పూర్వపుఔన్నత్యం పొందుతూ వేలాది భక్తకోటికి పవిత్ర యాత్రా స్థళాలుగా గణితికెక్కినవి. అట్టి వాటిలో "భద్రాచలం" "జీడికల్లు" "యాదగిరి", "వేములవాడ", "ధర్మపురి", "కొరవి" "అయ్యన వోలు", "బాసర", నీలకంఠేశ్వర దేవాలయం మొదలగునవి పేర్కొనదగినవి. ఇవి కాక తెలంగాణపు అన్ని జిల్లా తాలూకాలలో గల కొండలపై అసంఖ్యాకములైన దేవాలయములు పూర్వపు భారతీయ సంస్కృతిని ఎత్తిచూపుతూ ఇప్పటికినీ ఉన్నవనుటలో అతిశయోక్తిలేదు.

యీ దేవాలయములు ప్రజలకు అందుబాటులో లేని కారణంగా–లేక ఆయా ప్రదేశాలలో ఇదివరకున్న పురాతన నగరాలు శిథిలమైపోయినందువలన ప్రజా సామాన్యం వాటి ఉనికిని తెల్సుకోలేక పోయినారు. ఆనాటి సాంఘిక వ్యవస్థకు ప్రతిరూపాలైన ఈ దేవాలయములు, సాంస్కృతికి నిలయమైన కుడ్య అవశేషాలు ఇప్పటికి చెక్కు చెదరక మొక్కవోకుండా యుండటం భారతీయుల భాగ్యమనక తప్పదు.

ఓరుగల్లు కాకతీయ సామ్రాజ్య పతనానంతరం త్రిలింగ్యాత్మకమైన ఆంధ్రదేశమును విజయనగర రాజులు పరిపాలించిరి. విజయనగర రాజులకాలంలో ఆంధ్రదేశంలో దైవచింతన ప్రజలలో ముమ్మరంగా ప్రచారం చేయబడెను శైవ, వైష్ణవ, జైనమరియు బౌద్ధ మతాలు–వాటికి సంబంధించిన దేవాలయములు అసంఖ్యాకముగా నిర్మించబడెను. అంతకు పూర్వం–చోళచాళుక్య రాజులచే నిర్మించబడిన దేవళములు పునరుద్ధరించబడెను అయితే శైవమత ప్రచారం కన్నా వైష్ణవ మత ప్రచారం ఆనాడు ఎక్కువగా యుండెననుటలో సందేహం లేదు తత్కారణంగా విజయనగర సామ్రాజ్యంలో వైష్ణవాలయాలు బహుళంగా వెలసెను.

ఆంధ్రప్రదేశ్‌లో "నిత్యకల్యాణం పచ్చతోరణం" తో తులతూగుతూ ప్రతినిత్యం వేలాది భక్తజనానికి పుణ్యస్థళాలుగా విలసిల్లుతున్న వైష్ణవాలయములు చాలా కలవు. అందులో, భద్రాచలం ఖమ్మం జిల్లాలోను, తిరుపతి, చిత్తూరు లోను, ఒకటి రాయలసీమ లోను మరియొకటి తెలంగాణపు వరంగల్లు జిల్లాలోను కలవు. అయితే తిరుపతి వెంకటేశ్వర క్షేత్రం-నెల్లూరు వెంకటేశ్వర క్షేత్రం నిత్య నైవేద్య దీపారాధ అర్చనలతో యున్నవి. కాని వరంగల్లు జిల్లా మానుకోట తాలూకా అనంతారం గ్రామం కొండపైనున్న "వెంకటేశ్వర క్షేత్రం" ఏ కారణం వల్లనో పాడుపడిపోయింది. కారణములు ఏవైనా తిరిగి అది పునరుద్ధరించబడటం చాలా ముదావహం.

గత సంవత్సరం మానుకోట పట్టణంలో నివసించుతున్న ఒక మార్వాడి భక్తుని స్వప్నంలో శ్రీ వేంకటేశ్వరస్వామి దర్శనమిచ్చి తన ఉనికిని తెల్పి నిత్య నైవేద్యం దీపారాధనలు జరుపమని కోరెనట. తాను తెలుగు వారల ఆరాధ్యదైవాన్ననీ అందువలనే "రాయలసీమ", సర్కారు జిల్లాలలో వేరువేరు ప్రాంతాలలో యున్నాననీ అటులనే తెలంగాణ ప్రాంతంలో కూడా నివాసం చేయదలచానని తెల్పి అంతర్ధానమయ్యెనట. శ్రీ వేంకటేశ్వరస్వామి ఆదేశానుసారం ఆ మార్వాడి భక్తుడు మరునాడు ప్రాతఃకాలమున లేచి ఆ ప్రదేశమును కనుగొని అక్కడే నివాసం ఏర్పరచుకొని నైవేద్య దీపారాధనలు జరుపుతున్నాడు. ఈ విషయం తెలిసిన వందలాది ప్రజలు స్వామి దర్శనానికి ప్రతి శని–ఆదివారములు తండోపతండములుగా వచ్చుచున్నారు. తమ అభీష్టములను ఈడేర్చుకుంటున్నారు.

ఈ వేంకటేశ్వర క్షేత్రం మానుకోట పట్టణమునకు తూర్పు దిశన సుమారు మైలున్నర దూరంలో ఒక కొండపై నున్నది ఈ కొండనానుకొని మరొక కొండ యున్నది. ఈ రెంటి మధ్య ఓ తటాకం కూడా కలదు. ఈ కొండ ఎత్తు సుమారు రెండు వందల అడుగులుండి మధ్యన ఆలయం కలదు. ఆలయ నిర్మాణం చిన్న-చిన్న శిలలతో ఇటుకలతో నిర్మించబడింది మూల విగ్రహం దరిదాపు ఆరడుగుల ఎత్తు గలిగి చతుర్బాహువులలో శంఖ, చక్ర, గదా, పద్మాలు కలిగియున్నవి. ఈ విగ్రహం తిరుపతిలోని వెంకటేశ్వరస్వామి విగ్రహమంత పెద్దగా యుండి తు. చ. దానినే పోలియుండటం మరొక విశేషం. ఆలయ సింహద్వారముపై గజలక్ష్మీవిగ్రహ చిహ్నం యుండుట వలన ఈ దేవాలయ నిర్మాణము విజయనగరరాజుల కాలంలోజరిగి యుండవచ్చునని భావించ వచ్చును

కాబట్టి ఈ దేవాలయం యొక్క సమగ్ర చరిత్ర గురించి పరిసర ప్రాంతాలలో యున్న శిలా శాసనముల వల్ల కావి లేక మరేవిధముగానైనా రాష్ట్ర పురాతత్వ శాఖవారు పరిశోధన జరిపి దేవాలయ పునరుద్ధరణకు పూనుకొనుట చాలా అవసరం, ఈ ప్రయత్నంలో ప్రజలు కూడా వారితో సహకరించటానికి సన్నిద్ధులుగా యున్నారు కావున వారు ఈ కార్యక్రమాన్ని చేపట్టాలని ఆశిద్దాం.



# కాలజలధి

మానేపల్లి సత్యనారాయణ

లోతు తెలియని గభీర సముద్రంలో
సంవత్సరాలనే కెరటాలు-
కాలమనే మహార్ణవంలో
విషాదజలాల తరంగాలు-
మానవజాతి కన్నీటితో ఉప్పనై,
పగుల్తున్నాయ్.

ఓ అపార కాలజలధీ !
నీ పాటు పోటుల్లో
ఆడుకుంటున్నాయ్
నీతి నియమాల హద్దులు.

ఆకలితో ఆహారం కోసం
ప్రతిఫలం యివ్వలేని ఒడ్డమీద
విరుగుతున్నాయ్ నీ తరంగాలు
పరుగులెడుతున్నాయ్ నురగలు.

నిశ్శబ్దం నీకురాదు !
నీది ఘోరమైన నిరంతర ఘోష !
లోతు తెలియని ఓ సంద్రమా !
అపార కాలజలధీ !
ఎవ్వరేమి చేయగలరు నిన్ను !!

(మహాకవి షెల్లీకి కృతజ్ఞతతో)

# బ్రహ్మ భావన

కేతవరపు రామకోటిశాస్త్రి

అరిషడ్వర్గము మూర్తమై వెలయు మాంసాపూర్ణ చక్షుస్సులా
హరిదశ్వప్రతిమాన మన్నభ్రమ ఆర్షాదిత్య తేజచ్ఛటన్
పరిభూతమ్మొనరింప జీవితమునే వ్యర్థమ్ముగావించుకొం
చురిగోలంబడి కొట్టుమిట్టయితి-ఓహో-నేను గాధేయుడన్.

నేనును రాచపుట్టువును—నిస్తుల తేజమునై అఖండ బ్ర
హ్మానుభవమ్ము రూపమునునైన వసిష్ఠులతోడబద్ధవై
రాన సమాత్తమూఢమతిలాలసతన్ త్యజియించి సత్త్వ సం
ధానము చేసికో బలము తక్కి తపించితి నింతకాలమున్.

ధ్యానము లేక కర్మమున తత్పరతాభినివేశమైననున్
పూనక రెంటికిన్ చెడిన పోలిక తోచుచునున్న దింతకున్
దానిది నన్ను ఆత్మహననాశ్రయుగా నొనరించి చూచుకో
స్థానమసూర్యమంధతమసావృత లోకములోన నెట్టునా ?

బలసి ప్రవృత్తి శక్తులు బలోద్ధతి ఏకముఖాన ఏచి ఆ
తొలి ఋషి గుండె తల్పులను త్రోయగ-బిట్టు చలించి పోయి సం
కులపడి తీవ్రమై బెడిసి కొట్టిన ప్రక్కలు రెండు నౌచు రూ
పులు గయికొన్నచో అయిరిపో అలమేనక యన్న రంభనా—,

ఆ ఋషిమీద నెత్తిన అహమ్మమ గర్భ మహాసి మన్యువున్
పేరిచి పెంచి వారు ఋషి పేరని ఉండగనీయబోమునా
మారిమసంగినట్లు తగుమై ప్రయతింత్రు బిడౌజుకెంతయున్
కూరుచు వారువోలె తమకోసరమై ఋషివంచ నేచ్ఛలై—.

కామము దుష్ట మిద్ది తనకై తను ఐహికమైచనన్ మరిన్
క్షేమము యోగమార్గమున చిగ్రసమందు రతింగనన్ అహో
నీమము చేసె.వేదఋషి నేతృ విచిత్ర వితర్కబుద్ధి-తా
నై మని యట్టులే జగము నైగమ మార్గమహా ప్రకాశమై-.

నీవరిముల్లు గర్భమున నిండిన నిర్గుణమౌ అణుత్వ మా
శావధులెల్ల వ్యాప్తమయి సాగు మహత్తుగనేక కాలమం
దేవిధి కానుగల్గినది? ఇద్ది విచిత్రము సృష్టి. బ్రహ్మ వి
ద్యా విదితమ్మునున్ అహరహస్మరణీయము దర్శనీయమున్,

ఆ విద్యావశబుద్ధినై చనెడి యూహంజేసి చింతింపకే
అవంతైనను జీవిలో వెలుగు దృష్టా దృష్ట కాంక్షధ్వ మం
దావేశమ్మున తాపసాకృతిని పూనన్ వచ్చి విఘ్నాలు తా
కావించెన్నను ఆత్మదర్శన విధాఖండ స్వరూపజ్ఞగా.

కామక్రోధములన్ జయించుటకునైగా ఈః తపస్సుల్-సరే
కామమ్మున్ చనెమేనలో కలసి-పోగా ఉన్న క్రోధమ్ముతా
నై మాయమ్మును రంభజాడచనె-విద్యా బుద్ధి చేకూరె. ని
ష్ఠామాన్యంబగు నాత్మతేజమును నాస్థాపింతు ధామమ్ముగా.

ఇదియొక వెల్గుగా కనులనేర్పడిలోజని ఆత్మకైరవం
బుదరిపడన్ స్పృశించి బహుళోర్జము కూర్చి తదంతరానతా
నొదిగి-సమస్తమైతను-ననున్ వెలిగ్రక్కె-మహోచ్ఛకౌముదీ
మృదులమనోజ్ఞమై పరమమేదురమై చిదనంత బింబమై-.

ఇది ఎన్నాళ్ళకు పూర్తిగా తెలియనయ్యెన్-నేనెవండన్- జగం
బిది సర్వమ్మును నాదికాదా ? మరి యేదీ నాదికాదేమి ? నా
యెదనేకానిది నేనుగా అదియు నేనే నన్ను కానట్టిదై
కుదియించున్ గుడుసుళ్ళు వెట్టు-ఇకనాకుంగావు-నేలేనునున్-.

నేననుభావమే విడిచి నిల్చిన నాకు వసిష్ఠతోడవై
రానికి తావులేదిక-పరాత్పరమైన మనస్సులోన కా
మానికి గాని క్రోధమున ప్రమందగగానిక లేడు-నేను నే
గానను బ్రహ్మ భావన సుఖంబును దుఃఖము పొందకుండుదున్-.

# నాటకంలో - నాటకం

(మృచ్ఛకటికం చదివి)

ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి

## పూర్వ రంగం

(రాత్రి 12 గంటలయింది)

మృచ్ఛకటికం ముగించి నిట్టూర్చాను.

త్రావలింతలతో కళ్లు మూతలు పడుతున్నాయి. చేతుల్లోంచి పుస్తకం జారి గుండెలమీదకి ఒరిగిపోయింది. మెలకువకు నిద్రకు మధ్యనుండే రేఖ చెరిగిపోతున్నది పుస్తకం పుటలోంచి కాబోలు– నిట్టూర్పులు .. అట్టహాసాలు .. సన్నని వీణాధ్వని .. బండి మువ్వల గలగల .. కాలి అందెల రవళులు .. వర్షధారల టప టపలు .. ఒలగాపులగంగా వినపడుతున్నాయి.

తడిగాలితో కలసి. కదంబ కుసుమాల చల్లని సువాస నలు .. ఎదుట అంతా చిక్కని చీకటితెర.

తెరవెనకనించి...

"లింపతీవ తమోఽంగాని వర్షతీవాంజనం నభః।
అసత్పురుష సేవేవ దృష్టిర్నిష్ఫలతాం గతా॥"

అంటున్నారెవరో, నవ్వొచ్చింది. చీకటికి ఎంత అపురూప కల్పన!

చీకటి వంటికి పూత పెడుతున్నది. కాటుక వాన కురుస్తు న్నట్టుంది. దుర్జనుడికి చేసిన సేవలాగు చూపు నిష్ఫల మయి పోయింది

చీకటితెర ఇటు కదలి అటు కదలి పైకి చుట్టుకుపోయింది. విశాల మయిన రంగ మండపం. మబ్బురంగు కాంతి పొర అంతటా వ్యాపించింది. క్షణం నిశ్శబ్దం—

తళతళ లాడే కత్తిలాటి ఒక కాంతి ధార చర్రున వచ్చి రంగు వెలుగును రెండుగా చీల్చి తెల్లని బాట ఏర్పరచింది. బాటలో గునగున పరుగెత్తుకుంటూ వచ్చి ఒక చిన్న మట్టి బండి మధ్యగా నిలచింది. దాని కొనకొక సన్ననితాడు కట్టి చీకటిలో ఎవరో పట్టుక నిలచున్నారు.

బండివైపు రెప్పవాల్చకుండా చూస్తున్నాను. బండి క్రమంగా ఎదిగి పోయింది.

బలిసిన రెండు ఎడ్ల మెడపై కాడి మోపిన సొగసైన పెద్దబండి ఎడ్ల మెడలో మువ్వల సవ్వడి.

ముందువెనుకల లేతరంగు పట్టు తెరలు.

తెర నెమ్మదిగా తొలగి ఒక అపూర్వ వ్యక్తి కిందికి దిగి ఎదుట నిలచింది.

అపూర్వ శోభామూర్తి తలయెత్తితే గుప్పున పరిమళించే పచ్చ కర్పూరపు చల్లని అందము.

బెదరిన ఆశ్రమ హరిణాలు ఆకాటుక కళ్లల్లో నుంచి తొంగి చూస్తున్నాయి

కుంకుమపువ్వు రంగు చీర...దానికి తగిన స్తనవల్కలం.. అజంతా శిల్ప పద్ధతిలో ముడిచిన జడలో ఎర్రనివి, తెల్లనివి పువ్వులు... జరీ ఉత్తరీయంపైన...దాని నుండి...ఉండిఉండి జాజిపూల పరిమళం)

## అపూర్వ రంగం

ప్రేక్షకుడు

(ఆశ్చర్యంగా) ఎవరమ్మా నువ్వు?

వ్యక్తి

(నిట్టూర్పు)..........................

ప్రేక్ష

స్వర్గ సీమల చిక్కని మాధుర్యాలు విసుగెత్తి భూలోకానికి నడచి వచ్చినా ఊర్వశివా?

వ్యక్తి

(నవ్వి) నక్కను దేవలోకంతో కలిపి వినోదించే స్వప్న శిలివా?

ప్రేక్ష: (ఉలికిపడి) వినయంలో ఎంత చక్కని ఉపాలంభనం! అపూర్వ శోభావతి! చంద్రరేఖ భూమి మీదనే పుట్టాను అంటే ఎవరు నమ్మగలరు.

వ్యక్తి: కళంకాని చూసి నువ్వు శశిరేఖవు అంటే మాత్రం నమ్మ-తారా సాధుశీలీ!

ప్రేక్ష: కఠోర అగ్నిపరీక్షలకు అగ్గమైన స్వర్ణ సీతవా అమ్మా?

వ్యక్తి: స్త్రీజన పుణ్యరేఖ ఆమె చరణ ధూళిముట్టడానికైనా తగను.

ప్రేక్ష: నేను నమ్మను తప్పక ఆ కోవలోని మణి పూసవు. మా ఊర్వశి పక్క శకుంతల సరసను, జానకీదేవి చెంత కూర్చోవలసిన దానవు. ఎందుకమ్మ అంతదిగులు?

వ్యక్తి: అమాయకుడా, నీ ఉదార బుద్ధితో నన్ను గొప్ప చేసి ఏం లాభం? భయంకర సత్యం నీలినీడలా నన్ను విడవకుండా వెంటాడుతూనే ఉంది.

ప్రేక్ష: దీపానికి నీడ తప్పదు నేను దీపాన్ని ప్రశ్నిస్తున్నాను.

వ్యక్తి: నాసత్యం హాలాహల మంత చేదు. నువ్వు భరించలేవు.

ప్రేక్ష: (నిర్లక్ష్యంగా) కళామౌళికి ఆ భయంలేదు. ఎంత విషాన్న యినా నిశ్చితం కంఠంలో భరించగలడు. అబద్ధపు రంగులతో సత్యాన్ని కప్పిన కొద్దీ విజృంభిస్తుంది. భయం ఎందుకమ్మా?

వ్యక్తి: సత్యం నిత్యం నామీదకురిసే అవమాన తిరస్కారాలకు మనస్సు ఎండి తోడిమానవులమీద విశ్వాసం. ఆసక్తి కోల్పోయాను. కాని నీ కళ్ళలోని సానుభూతి, మానవత్వం నాలో అణిగి పోయిన ఆశనుమళ్ళా మేల్కొలుపుతున్నాయి., నీ కుతూహలాన్ని నొప్పించలేను.

ప్రేక్ష :- అయితే సందేహ మెందుకు?

వ్యక్తి :- విను. నీవు మొట్ట మొదట చూసిన చిన్న మట్టి బండి మొదటి చక్రాన్ని.

ప్రేక్ష : (ఆలోచిస్తూ) అంటే?

వ్యక్తి :- ఉజ్జయినీ పౌరుల పాదాల కింద నలిగిన ధూళి కణాన్ని.

ప్రేక్ష :- (అర్థం అయినట్టు) ఓహో ......

వ్యక్తి :- కులహీన వేశ్యను.

ప్రేక్ష :- ఇక చాలు . . . చెప్పకు

నాకు తెలుసు. నువ్వెవరోనేను నాభాషలో చెప్పనా?ఉజ్జయినీ సమాజపంకంలో ఉద్భవించి శీల పరిమళంతో దిక్కులను నింపిన శతపత్ర సుందరివి. వసంత సేనవు అవునా?

కుల గర్వాలతో, కుటిల బుద్ధులతో కుష్కించి పచ్చని మానవత్వాన్నే రాల్చివేసుకున్న ఉజ్జయినికి పునర్జీవమిచ్చిన వసంత రాణివి కావా?

వసంత :- వద్దు .. వద్దు .. నేను ఏ ప్రశంసనూ కోరను. సాటి ప్రాణిగా చూస్తే చాలునని ఆశించాను. కాని అది కూడ దుర్లభమైంది. ఉజ్జయినీ దృష్టిలో నా యథార్థ స్థితి తెలుసునా? బాట పక్క మొలిచిన పూల తీగను. నా లావణ్య యౌవనాలు అంగడిలో పెట్టిన అమ్మకపు వస్తువులు.

పిచ్చివాడా, వేశ్య అంటే ఏమిటనుకున్నావు? స్మశానంలో పడ్డ పువ్వు!

అందరికీ అందుబాటులో ఉండే దిగుడు బావి. ఏటిలోని నావ. తోవలోని తీవ. ఈ నైచ్యంలో ఎంత దుఃసిల్లి క్రుంగి కృషించానో ఊహించ గలవా?

ఈ మురికిలో నుంచి బైట పడడానికి పర్వతాలతో ఢీకొని తల పగల గొట్టుకున్నాను. సహనం, ఔదార్యం మెచ్చించి దుఃఖం కొని తెచ్చుకున్నాను. చేతికందిన జీవన మాధుర్యం క్షణంలో నేల పాలయి పోయింది.

ప్రేక్ష :- అన్నీ నిజమే. కాదనను. కాని ఆ సహనంతోనే. ఔదార్యంతోనే కుల కళంకాన్ని కడిగివేసి సుగుణకాంతితో ఉజ్జయినే కాదు, సర్వ మానవతీ లోకాన్నీ వెలిగించావు. నీ జీవన నిష్ఠతో ఒక కొత్త సూత్రాన్ని సృష్టించావు. "కులం గొప్ప చెప్పుకొని ఏం లాభం. గుణం గొప్ప కావాలిగాని సుక్షేత్రంలో పుట్టినా ముళ్ళ పొదలు ఎప్పటికి గొప్పవి కానేరవు"

వసంత :- (చిరు నవ్వుతో) అప్పటికీ ఇప్పటికీ ఆ ముళ్ళ పొదలే మందరాలై కూచున్నాయి.

ప్రేక్ష :- పూర్తిగా ఒప్పుకోలేను. అందులో పారిజాతపు మొక్కలూ ఉన్నాయేమో! ఈ మాటలు మరిచి పోయావా? వసంత రాజ హంసను చేర దగ్గ రాజహంసి. ఆమె నగర లక్ష్మి. చేతిలో పద్మం పెట్టుకు పుట్టని శ్రీ దేవి.

వసంత :- వాటిమీద ఎందుకో నాకు విశ్వాసం లేదు. అవి లోపాన్ని కప్పి పుచ్చడానికి పలికిన ఓదార్పు మాటలేమో గాని సహజంగా నా అర్హత మీద వచ్చి నట్టు నా చెవులకు వినిపించవు.

ప్రేక్ష :– కాదు. నీ సుచరిత్ర మీద నీకు విశ్వాసం కలిగించని మనస్సు చేసిన ఇంద్రజాలం అది.

నిరుపేదఅయిన పురుషోత్తముణ్ణి కోరి వరించిన అసాధారణ శ్రీదేవివి కావా? భయంకర రాక్షసుల క్రౌర్యంతో పోరాడి హింసా సహస్రాలను సహించి తుదకు హృదయేశ్వరుణ్ణి కలుసుకున్న జానకీ దేవికి నువ్వు ఎందులో తక్కువ తల్లీ!

వసంత :– వారు కులపాలికలు. దాంపత్య ధర్మ విశుద్ధ మూర్తులు. పావన గంగా నదికీ, బాట పక్క కాలువకూ పోలికా మనిషీ?

ప్రేక్ష :– స్థూలంగా కనబడే భేదమిది. సూక్ష్మదృష్టికి నీ వర్తనం ఎంత ఉదాత్తము, ఎంత హృదయంగమమో నీకు తెలుసునా? మదన దేవాలయంలో ప్రేమజ్యోతిని వెలిగించి ప్రియునకు నివాళులిచ్చిన అప్సరః కన్యకవు.

వెన్నంటిన ధూర్తుణ్ణి తప్పించుకొని వలచిన ప్రేమమూర్తికి హృదయ మిచ్చి వచ్చిన కుల స్త్రీవి, ఉజ్జయినిలో నువ్వు చేసిన ప్రతి పని మా అంతరంగంలో చెరగని ముద్రలుగా నిలిచి పోయాయి గదా!

నీ చేతి సువర్ణ కంకణాల్లో ఒకటి వెరితి అయితే ఏ దీనుడికో దానం చేశావన్న మాట. ప్రాణి కదలడానికి వెరచే వర్షధారా పాతంలో ప్రాణాలకు తెగించి హృదయపతిని దర్శించడానికి నువ్వుగాక ఇంకెవరు వెళ్ళ గలరు?

పసివాని కంట నీలాలు కారితే చూడలేక పసిడిముద్ద అంతా ఊరిచి నిశ్చింతగా వాడి చిన్న చేతిలో ఇంకెవరు పెట్టగలరు?

మహా మూర్ఖుని ఇనుప పిడికిలిలో కంఠనాళం బిగిసిపోతూ ఉంటే మనోనాథుని నామం తుదిసారి ఉచ్చరించి నేలకు ఒరిగి పోయే భార్యలెందరు?

నీ ప్రేమ తపస్సుకు దారుణ త్యాగాలకు మెచ్చి ఆర్యక మహారాజు నిన్ను కుల వధువును చేసి నీ ప్రియునకు అర్పించడం నీ లోకోత్తర జీవితానికి బహుమానం కాదా?

నీ వన్న మట్టి చక్రం దొర్లి దొర్లి సువర్ణ సౌధానికి చేరి తానూ స్వర్ణ మయమై పోయింది.

(వసంత మౌనంగా అదృశ్య అయింది)

ప్రేక్ష: (వెతుకుతూ) ఏదీ వసంత? ఏది?

(హఠాత్తుగా ఎదుట ఇంకొకమూర్తి)

మూర్తి: ఎవరికోసం వెదకుతున్నావు?

ప్రేక్ష: స్ఫురద్రూపీ, నువ్వెవరు? ఎక్కడో చూచినట్లు జ్ఞాపకం

మూర్తి: (చిరునవ్వుతో) ఆ మట్టిబండి రెండోచక్రాన్ని.

ప్రేక్ష: (స్ఫురించి) ఓహో...చారుదత్త భట్టారకా, నమస్కారం.

చారు: (ఆశ్చర్యంగా) ఎట్లా కనుక్కున్నావు? .

ప్రేక్ష: బాగుంది. సూర్యుడి పేరెట్లా తెలిసింది? ఆరూపసౌష్ఠవం, ఉన్నత నాసిక, విశాలనేత్రాలూ చెబుతున్నాయి ఇతడొక మహాపురుషుడని.

చారు: వట్టిది, వట్టిది. నీ గౌరవ వచనాలతో నన్ను సిగ్గుపరచకు. నీ ఎదుట నిలిచినవాడు ఉజ్జయినీ ఏకైకదరిద్రుడు. స్త్రీ హత్యా పాతకం పై బడి వధ్య శిలఎక్కిన దురదృష్టవంతుడు ఉపరి. వేశ్యా సంపర్క కలుషితుడు.

ప్రేక్ష: అని ఉజ్జయినీ మూర్ఖజనులన్నారు. కాని బుద్ధిమంతులేమన్నారో తెలుసునా? ధన దరిద్రులు కొందరైతే గుణ దరిద్రులు కొందరు. ధన దారిద్ర్యం రావచ్చు పోవచ్చు. కాని గుణదారిద్ర్యం స్థిరమైనది. అట్టివాడే నిజమైనదరిద్రుడు. అలాంటివారు మీ ఉజ్జయినీ సౌధాల్లో ఎంత మంది ఉన్నారో ఎప్పుడయినా చూశావా?

చారు: మాటల్లో చమత్కరిస్తే యథార్థం దాగుతుందా? ఒకప్పుడు ఏమైతే యేం, ఇప్పుడు పండ్లులేని మోడుచెట్టును. నీటి చుక్కలేని సరస్సును. అర్థులేకాదు ప్రియ మిత్రులు సైతం మా ఇంటి చాయలకురారు. ధనం పోయినందుకు విచారం లేదు ప్రియమిత్రుల స్నేహానిక్కూడా దూరమైనందుకు బాధ పడుతున్నాను.

ప్రేక్ష: పోనిద్దూ. ఈ డబ్బు చేసేగారడీ చూస్తే మహా తలనొప్పి నాకు. గుక్కెడు నీళ్ళు తాగటానికి వీలులేని చెరువుల్లోనే కావలసినంత నీరు. చేతికెముక లేకుండా దానం చేసి పేదవాడవైన భాగ్య శాలివి నువ్వు. నీ మనస్సులో దారిద్ర్యం ఏది? చిన్న బంగారపు నగకు బదులుగా అమూల్య రత్న హారం ఇచ్చివేసిన ఉదారుడవు. దొంగ నిరాశతో పోయినాడే అని దుఃపిల్లే కరుణా శాలివి. మెప్పించిన ఒక సాహసిపై ప్రియ మిత్రుడిచ్చిన విలువైన ఉత్తరీయం విసరి వచ్చిన నిర్లిప్తుడవు.

చారు: నువ్వునన్ను సమర్థించి ఏం లాభం? నామీద వచ్చినహత్యాభియోగం ధనదురాశ చేత ఒక నిరపరాధ స్త్రీని చంపినందునే గదా! ఈ అపకీర్తి ఒక్కటే చాలదా నా జీవితం మీద మాయని మచ్చగా నిలవడానికి.

ప్రేక్ష: ఆ అభియోగమే నీ చరిత్రకు గీటురాయి అయి మహా పురుషులతో బాటు నిన్ను మా పూజా పీఠం మీదకు తెచ్చింది.

వసంతసేన నగలు నీ దగ్గరకు ఎట్లా వచ్చాయో వివరిస్తే-కనీసం – ప్రాణరక్షణ కోసం – న్యాయస్థానంలో కనపరచిన నగ వసంతసేనది కాదంటే- నేరం నిలబడకుండా పోను. కని చారుదత్తు డట్లా చేస్తే ఇంకేముంది. అసత్యం చెప్పడు ఆర్యక కథ వెలి గక్కడు. వసంత లేని బతుకూ బతకడు ఉరిశిక్ష వేస్తే నిశ్చలంగా వెళ్ళి వధ్య శిల ఎక్కుతాడు.

చారు :- అది నా ప్రజ్ఞ కాదు. పరిస్థితుల ప్రభావం ఒక సంఘటన మీద ఇంకొక సంఘటనగా విధి చేతి కీలు బొమ్మనై నడిచి పోయాను.

ప్రేక్ష :- కాదు విధే నీ చేతి కీలు బొమ్మ అయి చెప్పి నట్లల్లా నడిచింది.

ఆర్యకుణ్ణి రక్షించ దలచావు. రాజును ఎదురొడ్డి పైకి పోక్కకుండా రక్షించావు. అక్కడ విధి నీ త్యాగానికి లొంగి వధ్యశిల నుండి రాజ్యాధిపత్యానికి నడిపించింది.

ప్రియురాలు వసంతను విడువ లేక మృత్యువు నాహ్వానించావు. వచ్చింది. ఏమి చేయ గలిగింది? తుదకు విధి వసంత రూపాన లొంగివచ్చి నీ మృత్యువును తుడిచి యశఃపరిమళాన్ని దిక్కులకు పంపింది

సామాన్యుడు విధికి లొంగి తిప్పి నట్లల్లా తిరిగితే వీరునికి విధి చెప్పి నట్లల్లా వింటుంది.

చారు : పేద సార్థవాహ పుత్రుని నేను వీరుణ్ణా? హాస్యాస్పదం.

ప్రేక్ష : ధర్మ దయా నిష్ఠలో మడమ తిప్పక ముందుకు దూకే వారంతా వీరులే. ఆ విశాలార్థంలో నువ్వు మహా వీరుడవు.

దిన దిన గండాలు దాటి దయ్యాలతో పోరి తన్ను చేరిన ప్రేయసిని అవమానించక ఆమె కోసం ప్రాణాలు తృణీకరించిన కొత్త రామచంద్రుడవు.

చేతికి చిక్కిన మహాపకారిని దయా సాగరుడవై మన్నించిన జీమూతవాహనుడవు.

శాప వశం వల్ల పుడమికి వచ్చి మనసిచ్చిన ఊర్వశిని చిన్నబుచ్చక హృదయానికి హత్తుకొన్న పురూరవశ్చక్రవర్తివి. అంతే కాదు. అన్నింటినీ మించిన కళా జీవివి. ఆ కటుదారిద్ర్యంలో కళాస్వాదనమే నిన్ను మానవ మృదుత్వాన్నించి దిగజారి పోనివ్వక మరింత ఉన్నతుణ్ణి చేసిందేమో. మిత్రుడు రేభిలుని సంగీతానికి నీ ఇచ్చిన మధుర వ్యాఖ్యానం ఇప్పటికి నా చెవుల్లో మోగుతూనే ఉంది.

ఆ లలిత కోమల గానాన్ని ఆస్వాదించడంలో ఎంత రసికత! వీణ తీగలలో ఒక రమణీ మణి కూర్చుని పాడుతున్నదని చమత్కరింపు కదూ! ఈ రసజ్ఞతకే అఖండైశ్వర్య సంపన్న వసంత నీ పాదాల ముందు వాలిందేమో. పాపం దొంగ నీ ఇంట్లో ప్రవేశించగానే ముందు ప్రత్యక్ష మైనవి మృదంగం, మురళి, వీణ, పుస్తకాలు.

చారు: మిత్రమా, ఆమాట నిజం నాదురంత దారిద్ర్యంలో నేను మనుష్యద్వేషిని కాకుండా కాపాడి ప్రేమార్ద్ర హృదయం ఇచ్చింది. ఈ కళారాధనమే అన్ని సంపదలూ తుడుచుకు పోయినా ఈ ప్రేమ ఒక్కటే నాకు మిగిలిన భాగ్యం. కనుకనే వసంత గుణసౌందర్యాన్నీ, మైత్రేయుని అజ్ఞానాన్ని ఆర్యకుని సాహసాన్నీ, శకారుని దౌర్జన్యాన్నీ, ఒక్కవిధంగా ప్రేమించగలిగాను. ఇంకేముంది నాకు.

ప్రేక్ష: అది ఒక్కటీ చాలదూ నిన్ను మా సాహిత్యమణి పీఠం ఎక్కించడానికి.

(చటున చీకటి అలము కొంది చీకటిలోంచి నెమ్మదిగా ప్రాకివచ్చి హఠాత్తుగా ఒకడు నీడలా ఎదుట నించున్నాడు. భయం వేస్తుంది చూడడానికి )

నీడ: నమః కుమార కార్తికేయాయ. నమః కనకశక్త్యే

ప్రేక్ష: (కంగారుగా) దొ .. దొ ., దొంగ .. దొంగ ..

నీడ: నోరెత్తితివా తల ఎగిరి పోతుంది.చేతిలో ఏముందో ఇలాతే

ప్రేక్ష: (సర్దుకొని) మైత్రేయుడనుకొన్నావా?

నీడ: అంతకన్న దరిద్రుడవు.చేతిలో ఏమిలేకుండాకూర్చున్నావు. వృధా శ్రమ అయింది.

(ప్రక్కనించి వచ్చి ఒక వెలుగు నీడ మీద పడుతుంది. ఒక బలిష్ఠ పురుషుడు-చురుకుమనే కళ్లు చూస్తే మహా సాహసికుడనిపిస్తుంది)

ప్రేక్ష: (ఆశ్చర్యంగా) చేతిలో కత్తి, మెడలో జందెం, ఎర్ర జీరల కళ్లు కృష్ణసర్పం చుట్టుకొన్న చందన వృక్షంలా వచ్చావు. ఎవరు నాయనా నువ్వు?

నీడ: మూడో చక్రాన్ని తెలియడం లేదూ.

ప్రేక్ష: ఉప్పెనాలా వచ్చి ఊహలన్నీ చెదరగొట్టి పారేశావు. ఏమైనా ఆలోచించ విస్తున్నావా.

నీడ: ఊం ...త్వరగా వెళ్ళిపోవాలి. పాపం మదనిక కళ్లు కాయలు కాచేలా ఎదురు చూస్తు ఉంటుంది.

ప్రేక్ష: ఓయి నువ్వటయ్యా తమ్ముడూ, శర్విలకుడివా! హడల కొట్టేశావు. నిమిషం ఆగు. మరేం పరవాలేదు. ఆకాయలు పండనీ, వేశ్యను కామించే ప్రతివాడూ ఇట్లాగే అను కుంటూ ఉంటాడు.

శర్వి: (చిరాకుగా) ఊరుకో. నీకేం తెలుసు మదనిక అంటే ఏదో చవకబారు రకం అనుకుంటున్నావు కాబోలు, చక్కని చుక్క. నేనంటే ప్రాణమిస్తుంది. ఆమేకోసం నేను ఎందులో దూకమన్నా దూకుతాను.

ప్రేక్ష: అవును నీ ఆవేశం. సాహసం అలాగే కనిపిస్తున్నాయి. కాని తమ్ముడూ, స్వచ్ఛ బ్రాహ్మణ వంశంలో పుట్టి ఎంత కిందికి దిగజారిపోయావు! ఇంటావంటాలేని దొంగతనమా? ఆపైనా సర్వనాశనం చేసే వేశ్యా సంపర్కమా! ఎవరైనా ఎదురుచెప్పబోతే చంపేసేటంత ఆగ్రహమా; ఏమి విధి విలాసం! ఈ చీకటి వ్యాపారం మొదలుపెట్టి పవిత్ర ఉజ్జయినీ బ్రాహ్మణ వంశాల్ని ఎంత అప్రతిష్ఠపాలుచేశావు.

శర్వి: (హేళనగా) పాపం ఎంత చదివావయ్యా. అన్నయ్యా మేం నివసించినఉజ్జయిని నీవుఊహించిన ఉజ్జయినికాదు.మారాజు పాలనలో వేద శాస్త్రాలకు నామ రూపాలు లేవు కులం ధర్మం గాలిలో ఎగురుతున్నాయి. కావలసినన్ని జూద శాలలు విలాసినీ గృహాలు. ఓపిక ఉన్నంత మట్టుకు సుఖిం చడం వినోదించడమే మాసిద్ధాన్తం. రాజంతాకన్నా భోగ వసంతరాయడు. అతనికి ఇవేవీ పట్టవు. రాజ బంధువులకు ఉద్యోగులకూ పట్ట పగ్గాలులేవు. వారి ఇష్టమే ఇష్టం.

ఈ సమాజంలో బ్రాహ్మడూ, వేదాలూ నీమొహంలా ఉంది. మా తండ్రి చతుర్వేదవేత్త ఆ ప్రతి గ్రహీత అయితే యేం మనకేమి అంటలేదు మన మిత్రులెవ్వరికీ ఈ చదువు సంధ్య అనే జంజాటనలేదు. ఈ సంచార కార్యక్రమంలో మన అదృష్టం కొద్దీ రామ చిలుకలాంటి మదనిక దొరకింది.

ప్రేక్ష: (నిస్పృహగా) సరే, తోవ మారిపోయింది. వలరాజు వలలో పడ్డావు. బాగుంది కాని ఈ క్రూర నిశాచరవృత్తి ఏమిటి బాబూ?

శర్వి: ఆదివ్యాషధానికి ఇది అమోఘమైన అనుపానం. మనకు ఈ దుర్వృత్తిలో కూడా కొన్ని సిద్ధాన్తాలున్నాయి. మదనికను ఒక భోగ వస్తువుగా కాక ఇల్లాలుగా స్వీకరి.చ దలిచాను. ముందు ఆమెను వసంత సేనదాస్యం నించి విడిపించాలి దానికి డబ్బుకావాలి. ఊరికే ఎలా వస్తుంది చెప్పు. ఏవృత్తి చేసి ఎవడికి సేవ చెయ్యడం ఇష్టంలేదు. ఇదే సర్వోత్త మంగా కనపడింది.

ప్రేక్ష; ఎంత నీచవృత్తి! రాత్రి సంచారము-నమ్మి ఒళ్లు తెలియ కుండా నిద్రపోయే వారిని వంచించే చౌర్యాన్ని శౌర్యంగా భావిస్తున్నావా?

శర్వి: తెలుసు లేవయ్యా ఈ నీతులు పిల్లికి బిచ్చం పెట్టకుండా ఐశ్వర్యంతో, అహంకారంతో బలిసిపోయినా ఈ ఉజ్జయినీ భవనాలను దోచుకోవడంలో పాపం ఏమీ లేదని నా విశాస్వం. పాండవ పుత్రుల్ని వధించడానికి బ్రాహ్మణో త్తముడు అవలంబించిన సన్మార్గమిది.

ప్రేక్ష: భేష్. .బ్రాహ్మడు ఎందులో దిగినా అఖండుడే అనిపించావు. నీ తండ్రి చతుర్వేద పారంగతుడైతే నువ్వు చౌర్యశాస్త్రం అంతు చూశావు. నీ దర్శనం అయ్యేదాకా చౌర్యానికింత శాస్త్రం తతంగం ఉన్నట్టే తెలియదయ్యా మాకు. ఎంత గురుపరంపర! ఎన్ని శాస్త్రీయ పద్ధతులు! అందులో ఎన్ని మెలకువలు! నువ్వు దొంగతనానికి అవతరించింది మొదలు వెళ్లేదాకా ఎంత పాండిత్యం కుమ్మరించావు. గుడ్లప్పగించి చూస్తూ నుంచున్నాం. నిజంగా ఈ ప్రజ్ఞ వేద శాస్త్రాల్లో చూపితే ఎంత వాడవయ్యేవాడవో!,

శర్వి: అన్నా, నీకులోకజ్ఞానం లేదనుకుంటాను. పాలకుడికి ఆదరం లేని వేదశాస్త్రపాండిత్యం ఎందుకు ముట్టెత్తు కోవడానికి? మనవృత్తి అంటావా శుద్ధలాభసాటి. పెట్టుబడి లేదు, వచ్చిందంతా నికరాదాయం,

ప్రేక్ష: నాయనా, దీనివెనక ఉండే ప్రజాహింస, రాజ దండనం మాట ఆలోచించావా?

శర్వి; వెఱ్ఱివాడా, మనకు కొన్ని నీతిసూత్రాలున్నాయి, నగలు పెట్టుకొని కల కల లాడే స్త్రీల జోలికి పోము. యజ్ఞం కోసం పోగు చేసికొన్న బ్రాహ్మణ ద్రవ్యం ముట్టం, దాది ఒళ్లో ఆడుకొనే పిల్లవాడి నగలకు ఆశించం.

రాజభటులు పునర్జన్మ ఎత్తాలి నన్ను పట్టుకోవడానికి. నడకలో పిల్లిని, పరుగులో లేడిని. ఆరెకుల అజ తగిలిందా

ఇంటి రాటలా నిలబడి పోగలను. ఇప్పటికే చాలా కాలా తీతం అయింది నీ మూలాన తక్షణం మదనిక దగ్గరకు వెళ్లాలి. ఆమెను దాస్యం నుంచి విడిపించి స్వీకరించాలి. అంత వరకూ నిద్రలేదు. ఆహారం లేదు.

ప్రేక్ష : (ప్రశంసగా) తమ్ముడూ, ఎంత చిత్రమైన వాడవయ్యా. వ్యసనంలో నీతి – దుర్వృత్తిలో ధర్మం – బలేవాడవు! నీ దీక్ష సాహసాలు చూడగా ఏదో ఘన కార్యం చేయ వలసిన వాడవు దశం తక్కువయి ఇట్లా పుట్టావను కుంటాను.

శర్వి : ఏమో. విధి కలిసి వస్తే ఈ దుష్పరిపాలననే అంత మొందించ గలనేమో.

ప్రేక్ష : (నవ్వుతూ) అప్పుడు మరదలు మదనిక?

శర్వి : మీవంటి ఆత్మీయుల ఇంట్లో ఉంటుంది. ఆ మహా ప్రయత్నంలో స్వసుఖానికి, స్వార్థానికి చోటు లేదు. అన్నీ ఆహుతి కావలసిందే. (చర చర వెళ్ళి పోతాడు)
(మసక వెలుతురులో బెదురు చూపులతో, సగం తెగిన కాలి గొలుసుతో ఒక విగ్రహం).

విగ్ర : అమ్మయ్య ఇప్పటికి వెలుతురు. గాలిలో పడ్డాను. వదలని పాపశేషంలా ఈ గొలుసేమిటి? ఇక్కడ ఇంకెవ్వరు లేరుగదా ?

ప్రేక్ష; నేనున్నాను.

విగ్ర : (ఉలికిపడి) నువ్వెవరు ఈ మూల—శేషవర్జ్యంలా ?

ప్రేక్ష: గొలుసు తెంచుకున్న అడవి ఏనుగు లాగు నువ్వెక్కడి నుంచి వచ్చావు ? దొంగవా ? దొరవా ?

విగ్ర : గజదొంగను ఇప్పుడే చూచావుగా–ఇక మిగిలిన వాడు దొరే ఏమో. నాయనా దొంగకు దొరకూ ఒక సన్నని గీత తేడా. అదృష్టం కిందకి తోస్తే దొరే దొంగ అయి చెరలో పడతాడు. పైకి గెంటితే దొంగే దొర అయి రాజ్యం పట్టు కుంటాడు–ఇంతలో ఉంది ఆ భేదం.

ప్రేక్ష: ఎంత మాట కారివి ! ఎవరో అసాధారణ వ్యక్తిలా ఉన్నావు.

విగ్ర : అబ్బే, ఆ బండి నాలుగో చక్రాన్ని. ఉష్, గట్టిగా మాటా డకు రాజభటులు వెంటాడుతున్నారు. వారి చేతికి చిక్కానా రాజు అగ్రహానికి మళ్ళా బలిఅయిపోతాను.

ప్రేక్ష: సరి, సరి. ఆర్యకుడివా ? అయితే సిద్ధులు ఊరికే అనలేదు. ఏమి శుభలక్షణాలు ! ఏనుగు తొండాల వంటి బాహువులు, బలిసిన సింహపు మెడ, అదృష్టం అంతా ఆ ఎర్ర జీరల విశాల నేత్రాలలో ఉంది. ఒక దేశానికి మహారాజువు కాదగిన వాడవు ఎమిటీ దుస్థితి ?

ఆర్య : నువ్వూ ఆ మాటలే అంటున్నావూ. ఆ లక్షణాలే నా కొంప ముంచాయి. గొల్లపేటలో పుట్టాను. మేకల్ని తోలుకుంటూ బతుకుతున్నాను. హఠాత్తుగా ఒకనాడు రాజభటులు వచ్చి రమ్మన్నారు. బెదురుతూ వెళ్ళాను. రాజుగారు కళ్ళు చిట్లించి ఎగాదిగా చూసి గొలుసులతో కట్టి చెరలో పారెయ్యమన్నారు. అంతే నాటి నుంచీ రాజుగారి బందీని నేను చేసిన నేరమేమిటో ఇప్పటికీ తెలీదు. విచారణ లేదు. తరువాత తెలిసింది. నా స్వరూపం ఇట్లా ఉండటమే రాజద్రోహంట. ఏమి న్యాయం ? దైవాన్ని ఈ లక్షణాలు నేనడిగి తెచ్చుకున్నానా ? దైవం అంత భాగ్యమే నా మీద ముద్రిస్తే ఈ రాజు అపగలడా ?

ప్రేక్ష: అవును. అక్షరాలా నిజం. రాజు పగబట్టి కఠిన నరకంలో వేసినా నీ అదృష్టమే నిన్ను గొలుసులు తెంచి, తలుపులు పగులగొట్టి విడిపించింది.

ఆర్య : శర్విలకుడే ఆ దైవమేమో—హఠాత్తుగా కార్చిచ్చులా వచ్చిపడ్డాడు. ఆ స్త్రీ వ్యామోహం అంతా ఏమైందో. రాజు గారి జ్ఞాతుల్ని, రాజపురుషుల్ని, ఇష్టులైన వీరుల్ని సైన్యంలా పోగుచేసి అర్ధరాత్రి చెరసాల మీద పడి గొలుసులు తెంచి వెన్ను తట్టి పారిపొమ్మన్నాడు.

ప్రేక్ష: (ఆశ్చర్యంతో) ఏమిటి ! చోరశర్విలకుడు వీరుడై మిత్రుని విడిపించాడా ? అవును. లోకంలో పురుషుడికి ఇద్దరే ఇద్దరు ప్రియులు. ఒకటె ప్రేయసి, రెండు మిత్రుడు. శర్విలకుని వంటి సాహసికి వంద సుందరాంగుల కంటె ఒక్క మిత్రుడే ఎక్కువ. మంచిది. ముందుకు దూకు. శర్విలకుడు అంటించిన ఈ విప్లవ జ్వాలా తోరణం ఆరిపోనివ్వకు.

ఆర్య : ఏమో, గలగలమనే ఈ గొలుసు కాళ్ళను దిగలాగు తున్నది అలసిపోయాను. గమ్యమేదో తెలియదు. ఈ యాత్రకు అంతమెక్కడో—

ప్రేక్ష: భయంలేదు. సమయం వస్తే అన్ని గొలుసులూ తెగిపో తాయి. శర్విలకుడు నిన్ను విడిచి ఉండడు. ఎక్కడో నీడలా నిన్ను వెన్నంటే ఉంటాడు. ఆ ఖాళీ బండిలో ఎక్కు. వెనక్కు తిరిగి ఉంది. సందేహించకు. ఊఁకదులు.

ఆర్య : ఆ బండి ఏ ప్రమాదంలోకి నడిపిస్తుందో ఖర్మం,

ప్రేక్ష: ప్రమాదంలోకే నడిపిస్తుందేమో—నువ్వెరుగుదువా ? పద నిరపరాధుల్ని దండించే పాలక రాజుకు చివరి గడియలు వచ్చాయి.

ఆర్య : (సంతోషంగా) అకారణ మిత్రుడివయ్యా—

ప్రేక్ష: అంతా దైవబలం. వెంటనే బండి ఎక్కు.

(బండి పరిగెత్తే ఎద్దు మువ్వల గలగల)

(మూగిన చీకటిలో నుంచి బడాయిగా చేతులు విసరుకుంటూ ఒక మాట్లాడే జంతువు)

జంతువు:(మీసము, మూతి తడువుకుంటూ) చిరుచేదుగా, పుల్లగా మాంసం కూరా, చేపల పప్పూ, మహాపసందుగా ఉన్నాయి. సన్నన్నం, చక్కెర పొంగలితో మన సాపాటయింది. మిగతా దరిద్రులికి తిండే లేదు చావనీ,
ఓహో—వీధిలో ఏమిటా రణగొణ ధ్వని ?
ఆహాఁ—ఆ దరిద్ర చారుదత్తుడి వధ కాదూ ఈవేళ. తప్పుకోండి, తప్పుకోండి విరోధి చావు కళ్ళారా చూస్తే వచ్చే జన్మలో కంటి జబ్బులుండవుట. ఎవడిక్కడ ?— అడ్డంగా కూచుని కదలవేం నేనెవరో తెలుసా ?

ప్రేక్ష: (ఈసడింపుగా) నువ్వా నాయనా, ఇంకా నీ దర్శనం కాలేదేమా అనే చూస్తున్నాను. తెలియకేం—నీ మొహం మీద రాసిఉన్న శకారం స్పష్టంగా కనిపిస్తూనే ఉంది,

శకార: (విసురుగా) ఏయ్—ఏమిటా వెటకారాలు ? కర్ణుడు కుంభకర్ణుడి చెవులు మెలిపెట్టినట్లు తిప్పేస్తాను. జాగర్త. ఎవరనుకుంటున్నావో. రాజుగారు మా బావ. తెలుసునా ! అంటే మా చిన్న అమ్మ ఆయనకి వరసగా అత్తమామ లన్న మాట ! ఇంతెందుకు. రాజుగారి బావమరిదిననుకో.

ప్రేక్ష: ఉష్ .. అవు నీ సొద అయితే చెల్లెలి యౌవనం పంట మీద ఆడుతున్నావన్నమాట.

శకార: నా ఇష్టం నీకెందుకు ? ఈ వూళ్ళో మనకత్తికెదురులేదు. రాత్రి వీధిన పోయే పడుచుల్ని వెంటాడించినా, కంటపడ్డ సన్యాసిముండాకొడుకుల్ని ఈడ్చి కొన్నినా, పట్టపగలు గొంతు పిసికినా అడిగే గుండెలెవడికీ లేవు. మా చెల్లెలిపేరు చెప్పి న్యాయాధికారుల్నే హడలగొట్టేశాను. న్యాయస్థానంలో నాకు వ్యతిరేకంగా రాసినిదాన్ని కాలితో చెరిపేశాను. ఊరంతా పూజించే దరిద్ర చారుదత్తుడి మీద నేరం మోపి ఉరికంబం ఎక్కించాను. ఎహేఁ—ఏమనుకున్నావో.

ప్రేక్ష: మహానుభావుడవు. నీతప్పేముంది. నీవంటి నీచులకు కొమ్ములిచ్చి ఊరుమీద వదలిన ఆరాజుననాలి.
పులి క్రౌర్యం, రాబందురూపం, పాముల విషం, గుంటనక్క జిత్తులూ, పంచుకు పుట్టావు. రావణుణ్ణి మించి పోయావు. అతడు సీతను చంపుతానని బెదిరించాడు గాని చంపలేకపోయాడు. నువ్వు మాత్రం నిశ్చింతగా గొంతు నులిమిపారేశావు. అయితే నాయనా, ఆ రాతిగుండెలో కనికరం, మంచితనం అనే మానవ లక్షణాలు ఎన్నడూ తొంగి చూడనైనా లేదుటయ్యా ?

శకా : ఏం బ్రతుకు మీద ఆశలేదా ? తెగబడి మాటాడుతున్నావు ఎగిరిపోతావు జాగ్రత్త. రాజుగారి బావమరిదిని.

ప్రేక్ష: (నిర్లక్ష్యంగా నవ్వుతూ) నీవంటి ప్రముఖుడు బావగా దొరికాక ఇంక ఆ రాజు ప్రతిష్ఠ అడిగావా—నీలాంటి తోడేళ్ళకి ప్రజల్ని ఒప్పచెప్పి వయసు ఒత్తైలతో కులికే ఆ రాజు సింహాసనం గాలిలో తేలుతోంది చూడు, రాజు నిర్లక్ష్యం నీ పొగరూ ఉజ్జయిని గుండెలో మంటలు రేపింది నీ పాపాలతో ఘాటు బద్దలయింది. అదిగో విప్లవం. వెయ్యి నాలుకలు చాపుకుంటూ వస్తున్నది. నువ్వూ నీ రాజూ ఎదురుగా నిలబడండి తెలుస్తుంది.

శకా : ఓరీ శకునపక్షీ, నువ్వెక్కడ దాపురించావు. నిజమే ? జనం అంతా మామీద పడదమే! వసంతసేనలాంటి ఆడవాళ్ళు ఎంత మందయినా భయంలేదు గాని మగవాడంటే మాత్రం మనకు కొంచెం దడ. ఉండుండు ఇప్పుడే వస్తాను. (పారిపోతాడు).

(ఒక్కసారి రంగ మండప మంతా రప్పున వెలిగింది. మట్టి బండికి తాడుగట్టి చీకటిలో నిలుచున్న మహాపురుషుడు వెలుగులోకి వచ్చాడు. ఆజాను బాహుడు. బ్రహ్మ వర్చసంపన్నుడు. ఒక రాజ్యానికి రాజు కాదగిన ఠీవి ఉట్టిపడుతున్నది. సూత్రం వదిలివేసి తృప్తిగా చుట్టూ పరిశీలిస్తున్నాడు.)

ప్రేక్ష : మహారాజా, మార్తాండ తేజా! స్వాగతం, సుస్వాగతం!.

మహా : (చిరునవ్వుతో) రాజులు, రాజ్యాలూ బంతుల్లా ఎగిరి పోయినా ఇప్పటికీ ఈ వంది మాగధులు వదల్లేదన్న మాట.

ప్రేక్ష : చిత్తం, చిత్తం. ఆ రాచఠీవి చూచేటప్పటికి అప్రయత్నంగా ఆ మాటలు వచ్చేశాయి. పూర్వజన్మ వాసన. ఏ రాజు

వల్లా జాంబూనదాంబరాలు, అగ్రహారాలూ ఎరక్క-పోయినా రాజు అనగానే ఈ వ్యామోహం తప్పదు మాకు.

మహా : ఈ వాసన తుడిచి వెయ్యడానికే ప్రయత్నం చేశాను. మూసిఉన్న ప్రజల మూఢోకన్ను తెరిపించి దుష్ట రాజుల నిజ స్వరూపం చూపించాను. మట్టి ముద్దల్ని మనుష్యుల్ని చేసి ధైర్య సాహసాలతో ముందుకు దూకించాను. ప్రజాభీష్టానికి పట్టాభిషేకం చేశాను. వెనకటి రాజుల దుష్ట చేష్టలన్నీ చూశాను. అవి లేని ఉత్తమ పాలన సాగించాలని పట్టుబట్టాను. అయిపోయింది. ఆ ఉజ్జయినీ రాజ్యాలు అన్నీ మట్టి గలిసి పోయాయి. ఈ మట్టి బండీ నేనూ మిగిలాం.

ప్రేక్ష : ఓహో-- అట్లా చెప్పండి. మృచ్ఛకటక మహా నాటక రచనతో జగత్తును ఊగించిన శూద్రకమహా కవివా మహానుభావా! అనుకున్నాను. "సమరవ్యసనీ ప్రమాద శూన్యః కకుదంవేదవిదాంతపోధనశ్చ" అనే మాటలు చెవుల్లో ఇంకా గింగురు మంటూనే ఉన్నాయి.

శూద్ర : పోనిద్దూ, ఆ ప్రశంసలన్నీ ఇప్పుడెందుకు? నాకు మీకూ విడని అనుబంధము ఈ నాటకం. దానికి ఈ ప్రశంసలు అప్రయోజకాలు.

ప్రేక్ష : ఇవి నా మాటలు కావు. ఆ నాటకంలోవే!

శూద్ర : ఆ ప్రస్తావన నాకెప్పుడూ ఎబ్బెట్టుగానే కనబడుతుంది. ఏం చెయ్యను. తగని అభిమానంతో మిత్రులు కలిపేశారు. అశ్వమేధాలు, అగ్ని ప్రవేశాలూ అందులో ఎందుకు? నాటక రచనా నైపుణ్యానికి వాటితో సంబంధం ఏమిటి? నేనైతే అట్లా చెప్పను. అందులో నాసంగతికంటె నా నాటక రచనకు ప్రాణమిచ్చిన భాసమహాకవి ప్రాతిపదికను గూర్చి వివరించి చెప్పేవాడను.

ప్రేక్ష : మీకు భాసకవి మీద అంత గౌరవమా?

శూద్ర : ఆయన చారుదత్తం వందల సార్లు చదివి నిట్టూర్చాను తక్కిన నాటకాలన్నీ ఒక ఎత్తు. చారుదత్తం ఒక ఎత్తు అనుకొనే వాడను. పురాణ కథలలో ఎన్ని నాటకాలైనా కనవచ్చు కాని నిత్య సత్య మైన సమాజంలోనుంచి లోక సామాన్య పాత్రలతో నాటకం ఎత్తడం ఏ తన్మాత్రులకు సాధ్యమైన పనికాదు. ఆపనికి ఆయన ఉపక్రమించి సగములో ఆపిపేశాడు ఆయనే దాన్ని ముగించి ఉంటే ఎంత అద్భుతంగా ఉండేదో? అని తలచి తలచి తుదకు నేను సాహసించాను.

ప్రేక్ష : అవును. తర్వాత మీరు చేసిని కల్పన మాత్రం! మూలానికి ఎంత వన్నె తెచ్చింది.

శూద్ర : ఆ కల్పనకు కూడా ఆయనే సూచనలిచ్చాడు. శకారుడు చారుదత్తుడికి కబురు పంపుతూ వసంతసేనను ఒప్పగించక పోతే నీకూ నాకూ ప్రాణాంతకమైన వైరం ఏర్పడుతుందన్నాడు. వసంతను వెంబడించి నప్పుడు నిన్ను చంపుతానని బెదిరించాడు. వాటిని నేను అందుకొని కథలోకి తెచ్చాను. చారుదత్తున పేదతనం సాకుగా తీసికొని అతనిమీద నేరం మోపాలి. దానికి ధనాపహరణం బలకరం. కనక మట్టిబండి కల్పన అవసర మయింది. దానితో పెద్ద బండ్ల మార్పిడి స్ఫురించింది. అక్కడినుంచి నాటకం పరుగెత్తింది.

ప్రేక్ష : అమోఘంగా ఉంది. సరేగాని నాయిక వసంత పేరు కాక నాయకుడు చారుదత్తుని పేరు కాక ఎక్కడో మధ్య మట్టి బండి పేరు పెట్టారేమిటండీ?

శూద్ర : బాగా అడిగావు. వారి పేర్లు పెడితే చూడగానే ఏ శృంగార వీర కథో అని తెలిసి పోతుంది. మట్టి బండి అంటే దీనిమీద ఇంత నాటకం ఎట్లా ఆధార పడింది అని పాఠకుని కుతూహలం ఇనుమడిస్తుంది. అదే చిత్రమైన నాటకీయ చమత్కారం.

ప్రేక్ష : అంతేనా? లేక మీ మనస్సు లోతులలో ఇంకేమైనా విశేషం ఉందా?

శూద్ర : నా ఆంతర్యంలో ఒక వ్యంగ వాసనకూడా ఉంది. వట్టి మట్టి వంటి సాధారణ వ్యక్తులను పిండి ఎట్టి శక్తులు గుణ పరిమళం చూపించ వచ్చునో ఇందులో చిత్రించాను. అల్పమైన మట్టిని పిసిగి నాల్గు చక్రాలు చేసి అపూర్వంగా ఆడించాను.

ఒక చక్రం కులహీన —— గుణ సుందరి
ఇంకొకటి కుల గరిష్ఠుడు —— నిరుపేద
వేరొకటి కుల భ్రష్టుడు —— గుణ హీనుడు
మరి ఒకటి కులమునకు పేద —— గౌరవమునకు భీవ

ఈ బండికి తక్కిన అంగాలకు కూడా అట్లాంటివే అమర్చాను. సంవాహకుడు, దర్దురకుడు, చందనకుడు, మైత్రేయుడు, స్థావరకుడు అంతా వట్టి అల్ప జీవులు. కాని తుదకు అందరి జీవితానికి ఒక్కొక్క మెరుపిచ్చాను.

దానితో అందరూ మారిపోయి నాటకంలో ప్రతి ఒక్కడూ నక్షత్రంలా మెరవడం ప్రారంభించాడు. నా ప్రయత్నం సఫల మయింది.

ప్రేక్ష : కాని పాపం — శకారుడు మాత్రం . .

శూద్ర : వాడిమీద జాలి పడకు. వాడు భారతంలో శకుని వంటి వాడు. కనుకనే ఆ శకారం విడవ కుండా పెట్టాను. వాడి అజ్ఞాన క్రౌర్యాలే నా నాటకానికి వెన్నెముక.

ప్రేక్ష : మీ పాత్రలు చిరంజీవులు. మానవ జాతి ఉన్నంత వరకూ పరిపూర్ణ చైతన్యంతో కదులుతూనే ఉంటారు. అయితే ఇందులో ఇంత విలక్షణమైన హాస్యం ఎక్కడినుంచి తెచ్చారు ప్రభూ!

శూద్ర : చాలా భాగం నేను తీసుకొన్న పాత్రలలోనే ఉంది. వాళ్లను సహజంగా నడవనిచ్చి కథతో కలిపాను. సంస్కృత సాహిత్యంలో అపురూపమైన హాస్యం ప్రయోగించి చూశాను. కృతక హాస్యం రాకుండా జాగ్రత్త పడ్డాను.

ప్రేక్ష : కనుకనే మీ నాటకంలో హాస్యం రస శేఖరమైన శృంగారంతో సమానమైన స్థాయి సంపాదించి నిలబడింది. అంతే కాదు, సర్వతోముఖమైన ఆ కథలో నవరసాలలో మీరు స్పృశించని రసం ఏముంది? అందు చేతనే మృచ్ఛకటికం ఏ ఒక్క తరగతి వారికో కాక అందరికీ అంత ఆత్మీయం అయింది. అయితే కొన్ని సందేహాలు. అడగ మంటారా?

శూద్ర: అవశ్యం!

ప్రేక్ష: సంతోషం. అయితే వసంతను చారుదత్తుడు స్వయంగా వెళ్లిదిగబెట్టినప్పుడు ఈ నగ దాపరికం ఎందుకండీ?

శూద్ర: అది సాకుగా ఇద్దరికే తిరిగి కలుసు కోవాలనే తియ్యని భావరేఖ అంతర్యంలో కదులుతూనే ఉంది. కనుక దాని సంగతి ఎవ్వరూ ఎత్తలేదు. చూశావా, తెలిసి మనస్తత్త్వంలో జరిగిన చిత్రమైన ఆట అది.

ప్రేక్ష: (నవ్వుతూ) అంతేగాదు. వసంత నగ అప్పుడే పట్టుకపోతే ముందు మీ ఆట కట్టిపోతుంది.

శూద్రు: ఇంకేం గడసరివే!

ప్రేక్ష: ఇంకో ప్రశ్న సగంనాటకం దాకా పరమమూర్ఖుడైన శకారుడు హఠాత్తుగా తక్కిన సగంనుంచీ అంత తెలివిగా వ్యవహరించడం సహజంగా ఉందా?

శూద్రు: మానవ హృదయాలు అగాధాలు ఎన్నో తరచి చూచాను. వాడిలో రెండు తత్త్వాలు ఉన్నాయి. ఒకటి దట్టమైన మూర్ఖత. రెండు అంతులేని కసి. వాడు సాధారణంగా ఉన్నప్పుడు నిజంగా మూర్ఖుడు. ద్వేషం చెలరేగిందా వాడి తెలివి పాము పడిగలా విప్పుగుంటుంది. అవిరెండూ గాఢంగా చిత్రించాను.

ప్రేక్ష: ఇంకొకటి. నిర్దోషి, బుద్ధిమంతుడు అయిన చారుదత్తుడు విచారణలో అంత తికమక పడి నేరం తన తలమీదికి తెచ్చుకోవడం ఏమి బాగుంది?

శూద్రు: అతడు పూర్తిగా నిర్దోషికాడు తన బండిమీద వచ్చిన రాజద్రోహిని రక్షించాడు. కనక వసంత తన బండిమీద ఉద్యానానికి బయలుదేరింది అని చెప్పడానికి వీలు లేక పోయింది. కనుక బండిమాట ఎత్తకుండ ఇంటికివెళ్లింది అన్నాడు. ఇంతలో వచ్చిపడిన వీరకునివల్ల అతని బండిలోనే ఆమె ఉద్యానానికి వెళ్లినట్టు ఋజువయింది. నేరంబిగిసింది.

ప్రేక్ష: పోనీ. నగలమాట నిజంచెప్పవచ్చు గదా: వసంత తన పిల్లవాడికి ఇచ్చిందని. వాటిని తిరగి పంపివేసినానని చెప్పవచ్చు గదా: లేకుంటే యథార్థం మైత్రేయుడయినా ఏలచెప్పలేదు.

శూద్ర: వసంత తన పిల్లవాడికి నగలిచ్చిందని చెప్పడానికి అభిమానం అడ్డం వచ్చింది. అంతేకాక వసంత వెళ్లడం విషయంలో తాను చెప్పింది అబద్ధం అని తేలిపోయింది. ఇంక నగల మాట నిజం చెప్పినా నమ్మరు. మైత్రేయుడంటావా సమయ స్ఫూర్తిలేని మూర్ఖుడు. ఇట్లా నిస్సంశయంగా తన్నుతాను సమర్థించుకోలేక నేరానికి లొంగిపోయాడు. పైగా వసంతలేని బతుకుమీద రోత పుట్టింది. ఈ సంఘటన నిజంగా చారుదత్తుడికి శిక్షకంటె నాకు పరీక్షయిపోయింది. ఎట్లాగో మర్యాదగా బయట పడ్డాను.

ప్రేక్ష; సరే సరే-మీ గురువుగారి మీద ఎంత గౌరవం ఉన్నా చారుదత్తంలోని మాటలకు మాటలు, పద్యాలకు పద్యాలు మృచ్ఛకటికంలో ఎక్కించడం ఉచితమే అంటారా?

శూద్ర: చెబుతాను. భాసకవి విడిచిన దగ్గరనుంచీ నేనందుకుని ఆ రచనను పూరించి సర్వాంగ సుందరం చేయదలిచాను గాని అంతా తిరగదోడి మొదటినుంచీ వ్రాయదలచలేదు. ఆ రచనా పథకాన్ని కదపకుండా ఇంచుమించు ఆయన మాటలలోనే అనువదించి కావలసిన ఎన్నో మెరుగులు దిద్దాను. సొగసైన ఆయన కవితా రేఖల్ని స్వీకరించాను. లోక సాధారణమైన ప్రేమ కథకు ఒకఅపూర్వ విప్లవ కథను

జోడించి చారుదత్తానికి చురుకుపదనుతెచ్చాను. వింత వింత పాత్రలను సృష్టించి నాటకానికి కొత్త చైతన్య మిచ్చాను. అజ్ఞులు దీనిని గ్రంథ చౌర్యమనుకుంటె నవ్వి ఊరుకుంటాను. స్వప్రతిభలేని శక్తిహీనుడు చేసేపని గ్రంథచౌర్యం నా శక్తి తక్కిన కల్పనలో, కవితలో చూడలేదా?

ప్రేక్ష: నిజం. తరువాత మీరు చూపిన కవితా సౌందర్యం గురువు గారికంటె రెండాకులు ఎక్కువ చదివింది. మీ వర్షాకాల వర్ణనం నిరుపమానం 'మేఘోజలార్ద్రమహిషోదర భృంగనీలః' వంటి ఉపమానాలూ లింపతీవతమోంగాని వర్షతీవాంజనం నభః, అసత్పురుష సేవేవ దృష్టిర్విఫలతాంగతా వంటి ఉత్ప్రేక్షలూ పరమ రమణీయంగా ఉన్నాయి. దొంగ కొట్టిన కన్నం చీకటిలో పడ్డ దీపకాంతి గీటురాయిమీద బంగారపు గీతలా ఉందనడం ఎంత చక్కని ఊహ. "వేశ్యాః శ్మశాన సుమనా ఇవ వర్జనీయాః వంటి సూక్తులు పండితులకు నిత్యపారాయణంగదా! కాని ఆ సుదీర్ఘ వర్షావర్ణనం, వసంత సేనా భవన వర్ణనం, దృశ్య కావ్యంలో రక్తికట్ట గలవనే ప్రాశారా?

శూద్ర: నిజంచెప్పవలసివస్తే శ్రవ్య కావ్యాలు అధికంగా చదివిన దోషం అది నా కవితా చాపల్యం అక్కడ నా వశంతప్పి పరుగెత్తినమాట వాస్తవం. ఇదేకాదు. ఇంకా ఇట్టి చిన్న చిన్న లోపాలు ఎన్నో అక్కడక్కడ ఉండిపోయాయి. అన్నీసవరించి ఇంకొకసారి తీర్చి దిద్దాలనుకున్నాను. కాలం చెల్లిపోయింది. తరవాత ఏమిత్రులూ సాహసించలేక పోయారు.

ప్రేక్ష: అయితేనేం లెండి మృచ్ఛకటిక సౌందర్యంలో ఆ చిన్న మచ్చలు లెక్కేమిటి. ఏకోహి దోషోగుణ సన్నిపాతే? ఒక్క కోరిక మీదర్శనానికి ఫలితంగా మాకు ఒక్కసందేశం ఇవ్వండి.

శూద్ర

గుణేషుయత్నః పురుషేణ కార్యః<br>
నకించి దప్రాప్యతమంగుణా నామ్<br>
గుణప్రకర్షాదుడు పేన శంభోః<br>
అలంఘ్య ముల్లంఘిత ముత్త మాంగమ్"

(తెరవాలింది. అంతా చీకటి.)



అలుకమనంబునంగదిరి నాతఁడు దానునెఱుంగఁదొడ్లచే<br>
దెలియఁడు కార్యతంత్రముల ధీమహితుండగు వానికైన నుం<br>
జెలులును జుట్టలుం దగిలిచెప్పఁగఁ జొప్పడుఁగాక తక్క ని<br>
ర్మలమగు నీతితంత్రము దిరంబయి చిత్తమునందు నిల్చునే.

— భాగ. సౌ సిక

# అల్లూరి సీతారామరాజు చరిత్ర

## ఆంధ్రవీరుని అద్భుత జీవితము

## అన్ని వివరాలతో

## సచిత్రంగా వర్ణింపబడినది

(రచయిత: యర్రమిల్లి నరసింహారావు)



ఆర్టు పేపరు మీద మనోజ్ఞంగా ముద్రింపబడిన

ప్రభుత్వ ప్రచురణము

**వెల: రూ. 2-75 న. పై.**

**పోస్టేజి అదనం**

ప్రతులకు:— **సమాచార పౌరసంబంధముల శాఖ**

ఆంధ్రప్రదేశ ప్రభుత్వం.

హైదరాబాదు - 1

# భ్రమరాయణము

ముకురాల రామారెడ్డి

బంగారు పుప్పొడుల మై
సింగారముతో, పరాకు సెడు భంగిమతో,
నింగికి నేలకు తాకుచు
టింగున గదలితివి యెచ్చటికిరా భృంగా!

ఎవ్వడిచ్చెరోరి ఈ స్వతంత్రత నీకు
ప్రక్కవారి నిదుర హక్కు జెరుప,
చోటు, వేళ, యేమి పాటింపకున్నచో
ఆట పాట లవియె హానిదెచ్చు.

నేనొకండ మధుర గాన వేదినటంచు
నేల విడిచి నాట్య మేల చేయ?
కొత్త నొక్కరాని ఉత్తుత్త గుయిఁగుయిఁ
రోత దెచ్చె చాలు పాత దరువు.

సంజ మసక జూచి చాటుగా మాటుగా
సార సాలయమ్ము జేరినావు,
అత్త మెచ్చనింటి అల్లుని పోలిక
మొగము నల్లజేసి మగిడినావు.

సన్నపు గాలులన్ విసరు చల్లని రేయిని తోట బాటలో
వన్నెలు చిన్నెలుం జిలుక వత్తువు పోదువు, మొగ్గతాల్పుము
న్కన్నెరికంపు సిగ్గు దొలకన్ సెలయేట వసంత మాడు ఆ
వెన్నెల రాణి పైన కనువేసిన జాడలు నేనెరుంగనా!

మరులు కొనెడి దాక కరగించి కరగించి;
ఉన్న దూడ్చి త్రావి వన్నె జెరచి;
తిరిగి చూడవాని తేర కాడవుగదా!
తేట తెల్ల మోయి తేటి వలపు.

మంచిది పేద పిల్లయని, మాపటి జామున మల్లి పొంతకుఁ
వంచన దాని ముద్దుగొన వచ్చియు,మెచ్చియు.మాట యిచ్చియుఁ,
కాంచన మంచు పెండ్లి కొడుకా! కలవారి పసందు పాట మ్రో
గించెద వేమొ, దించునదె గిమ్మన నీ తలదిమ్మ తుమ్మెదా!

ఒల్లవొ నీవు సంపెగను ఒల్లదొ నిన్నది-ద్రిమ్మరీడ! మా
మల్లిక నొల్లకఁ మధువు మత్తున తుఱ్ఱున ఇట్లు లేచి రా
జెల్లునె! చూడు రాతిరికి జిల్లెడు లేగతి సందికంతలన్,
వల్లభతో మొగమ్ము సెడు వానికి దక్కునె ప్రేమధామముల్

నళినీ కందళ పత్ర ఛత్రముల క్రిందన్ శీతల చ్ఛాయలో
అళినిన్ నిద్దుర పుచ్చి; అరి భడవా! అల్లల్లనఁ దొంగ చూ
పుల పెందోపుల దాపుగా మధువనంబుఁ దూరితే! త్రాగు బో
తుల కిల్లాలును పిల్ల జెల్లలను బుద్ధుల్ జన్మతో వచ్చెనే?

పొంగులు వారుక్రొత్త మధువుల్ నురుగెత్తు బసంత సంతలో
ముంగల పోయి పోయి, అళిమూకలు సుంతయు ముట్టకుండగా
యెంగిలి జేసి పోయెద విదేమిటి చిల్లరబుద్ధి జాతి మే
లుంగన బోని స్వార్థులగు లోభులలో నొకడైతివీవునున్.

ఫల సంభార వినమ్రమయ్యె, మధుర శోభా కమ్రమయ్యె, ఆమ్రము-రా
చిలుకన్ రమ్మని చెప్పి పంపెనట నీచే వర్తమానంబు, తే
నెలదొంగా! యెట పూవుటీరములలో నిద్రించి తౌరా ప్రమ
త్తులతో బంపెడి రాయబారముల వెందున్ పారముల్ ముట్టెనే!

పరువంపుంజిగి దొట్రిలంగ సుభగత్వమ్మందు ఉద్యాన సుం
దరులన్ రాచుక రాచుకన్ దిగిరి సన్నల్ సేయ మర్యాదయా?
సిరివంశమ్ముల మాట లేమొ చెడమానెన్ వాని యూసేమి పో
సరిభావమ్ములనైన జూడ వలదా!సంబంధ యోగంబునన్?

# ఒరవడి

భమిడిపాటి రామగోపాలం

మాటాడ కుండానే, కడుపునిండా భోంచేసి వీధి పట్టాడు. సుబ్రమణ్యం. జీవితమే దుర్భర మనిపించ సాగిందతనికి.

ఒకరోజల్లా శారదతో మాట్లాడకుండా వుండడం ఇంతకి ముందెప్పుడూ జరగ లేదు. పట్టలేని ఆలోచనల్తో అతను బరువుగా కదుల్తున్నాడు.

ఎన్నిసార్లు ఆలోచించినా అతనికి తను చేసింది తప్పని అనిపించడమే లేదు

నిన్న ఉదయం.

శారద ఎనిమిది కల్లా ఉప్మా చేసింది.

సుబ్రమణ్యం ఉషారుగా ఉన్నాడు. అప్పుడే వొచ్చిన ఒచ్చే వారం వారపత్రిక పుచ్చుకొని పీటమీద కూచుని ఓ రవ్వ తిననూ ఓ పేజీ తిప్పనూ మధ్య మధ్య వో కార్టూను శారదకి చూపించనూ ఓ విట్టు తన్లో తనే చదువుకొని నవ్వనూ యిలా చేస్తున్నాడు.

శారద కంగారుగా తినేస్తోంది, అవసరమైనప్పుడు అతని వేపు చూస్తూ. అప్పుడే ఎనిమిదయి పోయింది, ఇంకా కాఫీ కల పాలి, యీ ప్లేట్లు అగిన్నెలూ కడుక్కోవాలి, ఇవన్నీ ఎప్పుడయి తాయి, పదింటికి వంటవుతుందో లేదో అనుకుంటూ

శారద హడావుడిగా తనప్లేటు ఖాళీచేసేసి కాఫీ కలిపేసి గ్లాసులో పోసేసి సుబ్రమణ్యం వేపుచూస్తూ అతను ప్లేటు గ్లాసూ ఎప్పుడిస్తాడా అని ఎదురుచూస్తూ కూచుంది.

పుస్తకం చూస్తున్న సుబ్రమణ్యం వుండుండి పగల బడి నవ్వుతూ యిది చూసేవా, అనిచెప్పడం ప్రారంభించాడు,

ఒకసారి చూసీడం నించి అతను తొందరగా చెప్పగలిగాడు సావధానంగా వినక పోడం వల్ల శారదకి అది అర్థం కాలేదు.

"ఏమిటి"? అంది.

మళ్ళీ చెప్పాడు సుబ్రమణ్యం. సగం వుత్సాహం చచ్చి

శారదకు మళ్ళీ అర్థం కాలేదు.

"అయితే ఏమిటి, ఇంతకీనూ"?

ఛీ! అని సుబ్రమణ్యం శారద చెంప అందుబాట్లో వుంటేను. హేళనా విసుగూవిమర్శా మేళవించి ఒక్కటంటే ఒక్కటికొట్టాడు.

"ఇదిబాగుందండి_కొడుతున్నారు కూడా నేమిటీ?" అని శారద లేచి నిలబడింది.

వెధవ్వార పత్రికలో విట్టు బోధపడనంత మాత్రాన కొట్టాలా అని అవమానం చెందిందామె.

ఆస్వరం లోని ఛీత్కారం భర్తయిన సుబ్రమణ్యాన్ని అవమానించింది. దిగ్గునలేచాడు తను, ఉప్మా సగం దాకా వుండి పోయిందన్నీ వొదిలి. చేతిలో పుస్తకం విసిరికొట్టగా కాఫీ గ్లాసుకి తగిలి వొలికి పోయింది కూడాను.

నించున్నది నించున్నట్టుగానే నిర్ఘాంతపడిపోయింది శారద. జరిగిందేది మెదడులో యిమడకుండా ఉంది.

కాపరానికొచ్చి ఆరేళ్ళయింది. గట్టిగా కసరన్నైనా కసరని మొగుడు యివాళ అనుకోకుండా చాలా చిన్న విషయం మీద మేఘం లేని మెరుపులా కొట్టివెళ్ళాడంటే నిజమేనా అనిపిస్తోంది.

ఇంకా చుర్రుమంటూనూ వుంది.

సుబ్రమణ్యానికి యిబ్బందిగా వుంది. అనేక విషయాల్లో శారద తనకి సమానురాలు కాదు తనతో తూగలేదు. ఎంత అగ్రహారంలో పుట్టిందైతే మట్టుకు పాతికేళ్ళు వెళ్ళి యిద్దరు పిల్లలుపుట్టి యింత సంసారం చేసి యిన్ని వూళ్ళు తిరిగేక కొంత లోకజ్ఞానం రావాలి; అదీ వొచ్చినట్టు కన బడదు. తెల్లార్లేస్తే వీధిలో కనబడ్డపుస్తకమల్లా ఇంట్లోవుంటుంది. అంత చదువురాని మొద్దుకాదు; చదువుతూనే వుంటుంది. ఒకసారి

చెప్తేతే అర్థం కాకపోవచ్చు కాని రెండు సార్లు చెబితే అర్థంకానిది అందులో ఏముందిగనక!

అది వొక మూర్ఖురాలి మూర్ఖత్వం గురించిన పిట్టకథ. అదిన్నీ అర్థం కానట్టి మూర్ఖురాలీమె.

పైగా కొట్టారన్న పౌరుషం వొకటి! తన పద్ధతులు నచ్చవు ముప్ఫయియేళ్ల క్రితం ఎక్కడో వైదికుల యింట్లో పుట్టినందుకు, దేశాలు తెగించి వుద్యోగాల మీద పొట్టచేత్తో పుచ్చుకొచ్చి రోజుకి ఆరుగంటలే బతుకుతున్న తనని వైదికాచారాలు యథావిధిగా పాటించ మంటుంది

ఆమెని మార్చాలని-ప్రపంచాని కనుగుణంగా సరిదిద్దాలని తను చేసిన ప్రయత్నాలు వొకటొకటే వమ్మయి పోతున్నాయి మింగి మింగి జీర్ణంకాని విసుగు యీనాడు మొదటి సరిగా తనకి లేని బలహీనతని ప్రదర్శింప జేసింది.

సుబ్రమణ్యం రోడ్డుమీద సాగుతున్నాడు. పనిలేకుండా ఆలోచనల్ని చంపుకోడానికి, తననుంచి తను దూరంగా పారిపోడానికి చేసేయత్నం ఎంతనెమ్మదిగా సాగుతుందో తెలుస్తూవుంది. చదరంగం బల్లమీద దృష్టినిలిపితే ఎంత క్లిష్ట సమస్యనయినా మరిచిపోవచ్చునని అతనికి తెలుసు పొద్దున ఒక ఆట రెండుగంట లాడారు. అతనూ నరసింహారావున్నూ.

భోజనం చేసి వస్తానని ఇంటికెళ్లాడు సుబ్రమణ్యం. పోనీ ఇవ్వాళ్టికి ఇక్కడ భోంచెయ్యవోయ్ ఈ ఎండలో ఏం వెళ్తావు. శలవే కదా. మర్రెండు గేమ్సు వేసుకుందాం _ అన్నాడు నరసింహారావేమోను.

తనూ తన భార్యా స్వల్ప విషయం మీద మౌనం వహించి తీవ్రయుద్ధం సాగిస్తున్నట్టు ఎక్కడేనా తెలిసిపోతుందేమో అన్న అర్థంలేని అనుమానంతో, ఇంటికి వెళ్లకపోడం మంచిదేనని పించినా, వెళ్లివస్తున్నాడు.

జరిగిన, జరుగుతున్న విషయాల్ని క్రోడీకరించుకో లేక, మరిచిపోడానికి వ్యర్థప్రయత్నం చేస్తూ నర్సింహారావు యిల్లు చేరాడు సుబ్రమణ్యం.

"లేరండీ-మీరలా వెళ్లగానే ఎవరో పొరుగూరాయనట, పిల్చుకెళ్లారండీ_" అని వినపించింది సన్నగా.

ఇంటికి వెళ్లాలన్నమాట.

శారద తలుపు వేసుకుని నిద్రపోతూవుంటుందా?

ఈ ఎండకాలం మధ్యాన్నం వొకటి మౌనంగా గడపడం అంతకష్టమైన పనికాదుగాని చొక్కా వేసుకుని సాయింకాలంవరకూ సరిపడే సిగరెట్లూ తెచ్చుకోడం వల్లా "తిరిగే కాలు" కావడంవల్లా, కాళ్లు ఇంటివేపు లాగడంలేదు.

కాని ఇంటికెళ్లక యీ ఎండలో ఇంకెక్కడికి వెళ్లాలి! సోమరి రంగడిలా నీయ్యింట వుండేదా. నీయింట వుండేనా అని పాటివారింట ఎన్నాళ్లు తలదాచుకో గలడు గనక!

* * *

తలుపు తట్టాడు. తెరవడానికి శారద వొస్తోందని స్ఫురించ గానే యిటుతిరిగి సిగరెట్టు వెలిగించాడు సుబ్రమణ్యం. గడియతీసి, తలుపూ సన్నగాతీసి, వచ్చిన మనిషి యీనే అని తెలుసుకుని, ఆవైఖరి చూసి అక్కసూ అసహ్యమూ పేరుకుపోయి అక్కడే నిలబడి పోయింది శారద.

తలుపు తీసిన మనిషి వెనక్కివెళ్లిన శబ్దం కాలేదు, అక్కడే వుందని గ్రహించి సుబ్రమణ్యం యిటు తిరుగనే లేదు,

తను అక్కడ నిలబడ్డంతసేపూ అతను లోపలికి రాడని గ్రహించడానికి శారదకి అట్టేసేపు పట్టలేదు. చిరుచప్పుడు చేస్తూ వెళ్లింది; అవతలిగది ద్వారం దాకానూ అక్కడనించుంది.

సుబ్రమణ్యం హాల్లోకొచ్చి చెప్పులు విడిచి యీజీ చైర్లో కూలబడ్డాడు.

గదిద్వారం నిలబడ్డ శారద అతని వేపే చూస్తోంది, దగ్గిరే వొకన్యూస్ పేపరు వుంటే విప్పాడు సుబ్రమణ్యం | ఇక మొహం కనబడదు,

ఓ రెండు నిమిషాలు చూసింది శారద, తను మాట్లాడ వలసిన అవుసరం ఏదో ఆమెని తొందర పెట్టింది.

"దఫేదారొచ్చివెళ్లేడు , , ," అంది పొడిగా.

సుబ్రమణ్యం న్యూస్ పేపరు అడ్డం తీశాడు, విన్నాన్లే_అని దానర్థం.

"దొరగార్రమ్మన్నారని చెప్పివెళ్లేడు..."
పీల్చిన పొగ బైటికి వొదిలి నుసి దులిపాడు సుబ్రమణ్యం సమాధానం చెబుతాడో వివరం అడుగుతాడో అని వేచి వుంది శారద.

సమాధానం చెప్పడానికి ఏమీ లేదిందులో ఉన్నా అది దొరగారికే.

వివరం అడగక్కర్లేదు, దొరగారు ఆదివారం రమ్మనడం దేనికో అతనికి బాగానే తెలుసు.

అందుకని సుబ్రమణ్యం విధం చెడకుండా కూచున్నాడు.

"బావుంది వరస!" అంది శారద.

సుబ్రమణ్యం మాట్లాడలేదు.

"నేనేం చేసే నంటే - మాట్టాడ్డం కూడా మాను కున్నారా?"

" .... .... .... .... "

"ఎన్నాళ్లిలా వుంటారో నేనూ చూస్తాను! .... .... "

" ... ... ... "

"మొగుణ్ణికొట్టి మొగసాల కెక్కిందట. కొట్టడం మీరే అలకా మీరేనా ఏమిటి! ... "

" .... .... .... "

"ఎవరేనా వింటే నవ్వుతారండీ - ఏమిటీ వికారం?"

సుబ్రమణ్యం మాట్లాడకుండానే లేచాడు. దొరగారి దగ్గిర కెళ్లడానికి బట్టలు వేసుకున్నాడు. మాట్లాడకుండా చూస్తూ నించుంది శారద. బూట్లు వేసేసుకుంటున్నాడు సుబ్ర మణ్యం. ఇహ వెళ్ళి పోతాడు.

"నన్ను అమాయకురాల్ని చేసి ఆడించడం అంతాను- నేనే అలగ వలసింది మీరు చేసిన్దానికి.- నేను వెర్రిదాన్ని గనక-" అంది శారద.

"నోరు ముయ్యవోయ్. వెర్రిదానివైతే పిచ్చాసుపత్రి లో నయినా జాయిన్ చేద్దును. ఇటు మంచీ గాక అటు వెర్రీగాక మధ్యలోపడి కొట్టుకుంటున్నావు. ఇప్పుడే చెప్తున్నాను విను. నువ్వు రాత్రే చదువుతావో పగలే చదువుతావో పస్తే మానుకుంటావో నాకు తెలీదు. రెండేళ్ల టైమిస్తున్నాను. యీ రెండేండ్లలో నీ మెట్రిక్ పేసవ్వాలి నువ్వు. లేకపోతే-"

లేకపోతే-?

పేసయి-?

అలా అంటూ ఇలా అనుకుంటూ సుబ్రమణ్యం వీధిలోకి నడిచాడు.

* * *

అది కలెక్టరు బంగళాలో ప్రయివేట్ రూమ్.

"ఏమయ్యా అలా వున్నావు?" అని పలకరించాడు కలెక్టరు శాస్త్రి, సుబ్రమణ్యాన్ని కూచోమంటూ.

"ఏం లేదుసార్!" అంటూనే కూచున్నాడు సుబ్రమణ్యం.

"ఎండ వేడికా?" అని జవాన్ని కేకేసి డ్రింకు కలిపి తీసుకు రమ్మన్నాడు శాస్త్రి.

ఆశ్చర్యంలేదు. కలెక్టరు శాస్త్రి డిప్యూటీ తాసిల్దారు సుబ్ర మణ్యమూ పదేళ్లకిందట ఒకే ఆంధ్ర యూనివర్శిటీలో ఆనర్సుక్లాసు చదువుకున్నారు. అదృష్టం శాస్త్రి మీద ఫస్టు క్లాసు మార్కులూ ఐ ఏ యస్. పంటా వర్షించింది; సుబ్ర మణ్యానికి కవిత్వమూ గానమూ తృప్తీ ప్రసాదించింది.

ఈ జిల్లాకి శాస్త్రి కలెక్టరుగా వొచ్చిన దగ్గర్నుంచీ- ఇతరులు అపార్థం చేసుకుంటారని సుబ్రమణ్యం అను కుంటున్నా- తన స్నేహాన్ని ఏదో సందర్భం చూసి జ్ఞాపకం చేస్తూనే వుంటాడు శాస్త్రి; అంతరం చెడకుండా వుండేందుకు జాగ్రత పడుతూనే.

షర్బతు పుచ్చుకున్నా రిద్దరూ.

"ఏదో బాధ పడుతున్నాట్టున్నావు రోజులా లేవు." అని శాస్త్రి కుర్చీలో వెనక్కి చేర బడ్డాడు.

దానర్థం చెప్పక తప్పదని.

అయినా చెప్పే విషయమా యిది?

చెప్తే పరిష్కార మయ్యేదా?

సుబ్రమణ్యం కళ్లజోడు తీసి చేతి రుమాల్తో తుడుచు కుని ఆలోచిస్తూ అటుపేపు చూస్తున్నాడు. ఇందులో తను బాధ పడ వలసింది ఎంత వున్నది యింకా తేలలేదు. ఈ సమస్య ఒకరికీ అందరికీ సంబంధించదని అనుకోలేక పోతున్నా డతను. ఇంటిది మూర్ఖురాలైపోతే పిల్లల భవిష్యత్తూ తన వాతావరణం చెడతాయని అతని భయం. ఎవరికేదిలేదో వారది కోరడం సహజ మనీ అలాకాక శారద అజ్ఞానం లోనే ఆనందం పొందడం అమానుషమనీ బాధ పడుతున్నాడతను.

పెళ్లి అయినప్పట్నుంచే శారదని అతనికి తెలుసును ఆషాఢ మాసానికి అత్తా కోడలు వో గడప దాటకూడదంటే పుట్టింటికి వెళ్ళిన శారద రాసిన ఉత్తరం యింకా అతనికి జ్ఞాపక ముంది. చదవనూ రాయనూ చేతవు నంటే నిజమే అనుకున్నాడు. గాని "అత్తగారుకు నమస్కారములు; దయ వుంచవలెను; మీ దాసీ——" యిలాటి అక్షర తప్పులూ అప భ్రంశాలూ వుంటాయని వూహించుకోలేక పోయినాడు. ఆ వుత్తరం చూస్తే సంస్కారం యింట్లోంచి—— బహుశా వంటింట్లోంచి ప్రారంభించాలని తెలిసి కష్టమూ అనిపించింది; పేరు శారద అని తల్చుకుని నవ్వు కున్నాడు; అప్పటికి——

తనకీ ఆమెకీ బాధ్యతలూ బరువులూ తక్కువైన ఆ రోజుల్లో-పుస్తకాలు తెచ్చీ, పాఠాలు చెప్పీ, షికార్లూ సినిమాలూ తిప్పీ, సత్ప్రసంగాలు చేసీ, శారదని తన ఎత్తుకి-కాకపోతే సగం

ఎత్తుకి; స్వర్గానికని ఎగురుతే ఉట్టేనా అందుతుంది గనక–లాక్కు-రావాలని ప్రయత్నాలు చాలా చేశాడు. దేనికదే విడగొట్టుకొని సినిమాని సినిమాలుగా, షికార్ని షికార్లాగా, పుస్తకాల్నీ ప్రసంగాల్నీ కాలక్షేప సాధనాలుగా గ్రహించి మోకరించింది శారద. ఆ నిర్దాక్షిణ్యాన్నీ మనసారా క్షమించాడు సుబ్రమణ్యం.

దాంపత్య జీవనం, ఏకాంతం, కుటుంబ నిర్వహణం, శిశు శిక్షణా, యీ సందర్భాలన్నిట్లోనూ, సుబ్రమణ్యానికి తన వూహలు తన కున్నాయి. అవన్నీ శాస్త్రీయమైనవనీ క్షేమదాయకాలని అతని నమ్మకం. తను నమ్మిన వాట్ని తనే ఆచరించ లేక పోవడమనే పరాజయాన్నీ అముదం లాటి శారద సంస్కృతిలా దిగ మింగు కున్నాడతను.

ఇప్పుడు చూస్తే ఆనాటి కానాడు నవ్వుకునీ క్షమించీ దిగ మింగుకునీ వున్న ఘట్టాలే నేడు అడుగు ముందికి వెయ్యకుండా అడ్డుపడుతున్నాయని తెలుస్తోంది, ఇద్దరు పిల్లల తల్లి శారద యిప్పుడు. సాహిత్యమూ సంగీతమూ వంట బట్టడం మాట అటుంచి వాళ్ళిద్దరికి నీళ్ళు పాలూ చూసి తనకి ఆఫీసు టయిముకి వట అయ్యేటట్టు చూస్తే చాలన్నట్టుగా వుంది ఆమెకి. తనకైనా పది మంది గుమాస్తాల సెక్షను; ఇంటికి వొచ్చేపోయేఆసాములు, ఊఁ అన్నా ఆఁ అన్నా కలెక్టరూ పి.ఏ. కబుర్లు పెట్టడం; ఇంటికొచ్చే సరికి జోడూ కోటు విప్పడానికి ఎవరేనా వుంటే బాగుణ్ణనిపించే టంత వ్యాపకం.

దీనికితోడు ప్రతియేడూ వయస్సు ఒక్కొక్క సంవత్సరం పెరిగి పోతోంది, వయస్సు పెరుగుతున్న కొద్దీ శారద యిల్లాలూ పేరక్కా అయిపోతోంది; తను జ్ఞానం అనుభవం వృద్ధిచేసుకొని బ్రతుకు పచ్చగా పండించడానికి కొత్త మార్గాలు వెతుక్కుంటున్నాడు. శారద వృద్ధురాలై పోతున్నట్టూ తను మాత్రం ఇంకా బయలేరిన చోటే వున్నట్టూ స్ఫురిస్తూ ఎప్పటికప్పుడు శారద దూరమై పోతున్నట్టు బాధ కలుగుతోంది; సమస్య పెద్దదయి పోతోందని భయమూ వేస్తూంది,

ఒకరికి చెప్పకుంటే ఇందులో జరిగే మేలేముందో తెలియడంలేదు. కాలాన్ని వెనక్కి మళ్లించడం చాతనైతే; ఆమెకీ పిల్లలూ తనకి ఈబాధ్యతా లేని ఆరోజులే మళ్లీ యిప్పుడు ప్రారంభమైతే శారద మనస్సు యీడేరే వరకు ప్రొమోషన్లేనా వొదులుకోడానికి సిద్ధం అతను.

ఇంటగెలిచి రచ్చగెలవాలి!

స్నేహితుడుగా అడుగుతున్నాడు శాస్త్రి; విషయం ఏమిటో చెప్పమని. కేవలం స్నేహితుడే అయితే తెలుసుకుండికి పెద్ద అభ్యంతరం లేదు. గృహ, మానసిక, జీవితాల్ని ఆఫీసర్లకి చెప్పకోడం ఎంత అవసరమైనా అంతగా మంచిది కాదనీ తెలుసు సుబ్రమణ్యానికి. సమయం వొస్తే "నీ గృహ జీవితం యిల్లా వుందిగనక–"అని అనేటందుకు అధికారి వెనకాడడని అతను కొందరి విషయంలో గమనించేడు.

"ఏం లేదు సార్. అయామ్ ఆల్ రైట్." అన్నాడు సుబ్రమణ్యం.

* * * *

"ఏమిటి? కలెక్టరు డాక్టరవుతున్నారా?" అంటూ శాస్త్రి భార్య సుశీలాదేవి ప్రయివేట్ రూమ్‌లోకొచ్చింది.

"నమస్కారమండీ–" అని సుబ్రమణ్యం లేచినిలబడ్డాడు.

"నమస్కారం; అంటూ ఆవిడ కూచుంది" "ఎవరికీ, బాగులేదంటున్నారూ?"

సుబ్రమణ్యమూ కూర్చున్నాడు.

"బాగులేకపోడం కాదు –అతను.ఏదోలా వున్నట్టుంటేనూ– అడిగాను. ఏంలేదంటాడు నువ్వు చూడు. ఏదో బాధపడుతున్నట్టు లేడూ? అన్నాడు శాస్త్రి.

సుశీలాదేవి నవ్వింది. "అందుకే కలెక్టరు డాక్టరవుతున్నారా అన్నాను –ఆయనేదో బాధపడితే అదీ మీకే కావాలీ?

"సుబ్రమణ్యం నాఫ్రెండన్న సంగతి మర్చిపోతున్నావు?"

"సారీ–"

"చదరంగం తెప్పించమంటారా సార్?" అన్నాడు సుబ్రమణ్యం.

"నోనో–నాకు మూడ్ బాగులేదు–"

"సర్లెండి–" అని సుబ్రమణ్యం కుర్చీలో సద్దుకున్నాడు.

"పిలిపించేరంటే చదరంగమో ఆఫీసు వర్కో అనుకొని వస్తారాయన!" అన్నది సుశీలాదేవి.

"అందుకనే– యీ సారి పిలిపించింది. నేను కాదని చెప్పేస్తున్నాను." అన్నాడు శాస్త్రి, ఆవిడ వేపు సాభిప్రాయంగా చూస్తూ.

సుశీలాదేవి సద్దుకుంది.–"మరేనండీ–మీరిన్నిసార్లు వచ్చారు గాని మీ వాళ్ళని తీసుకొచ్చారు కాదు. ఒక మారైనా. అసలు ఇవాళ ఆదివారం కదా, కారు పంపిస్తే వొచ్చేస్తారేమో అనుకున్నాం, మళ్ళీ మీరేమయినా ప్రోగ్రామ్ ఫిక్సప్ చేసుకున్నారేమోనని మిమ్మల్ని కబురు పెట్టాం..."

సుబ్రమణ్యం సిగ్గుపడిపోతున్నాడు.

"మీ మిసెస్ చాలా లక్కీ వుమన్ అనుకుంటూ వుంటామండీ మేము. మంచి మంచి పద్యాలూ గేయాలూ రాస్తారు. మీరు అవన్నీ ఫస్ట్ హేండ్‌గా ఆవిడ చూస్తారు. చక్కటి సంగీతం పాడుతారు మీరు. ఇంట్లో ఇంకా ఫ్రీగా పాడతారనుకుంటా. అంతా ఆవిడ అదృష్టం కదా ! అడగడం మరిచిపోయాను; ఆవిడా పాడతారు కాబోలు: అల్లా అయితే ఇహ అడగాలా ? మీ జీవితమే వొక చక్కని యుగళగీతం–"

సుబ్రమణ్యం మొహమాటపడి "...... లేదండి ..." అన్నాడు.

"పోనీ మీ పద్యాలూ అవీ ఆవిడకి ముందు చదివి విని పిస్తారండీ ?"

చాలా వుత్సాహంగా అడుగుతోందామె. ఆమెని మొదలంటా నిరుత్సాహపరచలేక అబద్ధమే ఆడడానికిసమకట్టాడు సుబ్రమణ్యం.

"అప్పుడప్పుడు–"

"అప్పుడప్పుడేమిటి–అన్నీ ఆవిడ మౌనంచేనే నలుగుర్లోకీ వస్తాయనుకుంటాను, మాతో అల్లా అంటారు గాని. మొన్న మీ సువర్ణ కంకణంలో ఆ మాట రాశారుగా :"

సుబ్రమణ్యం యిబ్బంది పడ్డాడు.

"అనేకం రాస్తామండీ; అన్నీ సంసారంలో అనుభవానికి వొచ్చినవే అంటారా ? అలా అయితే ఎంత రాయగలం గనక! మా సంసారాలనగా ఎంత, వాటి సోక్కపనగా ఎంత? ఒక రచనతో అయిపోతాయి. నిజం చెప్పాలంటే నేను మా ఆవిడ గురించి నిజమైన వాక్యం వొక్కటి రాయలేదండీ, "మా ఆవిడ" అనే పాత్రని ఎన్నిసార్లు చిత్రించినా–!"

"అయితే మీ ఆవిడ ఏమి చదువుకోనేలేదంటారా ?"

"ఏం చదువులండీ–ఎక్కడో అగ్రహారాల్లో పుట్టడం, ఊళ్ళో వున్నంతవరకూ చదువుకోడం, పోనీ పెళ్ళయ్యేకయినా కాస్త జ్ఞానం వొచ్చేలా ఏదేనా చదివిద్దామంటే అవదండీ–! ఎన్ని పన్లు, ఎంత బాధ్యత ! నా ప్రాణం విసుగెత్తింది గాని దాన్ని కొంచెం కూడా ఎడ్యుకేట్ చెయ్యలేకపోయేనండీ. ఇంకా పూర్వ కాలపు ఐడియాలూ చేదస్తాలూ పెట్టుకూర్చుంటుంది.–"

చెప్పదలుచుకోలేని యీ మాటలు చెప్పడానికిష్టంలేని సందర్భంలో చెప్పవలిసే రావడం వల్ల–సానుభూతి బాధని ఎక్కువ చెయ్యడం వల్ల–వినీవినగానే ఒకరు నమ్మే స్వరంలో వొచ్చాయి. అతను నేలకి చూస్తూ విషయం నెమరు వేసుకుంటున్నాడు

శాస్త్రి, సుశీలాదేవీ ముఖాలు చూసుకున్నారు. వారి నేత్రాలు మాత్రం నిశ్శబ్దంగా నవ్వుకుని ఏమో భాషించుకున్నవి.

అంచేత మీలాంటి పెద్దల దగ్గరికి ఆ ఆత్మలేని ఆకారాన్ని తీసుకొని రావడానికి సిగ్గువేస్తుంది. సరదాగా కాలక్షేపం చెయ్యడానికి నా కదృష్టంలేదు–" అని ముగించాడు సుబ్రమణ్యం.

"నువ్వు స్వయంసిద్ధ చదవలేదుటోయ్?" అన్నాడు శాస్త్రి చిరునవ్వుతో

"స్వయం సిద్ధంటే బెంగాలీ నవలేనాండీ?"

"అదే తెలుగులోకి ట్రాన్స్‌లేట్ అయిందిగా!"

"చదివాను అది వొక అపశ్రుతిగా భావిస్తున్నాన్నేను."

"ఎందుకనేం?"

"ఆ నవల్లో పురుషుడు మందుడయినా స్త్రీ అతణ్ణి సరిదిద్దగలదని నిరూపించ బడింది. అసలు పురుషుడు అందులో వివరించినట్టు ఏదో మందో మాకో పెట్టేస్తే తప్ప మొద్దుబారిపోడు; అలా అయిన పక్షంలో స్త్రీకాదుగదా జేజెమ్మ అయినా అతణ్ణి బాగు చెయ్యలేదు మన దేశంలో స్త్రీ పురుషుడి జ్ఞానానికే వొక పరీక్ష. పురుషుడు మూర్ఖుడైతే తనూ ఆ మూర్ఖత్వాన్ని పంచుకొని వినాశనానికి దారి తీస్తుంది గాని అభివృద్ధి సున్న! అసది మనదేశంలో అంత బలమైన వ్యవస్థ!

మళ్ళీ శాస్త్రీ సుశీలాదేవీ ముఖముఖాలు చూసుకున్నారు.

"తమరు నన్నుక్షమించాలి–!" అన్నాడు సుబ్రమణ్యం సుశీలాదేవిని ఉద్దేశించి.

ఆవిడ చిన్నగా నవ్వింది.

"మరి, ముదితల్ నేర్వగరాని విద్య గలదే, ముద్దార నేర్పించినన్ అని రాశారు గదుటోయ్. మనవాళ్ళేనూ?" అన్నాడు శాస్త్రి.

"రాయడానికేమిటి సార్, ఎన్నేనా రాస్తారు!– రాసి తృప్తి పడ్డం వొకటి అలవాటయిపోయింది అనాది నించీనూ. జీవితంలో పొందలేనివి రచనల్లో చదివీ సినిమాల్లో చూసీ తృప్తి పడుతున్నారు ప్రజానీకం కూడాను!" అని నవ్వాడు సుబ్రమణ్యం.

శాస్త్రి తల పంకించాడు. "చాలా సొందుగా చెప్తున్నాడు!" అన్నాడు, సుశీలాదేవిని వుద్దేశించి, మృదువైన హేళన ధ్వనిస్తూ.

"నేనెంత వాడిని, చెప్పడానికి!–స్త్రీవిద్య మనకి జనాభాకంటె పెద్ద సమస్య! ఇది సాధిస్తే అది సాధించక్కర్లెదని నా నమ్మకం స్త్రీలని కరెక్టుగా ఎడ్యుకేట్ చేస్తే పాప్యులేషన్ ప్రాబ్లెమ్ వాళ్ళే సాల్వుచేసుకుంటారు. ఎడ్యుకేషనంటే యిక్కడ అక్షరాస్యత

కాదు; జ్ఞానం! వాళ్లలో ఎడ్యుకేషను రానంత కాలమూ యీ జనాభా సమస్య వాళ్లకి అర్థమూకాదు, అర్థంచేసుకోమని మనం అరచినా ప్రయోజనం లేదు? నెహ్రూ అంతటి నాయకుడూ చరిత్రకారుడూ-ఏ దేశంయొక్క స్థితి గతులేనా ఆదేశంలోని స్త్రీల లివింగుస్టాండర్డుని బట్టి ఆధారపడి వుంటాయన్నారు. మనదేశంలో స్త్రీలకి లివింగూ లేదు, స్టాండరు అంతకన్నా లేదు!" అని సుశీలాదేవి వేపు చూశాడు సుబ్రమణ్యం.

"ఆడది మగవాడి జ్ఞానానికే వొక పరీక్ష అన్నారండీ మీరు— మరైతే యీ పరీక్షలో మీకెన్ని మార్కు లొచ్చే యంటారు?" అందావిడ చిరునవ్వుతో.

"తమరు నన్ను హేళన చేదామని ప్రయత్నిస్తున్నారు. విషయం మార్చడానికి నాకభ్యంతరం లేదు . ."

"క్షమించండి- అల్లా అయితే అడగను. విషయం కానీండి," అంది సుశీలాదేవి మళ్లీ అదే నవ్వుతో.

సుబ్రమణ్యం అప్పటికి గ్రహించాడు; హేళన పడనే పడ్డాడని,- హేళన అనుకున్నా తప్పదనుకోండి- అందరితో బాటుగా నేనూ యిందులో ఫేలయినాను." అన్నాడు.

"అందరితో బాటు- అంటే?" అన్నాడు శాస్త్రి.

"అందరూ, అశేష ప్రజానీకం! రోజూ తమ తమ స్త్రీల మూర్ఖత్వంతో పోట్లాడ లేక పోట్లాట మానుకున్న పురుషానేకం!"

"అలా చెప్పుకుందికి నీకు చిన్నతనంగా లేదూ?"

"- ఏం చేస్తాం?"

"నేనయితే అందర్లో కలిసి పోకుండా ఏదో ఒకటి చేస్తాను గాని అలా ఊరుకోను.... ..." అని సుశీలా దేవి వేపు చూశాడు శాస్త్రి.

వారిద్దరూ మెత్తగా నవ్వుకున్నారు.

* * *

"అయిదేళ్ల క్రిందట- నేనిక్కడికి ఐ. ఏ. యస్. అవగానే ట్రెయినింగు కొచ్చేను. నేనసలు ఈ సర్వీసుకి రాకూడదనే అనుకున్నాను; మొదట్లో. ఇంగ్లండులో హెడ్డాఫీసు వున్న ఓ మందుల కంపెనీ బొంబాయి బ్రాంచీలో కెమిష్టుగా వుండేవాణ్ణి. మంచి జీతమూ, బంగళా, కారూ, అన్ని ఎమినిటీసూ వుండి జీవితంలో నా కింతకంటె ఏమీ అక్కర లేదనిపించేది. అప్పటికి నా వయస్సు యిరవై ఎనిమిది; జీతం ఎనిమిది వందలు.

సడన్‌గా నన్ను గ్రేడ్ "బి" నుంచి గ్రేడ్ "ఎ" కి మారుస్తూ మలయా వేసే మన్నారు. బొంబేలో వున్న మా బాస్ యురపియన్; వెళితేనే మంచి దన్నాడు. ఇంతలోనే ఐ. ఏ యస్ స్పెషల్ రిక్రూట్ మెంటు పడింది. వీళ్లు మలయా వెయ్యడమూ, వెళ్తామా మానామా అన్న తర్జన భర్జనా, చూసుకుని ఏమయితే అయిందని కట్టేసు. పరీక్షరాయడమూ సెలక్షన్ రావడమూ అన్నీ తొందరగా జరిగిపోయేయి. దీంట్లో జీతం బాగా తక్కువైనా తెలుగు దేశంలో పనిచేసే అవకాశం ఎప్పటికేనా వుంది. దాంట్లో జీతం యెంతైతే యివ్వనీ శెలవు పెట్టుకుంచే తప్ప దేశం గడ్డ తొక్కడానికి వీల్లేదు. అనుకోకుండా వెయ్యి పన్లు చేసేకన్న అరుకొని వొక్కపని చెయ్యడం నాకు మొదట్నించీ ఒక తృప్తి ఆ నౌఖరీకి రిజిగ్నేషన్ యిచ్చేశాను.

సెలక్షన్ అవగానే ఆంధ్రకీ ఎలాట్ చేసేరు నన్ను; ట్రెయినింగుకి యీ కలెక్టరేట్ కే వేశారు. మొదటి రెండు వారాల్లోనే సర్వే ట్రెయినింగు కమ్మన్నారు. నా కప్పటికి- చదువు ఉద్యోగంలో ఉపయోగ పడకపోతే ఎందుకూ అన్న తత్వం పోలేదు. కెమిస్ట్రీ ఆనర్సు చదివి ఫస్టుక్లాసు తెచ్చుకున్న నాట్నించీ, మందుల కంపెనీలో వుద్యోగానికి రిజిగ్నేషన్ యిచ్చే రోజు వరకు సబ్జెక్టు వుపయోగం క్షుణ్ణంగా వొంట బట్టిన నేను పూర్తిగా కొత్త వాతా వరణంలో పడ్డాను. ఇక్కడ కెమిస్ట్రీ ఎకనామిక్సూ రెండూ వొకటే. నాపని నేను చేసుకు పోయేవాణ్ణక్కడ. స్వతంత్రంగా. ఇక్కడ అలాకాదు. అధికారం! ఎంతోమంది జీవితాలు మన చేతుల్లో వుండడం; మనం తప్పటడుగు వేస్తే ఎవడో బతుకు చెక్కి బజార్లో పడడం- ఇవీ పరిస్థితులు. నాకు ప్రాణాంతకంగా వుండేవి.

సర్వే ట్రెయినింగుతో ప్రారంభించిన నేను ఆ సర్వేయర్ని కొంచెం దగ్గిర చేశాననక తప్పదు. దాని క్కారణం ఇదీ అంటూ లేదు. అంత వరకూ నేనుండే ప్రపంచానికీ ఆ తరవాత నేనుండే ప్రపంచానికీ వొక వంతెన నిర్మించు కోవాలి; దానికి ఎవడో ఒకడు కావాలి. బొంబే వొదిలి పదిరోజులయిందప్పటికి. ఆ సర్వేయరుపేరు శంకరమో ఏదో వుండాలి. చాలా తెలివయిన వాడని చెప్పకతప్పదు. అనుభవాన్ని అణా పైసల్తో సహా వుపయోగించు కొనే మనుషులుంటారనడానికి అతనే సాక్ష్యం. నా మట్టుకు నేను, అతని ద్వారా సర్వే సబ్జెక్టు కంటె క్షుణ్ణంగా-ప్రజలూ వాళ్ళ మనస్తత్వాలూ; ఆఫీసుకో, ఆఫీసర్లతో వాళ్ళ అనుబంధాలూ; ఆఫీసర్లూ వాళ్ళ నెదుర్కొనే సమస్యలూ వాటి లోతూ, యీ వివరాలు ఎక్కువ తెలుసుకున్నాను సర్వేయరుకు పాలనా రంగంలో స్థానం లేకపోవడం

వల్ల అనుకుంటూను; అతని అభిప్రాయాలు పదునుగా చెప్ప గలిగాడు; ఇప్పుడు అవి నిష్పాక్షికమైనవనీ నేను గ్రహించ దలుస్తున్నాను.

మాది అమలాపురం దగ్గర చిన్న పల్లెటూరు. నీకూ తెలుసుగా. మా మిసెస్‌దీ–అంటే యీ విడదీ–అవూరే. వైదిక కుటుంబం మాది; నా పేరే చెబుతుందామాట. మా వంశంలో మా తరం వరకూ, (ఎలాగో ఊరు దాటినా) అమలాపురం దాటి చదువు గాని జ్ఞానం గాని లేవు. 'కట్టుకుపోయినంత ఆస్తి వున్నా చదువులేకపోవడం నాకు నచ్చక మావాళ్ళంతా దెబ్బలాడినా కాలేజీకి, యూనివర్సిటీకి వెళ్ళకమునుపే నాకు మేరేజ్ అయిపోయింది. స్టూడెంట్‌గా నాకున్న కాన్సెంట్రేషన్ నీకు తెలుసుగా పెళ్ళీ పెళ్ళామూ, తల్లీ తండ్రీ–ఏ బంధమూ వుందన్న సంగతే మరిచిపోయి ఆనర్సు ఫస్టుక్లాసు సాధించాను. రిజల్టు వచ్చి ది. వేసంగిలో మా కొబ్బరి తోటల్లో జీవితంలో మొదటిసారిగా సుఖవంతమైన గాలి పీలుస్తున్నాం. సరదాగా పెట్టిన అప్లికేషనుకి బొంబాయి ఇంటర్వ్యూకి రమ్మని. అక్కడే ఆర్డర్సు యిచ్చేరు.

కొన్నాళ్ళ కొత్త మూలాలన్నీ కొన్నాళ్ళు ఇంట్లో చికాకులు మూలాన్నీ మా మిసెస్‌ని బొంబే తీసుకెళ్ళలేను. ఇంతల్లోకే నన్ను ఒక టెక్నికల్ ట్రెయినింగ్ పొందడానికి స్విట్జర్లండు వెళ్ళమన్నారు; కంపెనీ వాళ్లు. మూడు సంవత్సరాలు విదేశాల్లో గడిపాను; ట్రయినింగు ఏణ్ణర్థమూ లండన్‌లో ఫ్యాక్టరీలో ఏణ్ణర్థమూనూ. దాంతో నాకు ప్రోస్పరిటీ తప్ప లైఫ్ లేకుండాపోయింది. విసుగుపుట్టేది; ఎప్పటికప్పుడేను. ఇల్లులేదు; ఇల్లాలు లేదు. అతి స్వల్పమైన పరిచయం నామిసెస్‌తో నాకు; అయినా వొక ప్రిన్సిపుల్ ఏర్పడిపోయింది. ఆ ప్రిన్సిపుల్‌తో ఆ కట్టుకున్న మనిషిని నేను యించుమించు మరిచిపోయేను. అతి కష్టం మీద మొహం జ్ఞాపకమొచ్చేది, వూహించుకుంటే. ఈ స్థితి నాకు భయంకరంగా కనిపించింది. నా ప్రోస్పరిటీ, నా సుఖం నా భార్య పంచుకోకపోయినప్పుడు నేనభివృద్ధి చెందేం లాభమని బాధపడ్డాను. ఏదో మడత వేసి బొంబేకి తిరిగొచ్చేను; కాపరం పెట్టుకోవాలని. లేకపోతే మరో ఆర్నెల్లలో పిచ్చి ఎత్తేది కాబోలు నాకు.

సరే జాయిన్ అయిన ఎనిమిది నెల్లలో ట్రెయినింగు అయింది, ఎక్కడో సబ్‌కలెక్టరుగా పోస్టింగు యిస్తారన్నమాట; ఇంతల్లో వొచ్చిందొక రిపబ్లిక్ డే. ముందుగా రెవెన్యూ స్పోర్ట్సు అవీ అయ్యాయి, ఆవేళ ప్రెయిజ్ డిస్ట్రిబ్యూషన్ చెయ్యాలి. అసలీ వ్యవహారం అంతా కలెక్టరే స్వయంగా చూసుకొనే వాడు. నారాయణన్ అని ఒక ఐ.సి.యస్. అప్పుడిక్కడ కలెక్టరు. ఏదో యాక్సిడెంట్లో మెడ్రాస్‌లో వాళ్ళ కుర్రాడు ఇన్వాల్వు అయితేనూ సమయానికి వెళ్ళిపోయేడు ఫార్మాలిటీస్. అదే, ఫ్లాగ్ హోయిస్టింగూ అవీ, నన్ను చెయ్యమన్నారు; ఉదయం అయిపోయిందంతా. మధ్యాన్నం ప్రెయిజ్ డిస్ట్రిబ్యూషన్ ఉంది.ముందుగా హెడ్గుమాస్తా వచ్చి మా మిసెస్ చేత ప్రెయిజ్ డిస్ట్రిబ్యూషన్ చెయ్యించడానికి వీలవుతుందా అన్నాడు నేను వీలుండదు పొమ్మని పంపేశాను.

మరోగంటకి సర్వేయరు శంకరమొచ్చి చిన్న వుపన్యాసం లాంటిదియిచ్చి, ఎలాగేనా అవిణ్ణి వొప్పించాలన్నాడు. డిప్టీ కలెక్టరుగారు, పి ఏ. గారు, ఎందరున్నా తమ సాటి రాదండీ, అన్నాడు ఐ ఏ.యస్. ఆఫీసరు సతీమణితో సహా ఊళ్ళో వున్నప్పుడు యిటువంటివి యింకొకరు చెయ్యడానికి భయపడతారన్నాడు. అభ్యంతరం లేకపోతే ఆవిడతో తనే మాట్లాడి ఎలాగో ఒకలాగ ఆవిడ్ని వొప్పిస్తానంటాడు,

నేను యిరుకులో పడ్డాను ప్రపంచములో ఏ ఉన్నతినైనా నాకు అర్హత వుంది; లేకపోయినా నేనుశ్రమపడి సంపాదించుకోగలనది.కాని మామిసెస్ గురించి మాత్రం–ఎవరితోనూ చెప్పటానికి వీల్లేని వ్యవహారం ఆనర్సు చదవడానికీ ఉద్యోగం చెయ్యటానికీ టెక్నికల్ ట్రెయినింగు పొందడానికీ నేను ఆమెనించి చాలాదూరం వెళ్లాను యీ దూరం మా యిద్దరిమధ్యా ఏర్పడిన దూరంలో వెయ్యోవంతయినా లేదని చాలా ఆలస్యంగా తెలుసుకున్నాను. నేను పైకి, పైపైకి.యింకా మీదికి వెళ్తూవుంటే ఆవిడ అట్టడుగున ఐయల్దేన చోటే వుండి పోయింది నాలో ప్రవహించే ఆలోచన్లూ నావిజ్ఞాన స్థాయీ అర్థమయ్యేయోగ్యత లేనేలేదు. నాగురించి ఆవిడ అభిప్రాయమల్లా వొక మనిషి! నామాటలు ఆవిడకి అర్థమపడం అటుంచి ఆవిడ సంభాషణ విని నేనెంతో సిగ్గుపడే వాణ్ణి "మీచిన్నన్నయ్యపెళ్లాం నాగరం చేయించు కుందండోయ్." అనో 'ఎంత వెధవాడ పడుచైనా విశ్వనాథశాస్త్రుల్లు గారమ్మాయి పరస బావులే స్మండీ–" అనో వుండేది ధోరణి వైదికాచారాలూ, సాంప్రదాయాలూ సరేసరి. అసిస్టెంటు కలెక్టరుగా ట్రెయినింగుకి రాడవమే విడిగా కాపరం సొంతంగాపెట్టడం ఏం తెమ్చుకుందో తెలుసా? చిన్న మహాలక్ష్మీనోము, పసుపూ, కుంకం, అధ్యాత్మ రామాయణ కీర్తన్లూ. నాకు ముళ్ళ గుచ్చుకున్నట్టుగా వుండేది. కలెక్టరు సతీమణి కలెక్టరుకు తగినట్టుగా ఉండాలని జనంకోరడం సహజం ఏంచేదామన్నా నాకే తలములిగి తాటి ప్రమాణమంత పని యీ విషయాలు ఎవరికే చెప్పకపూర్వమే, ఏం చెయ్యక పూర్వమే పరీక్ష సమయం వొస్తుందని అనుకోలేదు. గడచిపోయిన దండుగైపోయిన యిన్ని సంవత్సరాలూ గుర్తుకొచ్చి ఏడ్చుకున్నాను.

ఏదో వొకటి చెప్పిసంపాలి శంకరంగారికి ఆయన కదల్దం లేదు. ఇక్కడ మొదటి సారిగా కాన్ఫిడెన్సులోకి తీసున్న వ్యక్తి అవడం వల్ల గాబోలు, అతనితో అబద్ధం చెప్పడానికి ప్రాణం వొప్పలేదు. మా ఆవిడ అగౌరవానికి తగదు; ఇలాటి సంగతి అని చెప్పేసరికి అతను ఇంచుమించు ఏడ్చినంతపని చేసేడు. ఆనాడు అతనన్న మాటలు గాని చేసిన చేష్టలు గాని నేను ఎప్పటికీ ఎవరితోనూ చెప్పలేను; మరిచి పోలేను.

ఫలితం యేమిటీ? సామం భేదం దండం మూడువు పాయాలతోటీ యిరవైనాలుగునెల్లు కృషిచేసి వో క్రొత్తమనిషిని సృష్టించేను,అందుకోసం ఆవిణ్ణి ఎవరితోనూ చెప్పుకో కూడని అగౌరవం చేశాను; ఎవరికీ యివ్వని మర్యాద యిచ్చేను; ఎక్కడా చూడని హైన్యం చూపేను. వివిధ సందర్భాల్లో అదంతా నిజం కోసం నటన-ఎదురుగుంటా మనిషుంది, ప్రశ్నించి చూడు ఆవిడఅది పూర్వ జన్మం అంటుంది తప్ప నాలుగేళ్ళక్రితం జరిగినవిషయమని వొప్పుకోదు. ఇప్పుడు-సంస్కృతంలో ఆమాత్రం యీమాత్రం కావ్యం అర్థమైపోతుంది, తెలుగులో విసుగులేకుండా వేదిక మీద గంటకి తక్కువ లేకుండా మాట్లాడగలదు; ఎవరేనా యింగ్లీషులో మాట్లాడితే తడుముకోకుండా కటకట్టుగా సమాధానం చెబుతుంది.

శాస్త్రి సిగరెట్టు తీసి వెలిగించాడు

సుబ్రమణ్యం నదిలో స్నానం చేస్తున్నట్టు కొట్టుకు పోతున్నట్టు ఆనందంలో ఆశ్చర్యంలో సంభ్రమంలో సందేహంలో మునుగుతున్నాడు. అతని నోట మాట రాలేదు. అప్రయత్నంగా సుశీలా దేవి వేపు చూశాడు. కుర్చీని చిద్విలాసంగా కాళ్లతో వెనక్కీ ముందుకీ వూపుతోందామె.

"ఎవరో అదృష్టవంతులకి గాని మా లాంటి వాళ్ల కివన్నీ ఎక్కడ సాధ్యమండీ? ఏదో యిలా వెళ్ల వలిసిందే-"

రెండుసార్లే పీల్చిన సిగిరెట్టు ఆర్పేశాడు శాస్త్రి: కోప సూచకంగా; చాత కాక పోతే సరి!" అంటూ

సుబ్రమణ్యం మాట్లాడ లేదు.

"మాలాంటి వాళ్లూ మీలాంటి వాళ్లూ అని ఎక్కడా లేదు మిష్టర్ సుబ్రమణ్యం. అంతా వొకటే. కాకపోతే కొంచెం పరిసరాల్ని బట్టి పరిస్తితుల్ని బట్టీ తేడా కొంత కాలం రావొచ్చు. బుద్ధితెలిసి, గట్టిగా ప్రయత్నం చేస్తేనేగాని ఆనర్సులో క్లాసురాదని తెలిశాక కూడా చదవక పోవడం మేం?"

సుబ్రమణ్యం మాటాడలేక పోయాడు.

"-అదీ అదృష్టమేనా? మన చేతుల్లో వున్నది పాడు చేసేసుకుని ఆనక అదృష్టం లేదని అనెయ్యడం మనిషి తెలివి తక్కువకి నిదర్శనం - పోనీ చూదాం; నీ వయస్సెంత?"

"ముప్పయి రెండు-"

"మీ ఆవిడ వయస్సు పాతిక దాటి వుంటాయి ముప్పయ్యేళ్లకే ముసలయి పోయిందనుకుంటున్నావా? యింకా డెబ్బయ్యేళ్లున్నాయి. మొదలు పెట్టి చూడు: ఎందుకు చెయ్యవో నేను చూస్తాను. రెండేళ్లలో నువ్వనుకున్నది కాకపోతే, నేనెక్కడుంటే అక్కడికి రా. అయిన ఖర్చులూ జరిగిన నష్టానికి పరిహారం నేనిస్తాను! యివ్వకపోతే ఫలానా శాస్త్రివల్ల యింత నష్ట పోయానని అనుకుందువు గాని!"

"ఎంత మాటండి!"

"నువ్వు స్వయంసిద్ధ అపశ్రుతి అన్నావే, అదీ -"ఎంత మాట"- అనుకో వలసిన మాట! నీ కావ్యాలూ గేయాలూ సంగీతం ఆమె బోధ పడ్చుకో లేదనే నువ్వింత బాధ పడిపోయి ఈ జన్మకింతే అని మొగం వేలేస్తే నీకన్న పెద్ద పన్లు చేసేవాళ్లు ఏమయి పోవాలి! ఒక దేశ నాయకుడు - తన భార్యకే తనకీ అంత ధమంత అడ్డం వుందనీ తన కాటంకం వస్తోందనీ తెలుసుకుని ఆవిణ్ణి ఎలా మార్చాడో చదువలేదా? ఇందులో నువ్వు నిరుత్సాహ పడవలసిన దానికంటె ధైర్యంగా చెయ్య వలసిందే ఎక్కువుంది. నువ్వే అన్నావుగా, జనాభా సమస్య కంటె స్త్రీ విద్య సమస్య క్లిష్ట మైందనీ, దానికంటె ముందు ఇది విడగొడ్తే దాని జోలికే పోనక్కర్లేదనీ- నాకు చాలా ఆనందంగా వుంది. కాని గవర్నమెంటు కాదు యీ సమస్యల్ని పరిష్కరించ గలిగింది. మీరే. ఎన్ని యాక్టులు చేసినా నీ భార్య చదువుకోదు; నువ్వు శిక్షణలో వుంచుతే వెంటనే చదువుతుంది -అందుకని- ప్రారంభం చెయ్యి, త్వరగా!"

"ఇహ ఆపు జేయ్యండీ, ఆయన బోరవు తున్నారేమోనూ. మీరు నమ్మకంతో చేసిన పని గనక మీకా వుత్సాహమూ పుత్కర్షానూ. వాళ్ల పరిస్తితులేమిటో వీళ్లేమిటో. పాపం యిద్దరో ముగ్గురో పిల్లలు గాబోలావిడకి. పది గంటలకి వంటవండడమే కష్టం. యీన ఆఫీసుకి లేటుగా వస్తే మీరే సంజాయిషీ అడుగుతారు. మరీ బలవంతం చెయ్య కండాయన్ని- ఏం చేసుకోవాలో ఆయనికి మాత్రం తెలీదూ?" అంది సుశీలా దేవి ముగింపుగా.

సుబ్రమణ్యం లేచాడు.

"వెళ్లొస్తానండీ, నమస్కారం."

అతని కంటికి ఆ భార్యా భర్త లిద్దరూ తనకి ప్రత్యేకం జ్ఞానోపదేశం చేసేటందుకు వచ్చిన ఆది దంపతుల్లా కన బడ్డారు, విజ్ఞాన తేజస్సుతో వెలిగిపోతూ. వందనాలర్పించ డానికన్నా తీరిక లేనట్టు అతని హృదయం దేనికో తొందర పడ సాగింది.

"అరె అప్పుడే వెళ్తున్నావా?"

"ఔను సార్. వెళ్లాలి."

"కొంపదీసి యివాళ్టినుంచే మొదలు పెడతావా, ట్యూషన్?"

"ఎవరా అన్నది?"

"రావణ బ్రహ్మ. శెలవు."

---

# ఆంధ్ర కర్షకుల భారత దర్శన యాత్ర

జి. సత్యారావు

ఆంధ్రప్రదేశ్‌లోని వివిధ ప్రాంతాలకు చెందిన సుమారు 700 మంది కర్షకులు ఇటీవల, భారతదర్శన యాత్ర సందర్భంలో ఢిల్లీని సందర్శించారు

వీరు యాత్రికులకు ఉద్దేశించిన నాలుగు ప్రత్యేక రైళ్ళలో ప్రయాణం చేశారు. అజంతా గుహలు. ఆరేమిల్క్ కాలనీ (బొంబాయి), భాక్రా, గయ, వారణాసి ఆగ్రా మొదలైన ఆర్థిక చారిత్రక, ప్రసిద్ధమైన ప్రదేశాలనూ, పుణ్యక్షేత్రాలను వీరు దర్శించారు.

ఢిల్లీ వెళ్ళినప్పుడు వీరిలో ఒక బృందంవారు శాసన సభ సభ్యుడు శ్రీ జి. రామస్వామిరెడ్డి నాయకత్వాన డాక్టర్ ఎస్. రాధాకృష్ణన్‌నూ ఇంకా ఇతర ఆంధ్ర నాయకులను కలుసుకున్నారు.

అధికాహారోత్పత్తిని సాధించడానికి ఇతోధికంగా శ్రద్ధ గైకొనవలసిందిగా డాక్టర్ రాధాకృష్ణన్ యువకర్షకులకు ఉద్బోధించారు. అమెరికా జనాభాలో నూటికి పదవ వంతు మంది మాత్రమే మొత్తం దేశానికి కావల్సిన ఆహార పదార్థాలను ఉత్పత్తి చేయగలుగుతున్నారని చెప్తూ, మన దేశంలో నూటికి 90 వంతుల జనాభా వ్యవసాయ రంగంలో నిమగ్నమై వున్నప్పటికీ మన అవసరాలకు చాలినంత ఆహారం ఉత్పత్తి కావడంలేదని ఆయన అన్నారు.

## ఆహ్లాదకరమైన దృశ్యాలు

అనేక మంది యువకర్షకులు, స్త్రీలు జట్టులు జట్టులుగా రాజధానీనగరంలోని ప్రధానమైన వీధుల గుండా ముఖ్యంగా పార్లమెంటు భవనం, కన్నాట్‌ప్లేస్ మొదలైన ప్రదేశాల గుండా నడిచి వెళ్ళిన దృశ్యాలు చాలా ఆహ్లాదంగా వుండినవి.

ఆ సమయంలో భారత రాజధానిలో వున్న ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ దామోదరం సంజీవయ్య ఆర్థిక మంత్రి శ్రీ కాసుబ్రహ్మానందరెడ్డి, కర్షక బృందాన్ని వారి బస-కొత్త ఢిల్లీ ప్లాట్‌ఫారంపై నిలిచిన ప్రత్యేక రైలులో కలుసుకొని, దేశంలోని వివిధ ప్రాంతాలలో జరుగుతున్న అభివృద్ధిని పరిశీలించి వారు సాధించిన విషయాలను గురించి స్వరాష్ట్రం తిరిగి వెళ్ళాక తమ పొరుగువారికి చెప్పాలని అన్నారు

యూనియన్ రక్షణశాఖ ఉపమంత్రి శ్రీ కొత్త రఘురామయ్య, విభిన్న రంగాలలో వారు సాధించిన బ్రహ్మాండమైన అభివృద్ధిని గమనించవలసిందిగా సూచించారు. శ్రీ రఘురామయ్య కర్షక బృందం సౌకర్యార్థం ఢిల్లీలో చాలా శ్రద్ధ తీసుకున్నారు.

ఆంధ్ర ప్రాంతానికి చెందిన పార్లమెంటు సభ్యులు శ్రీ ఎం. సూర్యనారాయణ, శ్రీ హెన్రీ శామ్యూల్ కూడా కర్షక బృందాన్ని కలుసుకున్నారు.

"తమ ఘనవిజయాలను గురించి కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు చెప్పుకునే విషయాలను మేము ప్రత్యక్షంగా చూచి తెలుసుకొనదలిచాము. ఈ విషయంలో మా పర్యటన సంతృప్తి కలిగించిందని చెప్పడానికి ఆనందిస్తున్నాము" అన్నారు గుంటూరు జిల్లాకు చెందిన యువకర్షక బృందంవారు వారి పర్యటనానుభవాలను గురించి నేను అడిగినప్పుడు.

# ప్రశ్నోత్తరావళి

ప్రశ్న : 179 శ్రీ కె. ఆదినారాయణ, విజయనగరం

లఘు పరిశ్రమలను స్థాపించ దలచిన వారికి ఎంతో అవసరమైన నిపుణత, ప్రావీణ్యతగల పనివారలు, సుశిక్షితులైన ఉద్యోగులకొరతను తీర్చడానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఏమి చర్యలు తీసుకొన దలిచిందో దయచేసి తెలుపుతారా? నా ఉద్దేశంలో మన రాష్ట్రంలోని పారిశ్రామికులు, ప్రత్యేక పరిజ్ఞాన మవసరమైన పనులలో ప్రావీణ్యత సంపాదించే నిమిత్తం ఇక్కడ గానీ లేదా ఇతర రాష్ట్రాలలోగాని గల అదే పరిశ్రమకు సంబంధించిన ఫ్యాక్టరీలో కొంత కాలం అనుభవం పొందడం మంచిది ఉదాహరణకు హిందుస్తాన్ స్టీల్ సంస్థవారు ఇదే ప్రకారం చేశారు. వారు తమ పనివారలను కొందరిని టాటా సంస్థకు పంపించారు. మన పరిశ్రమల శాఖ దృష్ట్యా ఇది తక్షణ పరిష్కార మార్గం కాదా?

జవాబు : లఘు పరిశ్రమల కార్యక్రమం క్రింద ప్రభుత్వం ఇదివరకే వడ్రంగం, కమ్మరిపని, కుమ్మరిపని, మౌల్డింగ్, పాద రక్షల తయారీ, తోళ్ళపని, గాజుపని మొదలైన పరిశ్రమలను స్థాపించి వాటిలో అభ్యర్థులకు స్టయిపండులు చెల్లిస్తూ సాంకేతిక శిక్షణ ఇవ్వడానికి సౌకర్యాలు కల్పించింది. జనరల్ యింజనీరింగు మొదలైన వాటిలోనూ, విజయవాడ, సనత్‌నగర్‌లలోని పారిశ్రామిక ఎస్టేట్లలోనూ భారతప్రభుత్వం విస్తరణ శిక్షణ కేంద్రాలను కూడా తెరిచింది. అభిలాషగల పనివారలకు వీటిలో శిక్షణ సౌకర్యాలు లభింప జేయబడుచున్నాయి.

ప్రైవేటు పారిశ్రామిక సంస్థలలో శిక్షణకు సంబంధించి, అభ్యర్థుల శిక్షణ పొందగోరే పారిశ్రామిక సంస్థల యజమానుల ఇష్టాన్ని బట్టి శిక్షణ సౌకర్యాలను కలుగజేయడానికి పరిశ్రమలశాఖ, లఘు పరిశ్రమల సేవాసంస్థలు ప్రయత్నం చేస్తాయి.

ప్రశ్న : 180 అస్పృశ్యతా నివారణ చట్టం క్రింద నేరాలు తగ్గుముఖం పట్టాయని. అందుకు భిన్నంగా ఆంధ్రలో మాత్రం నేరాలు పెరిగాయని ఒక దినపత్రికలో ప్రకటించిరి. అయితే 1959-60 వ సం. లో ఈ చట్టం క్రింద ఆంధ్ర ప్రదేశ్‌లో మొత్తం ఎన్ని నేరాలు పట్టుబడ్డాయి? ఎంత మందికి జరీమానాలు లేదా జైలు శిక్షలు విధించారు?

జవాబు : (1) 1955 వ సం. పు అస్పృశ్యతా నివారణ (నేరాలు) చట్టం క్రింద 1959 వ సంవత్సరంలో 16 కేసులు రిజిష్టరయ్యాయి,

(2) ఎనిమిది మందికి జరీమానాలు విధించారు.

(3) ఒక వ్యక్తికి ఒక వారం కఠిన కారాగారవాస శిక్ష విధించారు.

ప్రశ్న : 181 శ్రీ కె రంగనాయకులు, నెల్లూరు.

అ. గీత పారిశ్రామికులు కాని వారికై, తాటి బెల్లం సహకార సంఘాల ద్వారా గ్రామీణ సౌకర్యాలు పెంపొందించడానికి తృతీయ ప్రణాళికలో ఆంధ్ర ప్రదేశ్ బడ్జెటు కేటాయింపు ఎంత వుంది?

ఆ. ద్వితీయ ప్రణాళికా కాలంలో ఇటువంటి సంఘాల నిర్వహణలో వీరు ఎంత అభివృద్ధి సాధించారు?

(ఇ) బెల్లం సంఘాలను ఎక్సైజు, సహకార శాఖల ద్వంద్వాధ్యక్ష్యం క్రింద ప్రభుత్వం ఎందుకు వుంచింది? ప్రాథమిక విషయాలలో వీటి నిర్వహణ విఫలమైందన్న సంగతులు తెలిసి కూడా ప్రభుత్వం వీటికి లైసెన్సులు

జారీ చేసే పనినీ, నిర్వహణను ఒకే శాఖకు ఎందుకు అప్పగించదు? ఇది ప్రజా ద్రవ్యాన్ని దుబారా చెయ్యడం కాదా?

ప్రైవేటు రంగంలో వీటి నిర్వహణ లోప భూయిష్టంగా వుంటున్నందు వల్ల వీటి బాధ్యతను పూర్తిగా ప్రభుత్వం స్వీకరించే ప్రతిపాదనలు ఏమైనా వున్నాయా?

జవాబు : మద్రాసు మధ్యపాన నిషేధ చట్టం క్రింద రూపొందించిన 1959 వ సం పు తీపి కల్లు నిబంధనావళి ననుసరించి జారీ చేసిన లైసెన్సులు గల వ్యక్తులు తాటి, ఈత చెట్లనుంచి నీరా గీస్తున్నారు.

ఈ నిబంధనలను అమలు పరచడం, వీటిని ఉల్లంఘించిన వారిపై చర్య తీసుకోవడం ఎక్సైజు శాఖ అధికార్లు మాత్రమే చేస్తారు. సంఘాల రిజిస్ట్రేషను, వాటి ఆర్థిక పరిస్థితి పరిశీలన నిర్వహణకు సంబంధించిన విషయాలను సహకార సంఘాల చట్టం ప్రకారం సహకార శాఖవారు చూస్తారు, కాబట్టి నీరా సంఘాలపై ఎక్సైజు, సహకార శాఖలు రెండు కూడా ఆజమాయిషీ వహించవలసి వుంటుంది.

ప్రశ్న : 182 ఎం. మల్లేశం, సంగారెడ్డి.

మంజీరా ప్రాజెక్టు పూర్తయ్యాక సంగారెడ్డి పట్టణానికి కూడా గొట్టాల ద్వారా నీరు సరఫరా అవుతుందా? దీనికి ఎంతకాలం పడుతుంది?

జవాబు : సంగారెడ్డి పట్టణానికీ, పైపు లైనుపైగల ఇతర గ్రామాలకు కలిపి రోజుకు 0.50 మిలియన్ గ్యాలన్ల నీరు సరఫరా చేయడానికి తలపెట్ట బడినది. పట్టణం లేదా గ్రామంకు వేరు వేరుగా నీటి లైన్లు వేసే ప్రతిపాదన మంజీరా పథకంలో లేదు. దిగుమతి కావలసిన యంత్ర సామగ్రి, విదేశీమారకం సక్రమంగా లభించి, ఉక్కు, సిమెంటు సరిగా సరఫరా అవుతే 1963 మే నెలాఖరు వరకు బహుశా ఈ ప్రాజెక్టు పూర్తవుతుంది.

ప్రశ్న : 183 ఎం. రంగనాథరావు, జగన్నాథపురం, మచిలీ పట్నం

అ. ఉరిశిక్ష విషయంలో మన రాష్ట్రంలో అనుసరించే విధానాన్ని వివరంగా తెలియజేయండి, ఇదే పద్ధతి భారతదేశమంతటా కూడా అమలు జరుగుతున్నదా?

ఆ. ఉరి శిక్షను రద్దు పరచ వానికిగల అవకాశాలను పరిశీలించడానికై భారత ప్రభుత్వం ఇదివరలో ఏమైనా చర్యలు తీసుకున్నదా?

జవాబు : అ. సెషన్సు కోర్టుల చేత ఉరిశిక్ష విధించబడిన ఖైదీలను జైళ్ళలో విడిగా లాకప్‌లో ఉంచుతారు. సెషన్సు జడ్జీలు విధించే శిక్షను హైకోర్టు ఖాయపరచవలసి వుంటుంది. ఉరి శిక్షను హైకోర్టు ఖాయం చేసిన పిమ్మట సెషన్సు కోర్టు శిక్షను అమలు పరచడానికి వారంటు జారీ చేస్తుంది. వారంటు చేరిన వెంటనే జైలు సూపరింటెండెంటు, నేరస్తుడికి ఒకవేళ అతడు సుప్రీం కోర్టుకు అప్పీలు చేయదలచినాగానీ లేదా భారత రాజ్యాంగంలోని దీనికి సంబంధించిన ఏదైనా నిబంధన క్రింద సుప్రీం కోర్టుకు అప్పీలు చేయడానికి ప్రత్యేకానుమతి కొరకు దరఖాస్తు చేయదలచినా గాని 1950 వ సం. పు సుప్రీం కోర్టు నియమావళిలో నిర్దేశించిన గడువు లోపుగా ఆ విధంగా చేయవలసిందిగా తెలియ జేస్తారు.

నేరస్థుడి చేతగాని లేదా అతని తరపునగాని చేయబడిన అప్పీలును లేక ప్రత్యేకానుమతి కొరకు ఇవ్వబడిన దరఖాస్తును కొట్టివేసినట్టు సుప్రీం కోర్టునుంచి వర్తమానం వచ్చిన వెంటనే జైలు సూపరింటెండెంటు ఒకవేళ లోగడ నేరస్థుడు క్షమాభిక్ష కొరకు దరఖాస్తు చేయకుండా వుండి ఇప్పుడు అట్టి దరఖాస్తును ఇవ్వ గోరినట్లయితే ఈ వర్తమానం చేరిన ఏడు రోజుల లోపుగా లిఖిత పూర్వకంగా క్షమాభిక్ష కొరకు దరఖాస్తు దాఖలు చేయవలసిందిగా తెలుపుతాడు. ఈ దరఖాస్తులను రాష్ట్ర గవర్నరుకూ, భారత రాష్ట్రపతికి వ్రాయాలి. ఈ దరఖాస్తు జైలు సూపరింటెండెంటు తన శాఖకు చెందిన ప్రభుత్వ కార్యదర్శికి పంపుతూ అందు వెంట జతపరచిన లేఖలో ఉరి శిక్ష అమలుకు నిర్ణయించిన తేదీని తెలియ జేస్తాడు. క్షమాభిక్షకు పెట్టుకున్న దరఖాస్తుపై ప్రభుత్వ ఉత్తర్వుల నిమిత్తం ఉరి శిక్ష అమలు నిలుపి వుంచబడినట్లు అయన ధృవపరుస్తాడు. రాష్ట్ర ప్రభుత్వం ద్వారా భారత రాష్ట్రపతి అంతిమ ఉత్తర్వులు అందిన తరువాత నేరస్థుడిని ఉరి తీస్తారు.

ఇదే పద్ధతి భారతదేశ మంతటా కూడా అమలు జరుగుచున్నది.

ఆ. ఉరిశిక్షను రద్దుపరచ డానికిగల అవకాశాలను పరిశీలించే నిమిత్తం లోగడ భారత ప్రభుత్వం ఏమైనా చర్యలు తీసుకున్నదో లేదో తెలియదు?

ప్రశ్న : 184 శ్రీ ఎ. మునిస్వామి పిళ్లే, వేణుగోపాల పురం, చిత్తూరు జిల్లా.

సబ్ రిజిష్ట్రారు వారి ఆఫీసులో దస్తావేజు విలేఖరులు లైసెన్సు పొందనిదే, దస్తావేజులు వ్రాయ కూడదని ప్రభుత్వము తీర్మానము చేసినట్లు విన్నాము. ఇది ఎంత వరకు నిజం? లైసెన్సు ఫీజు ఎంత చెల్లించాలి? దీనికి విద్యార్హత లేమైనా వుంచినారా? ఇది అమలుకు వచ్చుటకు ఎంతకాలము పట్టును.

జవాబు: (అ) మన రాష్ట్రంలో దస్తావేజులు వ్రాసేవారికి లైసెన్సులు ఇచ్చే పద్ధతిని ప్రభుత్వం ప్రవేశపెట్టింది ఇందుకు సంబంధించిన నిబంధనావళి 1961 ఫిబ్రవరి 23 వ తేదీ ఆంధ్రప్రదేశ్ గెజెటు నిబంధనావళి అనుబంధం రెండవ భాగంలో ప్రకటించబడినాయి.

(ఆ) లైసెన్సులను జారీ చేయడానికీ, వాటి పునరుద్ధరణకు దిగువ రేట్ల ప్రకారం ఫీజు విధించబడుతుంది:

| | మొదటి క్యాలెండర్ సంవత్సరానికి గానీ లేదా అందులో కొంత కాలానికి గాని: | రెండవ క్యాలెండర్ సంవత్సరంలో గనీ లేదా ఆ తరువాత సంవత్సరాలలో కొంత కాలానికిగాని పొడిగింపుకు: |
|---|---|---|
| ఫీజు : ఒక సబ్ జిల్లాకైతే | 50.00 | రూ. 10 00 |
| ఫీజు : ఒక జిల్లాకైతే | 75 00 | 15.00 |
| ఫీజు : ఒక జిల్లాకంటే ఎక్కువ | 100 00 | 20.00 |

ఈ క్రింది వ్యక్తులకు ఈ నిబంధనావళి ననుసరించి లైసెన్సులు ఇస్తారు.

1. రాష్ట్రంలోని ఏదైనా విశ్వవిద్యాలయం నుంచి న్యాయ శాస్త్రంలో డిగ్రీగానీ లేదా దానికి సమానమైన మరేదైనా అర్హతను గాని కలిగివున్నవారు, లేదా మొదటి గ్రేడు ప్లీడరు సర్టిఫికేటు పొందినవారు.
2. ఆంధ్రప్రదేశ్ రిజిష్ట్రేషన్ శాఖలో సబ్ రిజిష్ట్రారు ఉద్యోగానికి నిర్ణయించిన టెస్టులు ప్యాసై, క్లర్కు కంటే పెద్ద హోదా కలిగిన రిటైర్డ్ ఆఫీసరు.
3. డాక్యుమెంట్ రైటర్స్ లైసెన్సింగ్ టెస్టులో ఉత్తీర్ణులైనవారు.
4. పత్రములు వ్రాయడంలో మంచి అనుభవజ్ఞులైనట్లు లైసెన్సులు జారీచేసే అధికార్లకు విశ్వాసం కలిగించి, ఆంధ్రప్రదేశ్‌లో దస్తావేజు లేఖకుడుగా ఈ నిబంధనావళి అమల్లోనికి వచ్చిన తేదీకి కనీసం అయిదు సంవత్సరాల పూర్వం నుంచి పని చేస్తున్నవారు అయితే వారు లైసెన్సు పొందిన తేదీ లగాయతు రెండు సంవత్సరాల లోపుగా 210 (1) వ నిబంధనలో నిర్దేశించబడిన లైసేన్సింగ్ పరీక్షలో ఉత్తీర్ణుడు కావల్సి వుంటుంది.

రిజిష్ట్రేషన్, స్టాంపుల శాఖ ఇనస్పెక్టర్ జనరల్, జిల్లా రిజిష్ట్రారు సిఫార్సుపై ఎవరైనా వ్యక్తిని గానీ లేదా వ్యక్తులను గాని ఈ నిబంధనావళి వర్తింపు నుంచి మినహాయించవచ్చును.

5. రాష్ట్రంలో తగు సంఖ్యలో దస్తావేజు లేఖకులకు లైసెన్సులు ఇచ్చిన తరువాత, రిజిష్ట్రేషన్, స్టాంపుల శాఖ ఇనస్పెక్టర్ జనరల్ నిబంధనావళి క్రింద లైసెన్సు పొందిన దస్తావేజు లేఖకుడిచేత వ్రాయబడని మరియు ధృవపరచబడని నాన్‌టెస్టమెంటరీ పత్రాల రిజిష్ట్రేషనుకు నిర్ణీత ఫీజు కంటే అదనంగా రూ. 20/- ల ఫీజు తీసుకొనడానికి తేదీ నిర్ణయిస్తాడు.

రిజిష్ట్రేషన్ సబ్ డిస్ట్రిక్టుకు దేనికీ ఈ నిబంధనను ఇంకా వర్తింపజేయలేదు.

ప్రశ్న: 185 శ్రీ జి.వి. రాఘవులు, పందలపాక, తూర్పుగోదావరి జిల్లా.

(అ) తృతీయ పంచవర్షప్రణాళిక క్రింద ఆంధ్రప్రదేశ్‌లో కొత్తగా రైల్వే లైనులు వేయుటకు అవకాశముందా? ఉంటే అవి ఏమిటి?

(ఆ) ఇదివరకు వున్నటువంటి కాకినాడ - కోటిపల్లి రైల్వే లైనును పునరుద్ధరించుటకు ప్రయత్నమేమైనా వున్నదా?

జవాబు: (అ) ఈ క్రింద పేర్కొన్న నూత్న రైలు మార్గాలను తృతీయ ప్రణాళికలో చేర్చుటకు 1960 మే నెలలో రాష్ట్ర ప్రభుత్వం భారత ప్రభుత్వానికి సూచించింది.

(1) నాగార్జునసాగర్ మార్గంగా ఒంగోలు నుంచి హైద్రాబాద్ వరకు బ్రాడ్‌గేజ్ లైను వేసి తరువాత దాన్ని ఆదిలాబాదు

జిల్లాలోని సిర్పూరు-కాగజ్‌నగర్‌తో బ్రాడ్‌గేజ్ లైను ద్వారా కలపడం.

(2) శ్రీరామ్‌నగర్, నల్గొండ, ఖమ్మంమెట్టుల మార్గంగా రాయ్‌చూర్ నుంచి కొత్తగూడెం వరకు మీటర్‌గేజ్ లైను వేసి, మంచిర్యాల వరకు బ్రాంచి లైను వేయడం.

(3) భద్రాచలం మార్గంగా కొత్తగూడెం నుంచి విశాఖపట్నం వరకు బ్రాడ్‌గేజ్ లైను భద్రాచలం నుంచి మధ్యప్రదేశ్ బస్తర్ జిల్లాలోని బైలదిల్ల వరకు మరో లైను.

(4) రామగుండం నుంచి నిజామాబాదు వరకు బ్రాడ్‌గేజ్ లైను.

(5) (అ) నెల్లూరు నుంచి మైదుకూరు వరకు బ్రాడ్‌గేజ్ లైను.

(ఆ) మైదుకూరు, కడప, పీలేరు పాకాల మార్గంగా నంద్యాల నుంచి కాట్పుడి వరకు బ్రాడ్‌గేజ్ లైను

(6) కాకినాడ గుండా మద్రాసు-హౌరా లైను మళ్లింపు.

వీటి విషయంలో ఇప్పటి వరకు భారత ప్రభుత్వం నుంచి ప్రోత్సాహమేమీ లభించలేదు. రాష్ట్రప్రభుత్వం వీటికొరకు కేంద్రాన్ని పదే పదే అభ్యర్థిస్తూ, ఈ ప్రతిపాదనలలో కనీసం ఒకదాన్నయినా తృతీయ ప్రణాళికలో, చేర్చవలసిందిగా కోరింది. ఈ విషయంలో భారత ప్రభుత్వ నిశ్చయం ఇంకా తెలుపబడలేదు.

(ఆ) కాకినాడ - కోటిపల్లి రైలులైన్ను పునరుద్ధరించే ప్రతిపాదనేమీ జరగలేదు.

ప్రశ్న: 186 స్వర్ణనాయుడమ్మ, కొండపాతూరు.

ఆంధ్రప్రదేశ్‌లో మహిళా పంచాయతీలు ఎన్ని వున్నవి ? ఏయే జిల్లాలలో వున్నవి ?

జవాబు: పూర్తిగా మహిళలతో కూడిన పంచాయతీలు రెండు వున్నాయి వాటి పేర్లు :-

1. అనంతపూర్ గ్రామీణ పంచాయతీ, అనంతపురం జిల్లా
2. మట్టంపల్లి పంచాయతీ, నల్గొండ జిల్లా.

ప్రశ్న: 187 శ్రీ బి. బాలసిద్దారెడ్డి, సోమిరెడ్డిపల్లి, కడప జిల్లా.

కడప జిల్లా బద్వేలు తాలూకాలో ప్రవహించు "మదేరు" కు ఆనకట్ట నిర్మించే పనికి ప్రభుత్వం మూడు నెలల క్రితమే మంజూరీ ఇచ్చినట్టూ, ఈ పనిని ఈ సంవత్సరం మార్చిలో ప్రారంభించనున్నట్లు తెలుపబడెను, కాని ఇంతవరకు పని ప్రారంభం కాలేదు. నిర్మాణం ఎప్పుడు ప్రారంభమవుతుందో తెలియజేస్తారా ?

జవాబు: మొదట రూపొందించిన ప్రతిపాదనలు చాలా ఖర్చుతో కూడినవైనందున దీనికి ప్రత్యామ్నాయంగా మరో పథకాన్ని పరిశీలిస్తున్నారు. పథకం పూర్తిగా సిద్ధమైన వెంటనే ప్రభుత్వానుమతిని పొందడానికి చర్యలు తీసుకోవడమవుతుంది.

ప్రశ్న: 188 శ్రీ డి. ఎల్. సత్యనారాయణయ్య, ఎడిటర్, "పద్మనాయక్", తాడేపల్లిగూడెం.

ముఖ్య వాణిజ్య స్థానమగు తాడేపల్లిగూడెంలో జిల్లా మునసబు కోర్టును స్థాపించే ప్రయత్నమేమైనా గలదా ? ఉంటే ఎప్పుడు సిద్ధిస్తుంది ?

జవాబు: అటువంటి ప్రతిపాదనేమీ జరగలేదు.



మతిమంతులైనవారికి
హితులగు వెరవుగలవార లెటింగింతురు దు
స్థితిగాకుండంగం గార్యము
గతియొత్తియుందప్పులిడియుంగడవంబలికియున్

భార-సాస్తిక.

# దేశంతోపాటు మీరుకూడా అభ్యుదయం పొందండి !

మీరు మిగుల్చుకున్న డబ్బును

భారత ప్రభుత్వ చిన్న మొత్తాల పొదుపు పథకమునందు పెట్టుబడి పెట్టండి !

భారత దేశం యొక్క

సమాజాభివృద్ధి కార్యక్రమమునకు, గొప్ప నదీలోయ ప్రాజెక్టులకు,
రైలుమార్గములు, రోడ్ల అభివృద్ధికి తోడ్పడండి !

మీ డబ్బును ఈ క్రింది ఆకర్షణీయమైన గ్యారంటీడ్ సెక్యూరిటీలలో దేనిలోనైనా పెట్టుబడి పెట్టండి :

**12 సంవత్సరముల జాతీయ ప్రణాళికా పొదుపు పత్రాలు**

పరిణతి పొందిన పిమ్మట నూటికి సంవత్సరానికి 5.41 వంతుల చొప్పున వడ్డీ ఇవ్వబడుతుంది. ఇవి రూ. 5 లవి మొదలు రూ. 25,000 లవి వరకూ లభిస్తాయి. వ్యక్తిగతంగా ఒక్కొక్కరు రూ. 25,000 ల వరకూ కొనవచ్చు. రూ. 25,000 ల విలువ పత్రాలు ప్రావిడెంటు ఫండ్ పెట్టుబడులకు మాత్రమే.

**10 సంవత్సరముల ట్రెజరీ సేవింగ్సు డిపాజిట్ సర్టిఫికెట్లు**

ఏటా నూటికి 4 వంతుల వడ్డీ చెల్లించబడుతుంది. ఒక్కొక్కరు రూ. 50 లవి మొదలు రూ. 25,000 ల వరకూ కొనవచ్చు.

**15 సంవత్సరాల యాన్యుయిటీ సర్టిఫికెట్లు**

జారీ చేయబడు ధరలు : రూ. 1,330, రూ. 3,325, రూ. 6,650, రూ. 13,300, రూ. 26,600. ఈ సొమ్ము నూటికి యేడాదికి 4.25 కు కొంచె మెక్కువగా వచ్చే చక్రవడ్డీతోసహా నెలసరి వాయిదాలలో 15 సంవత్సరాలలో తిరిగి చెల్లించబడుతుంది. ఒక్కొక్కరు రూ. 26,600 ల వరకూ కొనవచ్చు.

**పోస్టాఫీసు సేవింగ్సు బ్యాంకు అకౌంట్లు**

25 నుంచి 10,000 ల వరకు గల నిల్వలపై నూటికి 2½ చొప్పున, రూ. 10,000 లకు మించిన నిల్వలపై నూటికి 2 చొప్పున వడ్డీ ఇవ్వబడుతుంది.

**క్యూములేటివ్ టైమ్ డిపాజిట్ పథకం**

నెలనెలా రూ. 5, 10, 20, 50, 100 లేక 200 వంతున 5 లేక 10 సంవత్సరాలపాటు డిపాజిటు చేస్తే, వడ్డీతోసహా మొత్తం అంతా ఒక్కసారే చేతికి వస్తుంది.

**ఐదేండ్ల వడ్డీలేని బహుమతి బాండ్లు**

1965 ఏప్రిల్ 1 న ఎంత విలువ బాండ్లుకొన్నారో అంతమాత్రమే తిరిగి ఇవ్వబడుతుంది.

బాండ్లు రూ. 100, రూ. 5 ల విలువగలవి వరుసగా జారీచేయబడుతాయి. లాట్లు మూడు నెలల కొకసారి అంటే ప్రతి సంవత్సరం జూన్ 1 న, సెప్టెంబరు 1 న, డిసెంబరు 1 న, మార్చి 1 న డ్రా వేయబడుతాయి. డ్రానిబట్టి ప్రతిసారి రూ. 100 లు విలువజేసే 1 లక్ష బాండ్లకు 40 బహుమతులు. రూ. 5 లు విలువజేసే 10 లక్షల బాండ్లకు 278 బహుమతులు ఇవ్వబడుతాయి.

**ఆదాయపన్ను లేకుండా మీకు మంచి ఆదాయం లభిస్తుంది! భావిభారత సౌభాగ్యానికై పెట్టుబడి పెట్టండి!**

ఈ పెట్టుబడులకు సంబంధించిన నిబంధనలను గూర్చి యితర వివరాలు మీకు చేరువగా వున్న పోస్టాఫీసు వద్దగాని, రీజియనల్ నేషనల్ సేవింగ్స్ ఆఫీసర్, 10-2-2, ఎ.సి. గార్డ్సురోడ్డు, హైదరాబాదు, లేక, మీ జిల్లా కలెక్టరు ఆఫీసులోని జిల్లా ఆర్గనైజరు వద్దగాని తెలుసుకోవచ్చు

# నేటివృత్తి

చింతలపూడి సన్యాసిరావు

సకల ప్రాణి సమాజమధ్య విలసత్ జ్ఞానార్జనాధిక్యతన్
మకుట ప్రాయుఁడవన్న కీర్తిఁ గొని సమ్మానమ్ములం బొందు నీ
వకటా! మానవ! హీనవృత్తి నిటు లన్యాయాక్రమా సత్య దౌ
ష్ట్యకఠోరస్థితిఁ బూనఁగాఁదగునె? నీ జన్మమ్ము వ్యర్థమ్ముగాన్,

ధరణీ జీవిత భూరి సాగర గతోద్య చ్చీకరంబై నిరం
తర భంగోన్ముఖ మైన జీవితము నిత్యంబన్నటుల్ భ్రాంతిమై
దరణీ శాసన సంభ్రమాన్వితుఁ డవై దర్పింతువేమోయి యో
నరుఁడా! వెన్కకుఁ జూపుఁ ద్రిప్పి యికనైనన్ నీతిఁ బాలింపుమా!

ధరణీ పాలన పారవశ్య నిరతోద్యద్భావులై చండసం
గరముల్ భూమి ఘటిల్లఁజేసి జనవర్గ క్షోభగావించి ము
ష్కరులై దుష్కర వృత్తి బూనిన నరుల్ సామ్రాజ్యముల్ గొంచుఁ బో
యిరె? భోగంబుల దోగుచున్ నిలిచిరే యిద్ధారుణిన్ నిత్యులై?

ధీరత్వమ్మని వీరకృత్య మనుచున్ దేశాభిమానమ్మటం
చౌరా! పేరులు పెట్టి డంబమున నత్యంతార్భటిన్ క్రౌర్య దు
ర్వా రాగ్నిచ్ఛటలన్ రగుల్కొలిపి సంగ్రామేష్టి సాగించి య
య్యారే! వేల్చెదవేల సాటిజనులన్ సాహంకృతిన్ దుర్మతిన్.

వీరత్వమ్మది కాదు సంగర సంగరమహా భీలక్రియా తాండవం
బౌరా! మానవ! క్రౌర్య కృత్యమదిసుమ్మా శాంతి దాంతిక్షమో
దార స్వాంత విరాజితోన్నతి జగద్భద్రాను సంధానమే
వీరత్వమ్ము సుమా యశః ప్రదము పృథ్విన్ నీకు ముమ్మాటికిన్.

కలతకుఁ గారణంబయి సుఖంబును దువ్వలఁ జేయు ముష్కరో
జ్వలఖల కృత్యముల్ తుదకు భగ్నములైచను నాత్మ నాశమే

ఫలమగు లోకగర్హణకుఁ బాలయి లోకముఁ బాయుకంటె యి
య్యిలపయి నీ వొనర్పఁగల కృత్యములేదె? అభాగ్య మానవా!

అనయంబున్ నయబాహ్య వర్తనుఁ డవై యన్యార్థ భంగక్రియా
వినియోగ ప్రతి ఖండవై స్వపర విద్వేష ప్రపూర్ణుండవై
కినుకన్ భూమిఁ జరించు నిన్నుగని సంఘీ భావ సంపన్న జీ
వన సౌఖ్యాఢ్యములౌ పిపీలికలు నవ్వంజూచుఁ బో మానవా!

మనమున నగ్నికుండమును మాటలఁ దేనెల సోన చూపులన్
ఘన విషతైక్ష్ణ్యమున్ వెలికి నవ్వు మొగంబునఁ గాఁగ హస్తమున్
గొని కరవాలనంబు కడుగొప్పగఁజేయు త్వదీయ వేషమున్
గని సమవర్తి యౌదలఁ బ్రకంపన ముంబొనరించు మానవా:

కలతలు సృష్టిచేసి బహుకక్షలు కల్పనచేసి జీవికన్
గలుషితముంబొనర్చుకొని కంటికి నిద్దురలేక యాత్మకున్
వలనగు శాంతిలేక మృదుభావము స్వాంతము నందులేక భూ
స్థలి నపురూప జన్మము వృథా యొనరించెదవేల మానవా!

ఈ.దంబమ్ములు నీకు తంత్రములు నోయీ మానవా మాని యే
నాఁ డీ విశ్వజన ప్రయోజన విధాన ప్రక్రియం బూను దా
నాఁ డే నీదగు మానవత్వమిల ధన్యమ్మౌను ధాత్రీసతి
చూడా దత్నమవై తరింతువు యశశ్శోభా ప్రదీప్తుండవై.

కలిగె సమస్తయంత్ర పరికల్పిత సంపద లత్యనంతముల్
వెలసె సమస్త సౌఖ్యకర విస్తృత సౌఖ్యము లప్రమేయముల్
తొలగె సమస్త కష్టములు తోయము నారిని గూడి వేడుకన్
మలయఁ గ రాదొ స్వర్గ సమమంగళ జీవిత పుష్ప వాటికన్.

ఎదఁ గాలుష్యముమాని పూను నరుఁడా యిప్పాటనేనిన్ సుఖా
స్పదమౌ మానవయోగ్య వర్తనముఁ బ్రజ్ఞాచక్షువుల్ విచ్చి నీ
మది కారుణ్య నిధానమై పరగ శుంభత్కీర్తి విస్తారసం
పదలన్ శోభిలి మేటిదేవతలు సంభావింపఁ బెంపొందుమా;

# మాలతీమాధవము

'పిపాసి'

భవభూతి రచించిన మూడు దృశ్యకావ్యములలో, ఉత్తర రామచరితము, శ్రేష్ఠతమమని సూరిజనులనిశ్చితాభిప్రాయము. మహా వీరచరితము, ఉత్తరరామచరితములు వాల్మీకిరామాయణకథా మూలములు. ఈ రెండును వాల్మీకికి యథాతథానువాదములని చెప్పుటకు వలనుపడదు. వాల్మీకిరామాయణమునకే మహాభాష్యమని చెప్పదగును. ఆర్షప్రోక్తమైనందున, ఆదికావ్యమయినందువలన తత్కథ నేవిధముగ మార్చినను దోషముండదని భవభూతితలంపు. అందులకే 'ఉత్తరే రామచరితే భవభూతిర్విశిష్యతే' యను నాభాణకము సర్వసూరిజనానుమోదమైనది. అంటే భవభూతి రచించిన మూడు శ్రవ్యకావ్యములలోను నిది శ్రేష్ఠతరమని కొందఱు, కాళిదాసునియధిగమించినాడని యీ నాభాణకమునకు వ్యాఖ్యానములు చెప్పుట కలదు. మరికొందఱు కాళిదాసునిగాదు వాల్మీకినే మించినాడని సమన్వయము చేయుచున్నారు అందువల్లనే గాబోలు "ప్రకృతికిన్ భాష్యప్రణేతల్ కవుల్" యను లోకోక్తి జనించినది. రామకథ నిత్యనూతనము. భవతు. ప్రకృతమనుసరామః.

మాలతీమాధవము పదియంకముల దృశ్యకావ్యము ఉత్తర రామచరితలో ఉన్న సౌమ్యతగాని, మహావీరచరితమందున్న దూకుడుగాని మాలతీమాధవ మందు గాన్పింపవు. ఆరెండింటి కిది మధ్యేమార్గమని చెప్పనొప్పు. అందువలననే మాలతీమాధవము ఆతడు రచించిన రెండవ దృశ్యకావ్యమయి యుండునని పెక్కండ్రభిజ్ఞులభిప్రాయపడుచున్నారు. కాళిదాసు సరసకవియని, భవభూతి హృదయకవియనికూడ యప్రథకలదు. అందులకు కారణములేకపోలేదు, కాళిదాసునకు జీవితము సిద్ధాన్నము. రాజాదరణము, రమణీప్రియదూతికలు మొదలగు జీవితావసర వస్తు సామగ్రి తదితర హంగులన్నియును సునాయాసముగ లభించినవి. సరస్వతీ కటాక్షముతో లక్ష్మీ సంపన్నము కూడ యాతనికి తోడైనవి, అంతేగాక అగ్రహానుగ్రహ స్థితిలో ఉన్నవాడు. భవభూతికి విశేషమగు పాండిత్యమున్నను రాజాశ్రయము లేనందున యాతని ప్రతిభలోక ప్రాచుర్యము నందలేదు. అందులకే భవభూతి మున్ముందు తన మనస్తత్త్వమును, నభిరుచిని సరిగా నర్థము చేసుకొని పుట్టబోవు "సమానజన్ముని"కై రచించుచున్నానని కంఠోక్తిగా మాలతీమాధవమున వాకొనినాడు. భవభూతి శాత్త్వికుడు. అంతేగాక జీవితమంతయు ఈ దృశ్యకావ్యత్రయికి ధారవోసి యనీదృశమగు తన ప్రతిభకు తగిన లోకప్రాచుర్యము రానప్పుడతని మనస్తత్త్వమెటులుండును. అందులకే తనను నిరాకరించు వారి నుద్దేశించి మాలతీమాధవమును రచింపలేదని ఘంటాపథముగ పేర్కొనినాడు. మరి పామరులకు "భూమ్నారసానాం గహనాః ప్రయోగాః" నచ్చవుగద.

సంస్కృత సాహిత్యమున మాలతీమాధవము క్లిష్టతరమైన సాంఘిక ప్రకరణము. అయినను దీనికి పెక్కు అనువాదములు వెలసినవి. ఈ ప్రకరణమునకు పెక్కు ఔత్తరాహ విద్వాంసులు శ్రమించి సుబోధకమగు వ్యాఖ్యానములను రచించి భవభూతి ప్రతిభకు నివాళు లర్పించినారు. ఉత్తర రామచరితము వలె మాలతీమాధవము బహుళప్రజాదరణము పొందలేదు. పఠనపాఠనములు కూడ చాలతక్కువని చెప్పవచ్చును. పూర్ణ సరస్వతి యను కేరళదేశీయుడు సుబోధకమగు రసమంజరీ వ్యాఖ్యానమును రచించియేతద్గ్రంథ పఠనపాఠనములను సుగమము గావించినాడు. ఈతడు మాలతీ మాధవమునకేకాక, ఉత్తరరామ చరితమునకు, అనర్ఘ రాఘవమునకు మేఘ సందేశమునకు వ్యాఖ్యానములు రచించినాడు. ఉత్తర రామ చరితము, అనర్ఘ రాఘవముల వ్యాఖ్యానము లింకను ప్రకటింపబడలేదు. మాలతీమాధవమును పూర్ణ సరస్వతి వ్యాఖ్యానముతో తిరువాన్కూరు విశ్వవిద్యాలయము వారు 1953 లో ప్రకటించినారు. దీనికి శ్రీ కె. యస్. మహాదేవ శాస్త్రి చరణులు విపులమగు పీఠిక రచించినారు, అది వారి సంపాదకత్వముననే వెలువడినది. మాలతీమాధవము సాంఘిక ప్రకరణము. ప్రకరణమందలి కథను కవి యూహించి కల్పింప

వలెను. అంతేగాక అది ప్రాపంచిక జీవితమునకు సంబంధించినదై యుండవలెను. నాయకుడు మంత్రియో, బ్రాహ్మణుడో, వైశ్యుడో ఉండవలెను. అతడు ధీరప్రశాంతుడు కావలెను మిగిలిన లక్షణములు, రసములు మొదలగునవి నాటకములో వలెనే ఉండవలయును. నాయిక ఉత్తమకులసంజాత యైనను కావలెను, వేశ్య యైనను కావలెను. నాయికల లక్షణమును బట్టి ప్రకరణము మూడు విధములు. నాయిక ఉత్తమకులసంజాత యైనందున మాలతీ మాధవము శుద్ధప్రకరణము. 'మృచ్ఛకటికలో వసంతసేన (నాయిక) వేశ్య యైనందున అది సంకీర్ణప్రకరణము. అందు నాయిక ఉత్తమ కులీన మరియు వేశ్య. ప్రకరణమున కూడా నాటకములలో వలెనే పంచసంధు లుండవలెను. ప్రకరణమున కథ కల్పితమై యుండవలెనని యితఃపూర్వముల్లేఖింపబడినది. కాని దీనికి మూలము సోమదేవ భట్టారకుని కథాసరిత్సాగరమున కన్పించు చున్నది. దానికి వాతావరణము, పరిసరములను మార్చి భవభూతి ఒక అద్భుత కల్పనగా రూపొందించినాడు.

భవభూతి మహావీరచరితమును మొదట రచించి సభాసదులచే భంగపడినాడు. దాని కాత డాత్మపరిశీలన జేసుకొనినాడు. మహావీరచరితము వీర రసప్రధానమగు నాటకము అందాతడు పడిన కఠోరపరిశ్రమ ఫలించలేదు. మహావీర చరితమున శృంగారము లేదు. వినోదముకై యాశపడిన ప్రేక్షకులకు ఆశా భంగము కలిగినది. సభాసదులకు తద్భిన్నము కావలెనేమో? యని తలపోసి వారిపై కక్ష సాధించు కొనుటకు చేసిన యత్నము మాలతీమాధవము. మాలతీమాధవ మందు స్త్రీ పాత్రలు చాలా కలవు, పురుష పాత్రలు చాల తక్కువ. అంతేగాక నుల్లేఖించు విధానమున కూడా మార్పు వచ్చినది ప్రశస్తతమమగు ఉత్తరరామచరిత రచనను చివరకు మిగుల్చు కొన్నాడు. మరి యది వాల్మీకికే మహా భాష్యము కదా. భవభూతి తన మూడు గ్రంధములలోను వాడిన శ్లోక సంఖ్యను తారతమ్య పరిశీలన చేసిన మాలతీ మాధవ రచనయందలి మార్పు కనపడును. మహావీర చరితములో 390, మాలతీమాధవములో 234, ఉత్తర రామ చరితములో 255 ఈ మూడు నాటకములందును 25 వృత్తములను వాడినాడు.

మహా వీరచరితము వ్రాయునాటికాతడు పరిపూర్ణ పాండిత్య శోభితుడై స్వచ్ఛంద విహారము చేసినందున ఆ నాటకము సభాసదుల ఆమోదము పొందజాలక పోయినది. అందువలన యిట్టి క్లిష్టతరమగు సమస్యలు లేని సరసమైన రచన సాగింపవలెనని తలంచి మాలతీమాధవమును రచించినట్లు కన్పించుచున్నది. అందుకు నిదర్శనముగా స్రగ్ధరా, శార్దూలవిక్రీడితముల వంటి వృత్తములను తగ్గించినాడు ఈ ప్రకరణము సర్వజనానుమోదమగునటుల మంజుభాషిణీ వృత్తమును జొప్పించినాడు. ఏ కారణము వల్లనో మహావీరచరితమునకు పఠన పాఠనములు లేవు. అందలి శైలీ క్లిష్టతయే దానికి కారణమై యుండనోపు. ఈతని మూడు నాటకములలో మహావీరచరితమందే శ్లోకసంఖ్య హెచ్చు. ఔద్ధత్యముకూడ మెండు. తన శైలిని సరళము చేసి, కొన్ని ఉదాత్తాశయములు, ఉదాత్త భావములను నాటి ప్రజాసామాన్యమునకనుకూలించు విధమున మార్పులు చేసి మాలతీమాధవమును నాటి ప్రేక్షకులకు సమర్పించినాడు. తనను కించపరచు వారినుద్దేశించి వ్రాయలేదని చెప్పినమనీష యిట్టి మార్పులు చేయుటకు తగు కారణములుండవలెను దేశకాల పాత్రములతనితో సహకరించి యుండకపోవచ్చుననను యూహ కలుగుచున్నది. సమకాలీనులు, ఈర్ష్యాళువులు నగు కవులు కొందఱితని భంగపాటుకు కూడ కారణభూతులై యుందురని నా యూహ.

భవభూతి మాలతీ మాధవప్రస్తావనలో:-

భూమ్నా రసానాం గహనాః ప్రయోగాః
సేహార్ద్రి హృద్యాని విచేష్టితాని
ఔత్సుక్య మాయోజిత కామ సూత్రం
చిత్రకథా వాచి విదగ్ధతేతి. 1-4 (మాలతి)

అనియు

యద్వేదాధ్యయనం తథో పనిషదాం సాంఖ్యస్య యోగ్యస్యచ
జ్ఞానం, తత్కథ నేన కిం నహి తతః కశ్చిద్గుణో నాటకే
యత్ప్రౌఢిత్వముదారతాచ వచసాంయచ్చార్థతో గౌరవం
తచ్చేదస్తిత తస్తదేవ గమకం పాండిత్య వైదగ్ధ్యయోః
1-7 (మాలతి)

చెప్పినాడు. అనగా రసవద్ఘట్టములందు ప్రౌఢోక్తులు, హృదయమును కరగించు భావకల్పనలు, శృంగార రస నిర్వహణమున ఔత్సుక్యము, చిత్రకథలను వాచ్యముగా చెప్పుటలో వైదగ్ధ్యము కలదని, అంతేగాక వేదములు, ఉపనిషత్తుల సాంఖ్య యోగ మభ్యసించినను, అర్థస్ఫోరక భావములు ప్రౌఢత్వము, రచనా పాటవము సంయుతాత్మత మొదలగునవి కలవనియు, పాండిత్య సంపన్నులకవి యవగతము కాగలవని చెప్పినాడు. ఉత్తర రామ చరితమున, మహావీర చరితమున తాను వశ్యవాక్కునని చెప్పుకొనినాడు. అందులకే "యంబ్రహ్మాణం ఇయం దేవీ

వాగ్వశ్యై వాన్వ వర్తత" యని ఉత్తర రామ చరితమున, 'వశ్య వాచః' యని మహావీర చరితమున నుడివినాడు. జీవనభరణ ప్రయాసమున నెన్నియో సాధక బాధకములకు గురియై, స్వప్రాశస్త్యముతో, సాహిత్యవేత్తగా, మహాకవిగా ఆదరము పొందుట కెంతయో శ్రమించినటుల తోచును. 'ఈ దృశంజీవలోక పరివర్తనమను భవితుమ్ నశక్తి రస్తి' యనియు, మజొకచో 'మదధీనో విధిర భూదలం వాతత్స్నఋత్వా దహతి యదవస్కంద్య హృదయమ్' అని చెప్పుకొనినాడు అందులకే 'కాళిదాసు భారతి బహుభావ చేతన పరాయణ సుందరి' 'శబ్ద తాత్త్విక శ్రుతి భవభూతి వాణి' యని రాయప్రోలు సిద్ధాంతీకరించినాడు. భవభూతి తాను పొందిన పరిభవమును కూడా మజొకస్థలమున సీత వాక్కున 'నసహిష్యేకసుభవితుం జీవలోకస్య పరిభవమ్'. (ఉత్తరరామ చరితము. సప్తమాంకము.)

ఇక మాలతీ మాధవ గాథను సూక్ష్మీకరింతును.

## కథాసారము

ఈ గాథ పద్మావతీపురమున జరిగినది. బౌద్ధ పరివ్రాజిక యగు కామందకివద్ద కుండినపుర వాస్తవ్యుడు దేవరాతుడును, పద్మావతీపుర వాస్తవ్యుడు భూరివసువు విద్య నేర్చుచుండిరి. వారప్పుడే పరస్పరము వియ్య మంది తమ స్నేహబంధమును పెంపొందించుకొనవలెనని యామె సమక్షమున ప్రతిజ్ఞగావించుకొనిరి. ఆ పిదప వారిరువురు తమతమ నెలవుల మంత్రులైరి. కాలక్రమమున వారు సంతానవంతులు కూడనైరి. దేవరాతునికి మాధవుడను కుమారుడు, భూరివసువునకు మాలతి యను తనయయుకలిగిరి. యుక్తవయస్సు రాగానే మాధవుడు విద్యార్థియై పద్మావతీపురమునకు వచ్చెను. కామందకి ఇచ్చటనే ఉండెను. పద్మావతీపురమును పాలించు రాజు మాలతిని తననర్మ సచివుడగు నందనునికిమ్మని భూరివసువునడిగెను. దానికిష్టపడక భూరివసువు రాజునకు నర్మగర్భముగా ప్రత్యుత్తరమిచ్చి, మాలతికి మాధవునకు చాటుగా వివాహము చేయవలసినదిగా కామందకిని కోరెను. ఇది ఇట్లుండ మాలతీ మాధవులు పరస్పరము ప్రేమించుకొనుచుండిరి. మాధవి చెలికత్తె లవంగిక. మాధవునికి చెలికాండ్రు మకరందుడు కలహంసకుడు. మాలతికి నందనుని చెల్లెలు మదయంతిక కూడ చెలికత్తె. మాలతి మాధవుడు గ్రుచ్చిన పొగడదండనే నిరంతరము ధరించి చిత్రఫలకమున మాధవుని ప్రతిమనే వ్రాయుచుండును. ఆ చిత్రఫలకము లవంగిక ద్వారా మాధవునికి జేరెను. మాధవుడు దానియందు తన ప్రతిమ పొంత మాలతి చిత్రమును వ్రాసెను. పిమ్మట యాచిత్రఫలకము మాలతి హస్తగతమయ్యెను. ఇది యిట్లుండ వ్యాఘ్రమొకటి మఠము నుండి తప్పించుకొని మదయంతిక పైకి వచ్చెను. మకరందుడామెను పులివారి నుండి రక్షించెను. ఈ విధముగ వారికన్యోన్యానురాగము జనించెను. ఇంతలో మాలతిని నందనునికిచ్చునట్లు భూరివసువు నిశ్చితార్థము చేసెను. అందలి రహస్యము తెలియక మాలతీమాధవులు వెత జెందిరి మాధవుడు తన కోర్కెను నెరవేర్చుకొనుటకై మార్గాంతరము లేక రాత్రి శ్మశానమున మాంసమమ్ముటకు బయల్దేరెను. అదే రాత్రి అఘోరఘంటుడను కాపాలికుడు నిద్రించుచున్న మాలతిని కపాలకుండల ద్వారా రప్పించి దేవికి బలిచేయ తలపెట్టెను. ఆ బలి చేయు స్థలమా శ్మశానమందలి కరాళాయతనము మాలతి యాక్రందనమును విని మాధవుడు వచ్చి అఘోరఘంటుని బలియిచ్చి మాలతిని కాపాడెను. మాలతికి బదులుగా మకరందుడామె వేషమున నందనుని ప్రక్కన పెళ్ళికూతురయ్యెను. కామందకి సహాయమున మాలతీమాధవులు మరొక యుద్యానవనమున చాటుగా వివాహమాడిరి. మకరందునితో (మాలతి యను భ్రమతో) సరససల్లాపములాడుటకు యత్నించు నందనునికి అతడు పాదరక్షప్రయోగముతో ప్రత్యుత్తరమిచ్చి యాతని చెల్లెలగు మదయంతికను తోడ్కొని వెళ్ళిపోయెను. వారు పలాయన మంత్రము పఠించుచుండగా తలారులడ్డగింప మకరందుడు మదయంతికను మాధవునికడకు పంపి వారికి ప్రత్యుత్తరమిచ్చెను. ఈ కలహము సంగతిని కలహంసకుని వలన విని మాధవుడు మాలతి నచటనే వదలి మకరందునికి సాయపడి తలారులను జంపెను. వారు తిరిగి వచ్చువరకచట మాలతి లేదు. అఘోరఘంటుని చంపిన కసిని దీర్చుకొనుటకు కపాలకుండల మాలతిని ఆకాశమార్గమున ఎత్తుకొని శ్రీశైలమునకు పోయెను. ఆమె (మాలతి) కై వెదకుచున్న మాధవ మకరందులకిది కపాలకుండల పనియని కామందకి చెప్పెను. అయినను మాధవుడు దిగులుపడి మూర్ఛ చెందెను. భూరివసువు కూడ మాలతి నశించినదనుకొని అగ్నిప్రవేశము చేయతలపెట్టెను. ఇంతలో సౌదామిని యను నామె (కామందకి శిష్యురాలు) కపాల కుండలను భయపెట్టి మాలతిని నభో మార్గమున శ్రీశైలము నుండి తెచ్చి, మాధవుని భూరివసువును రక్షించెను. తలారుల జంపిన సంగతి విని పద్మావతీ పురమేలు రాజు మాలతీ మాధవులకు, మదయంతీ మకరందులకు వివాహములు జరిపించెను.

మాలతీమాధవమున కథసుసుగా సాగలేదని పెక్కు సంస్కృత సాహిత్య విమర్శకులభిప్రాయపడుచున్నారు. వర్ణనలు

బహుళముగానుండుటే దీనికి కారణములు. మరికొందఱు మాలతీమాధవ దశమాంకము కేవలము విక్రమోర్వశీయ చతుర్థాంకమున కనుకరణమని తలంచుచున్నారు. ఈ ప్రకరణ మందు రెండు పాఖ్యానములు గలవు మొదటిది మాలతీమాధవుల గాథ—రెండవది మదయంతికామకరందుల ఉదంతము. మొదటి రెండంకములలో శృంగారము పాఠకుల మనస్సుకు చక్కగా హత్తుకొనును. మూడవఅంకమున రౌద్రము, భయానకము పంచమాంకమున, 9, 10 అంకములలో అద్భుతరసమును కలదు. ఎంత పొడిగించినను, ఎన్ని వర్ణనలు చేసినను భవభూతి ప్రధాన కథకు బలము చేకూర్చినాడే కాని దాని ప్రాముఖ్యమెచ్చటను కించపఱచలేదు. అంతేగాక భావవ్యక్తిలో ఇంకొక విశేష మున్నది. అతనికి కొండలనిన, నదులనిన యపరిమితమైన ప్రేమ అందువలన వీలుపడిన స్థలములలో వాటి వర్ణనలను మాన లేదు. భవభూతి గొప్ప మనస్తత్త్వవేత్త యేమోయనిపించును. ఏలనన మానవ స్వభావము నానా ఘట్టములలో ఉదాత్తముగ చిత్రించును. ఇతనికి గోదావరి యనిన ఎక్కుడుప్రీతి. అందు వలన నితడుకూడ యథాశక్తి గోదావరిని వర్ణించినాడు. తన మూడు నాటకములలో గోదావరి నిరువది నాల్గు మార్లు స్మరించినాడు

భవభూతి శూద్రకుడు మృచ్ఛకటికలో కథా సంవిధానమున కనబరచిన నిపుణతను మాలతీమాధవములో చూపించలేదని కీ.శే. డా. రామకృష్ణ గోపాల భండార్కరు పండితులభిప్రాయ పడినారు ఏ సన్నివేశములెట్లుండినను, మాలతి రెండు మార్లు మరణావస్థ నుండి రక్షింపబడినది. మాలతీ మాధవమున రెండు ప్రేమ గాథలను చక్కగా కూర్చినాడు మకరందుడు మదయంతి కను పెండ్లి యాడుట కాతని కొటంకములేకుండెను. అతడే కదా యామెను మృత్యువాతినుండి రక్షించినది. అతని పెండ్లి ముక్క సూటిగా జరిగినట్లయిన ప్రధాన కథకు సహాయము జరిగి యుండెడిది కాదు.

భవభూతి తాను ఎంత యత్నించి తనశైలిని సరళము చేయదలచినను యాతని రచన మూడు పంతులు ప్రౌఢముగనే సాగినది. ఇతనికి కొన్ని విచిత్రమగు వ్యాకరణ ప్రయోగములు వాడుట కరతలామలకము. ఇతని వచనములు ఓజోగుణ భూయిష్టములు. అయితే యీ వచనములందలి సమాసములు పరుషాక్షర సమన్వితములు కావు, సరళముగా మాత్రముండును. మాలతిలో యాతని శైలి సమానముగా లేదు. ఒకచో సరళము మరొకచో వాగ్డంబనలతో నిండియున్నది. ఈ నాటకమందు ఒక్క విశేషము కన్పించును. కవి శైలిలో అత్యున్నతమగు స్థితిని నందుకొనుచున్న ఛాయలు కన్పించును. దీనికి తార్కాణము ఉత్తర రామచరితము. మాలతీ మాధవమితని స్వకపోలకల్పనా చాతురికి చక్కని నిదర్శనము. ఇందలి శృంగారము లాక్షణికుల ప్రశంసల నందినది. అనుకూల దాంపత్యానురాగము, ఆనంద విషాదములు అసత్యస్నేహము మొదలయినవినితడు హృదయము విప్పి చూపినట్లుగా మరియొక కవి చూపలేడనుట యతిశయోక్తి కాదు. నదీగిరితరుల తామ్రుగవిహాంగముల స్వభావ వర్ణనమితని సొమ్ము, ఏ యవస్థయందు మానవ హృదయ మెట్లుండునో వర్ణించునెడ భవభూతికి జాలినవాడులేడు. అతని మనస్తత్త్వ పరిశీలన జేసినయాలతీ విషయమున పరాకాష్ఠకు జెందిన వాడని తెలుపు ఇకమచ్చుకు కొన్నిశ్లోకముల నుదాహరించెదను.

> మ్లానస్య జీవకుసుమస్య వికాసనాని
> సంతర్పణాని సకలేంద్రియ మోహనాని
> ఆనందనాని హృదయైకరసాయనాని
> దిష్ట్యామయాపి అధిగతాని వచోమృతాని (VI-8)

మాధవుడు మకరందునితో మాలతిని గురించి చెప్పు మాటలివి.

దైవము నన్ను కరుణించినాడు. ఏలనన ఆమె వచోమృతములనిప్పుడే వింటిని తత్ఫలితముగ వాడిపోయిన నా జీవన కుసుమము వికసించినది. అందువలన నాకు సంతసమును, ఆనందమును కలుగుచున్నది. వేయేల ఆమె వచోమృతము నా హృదయ పీఠమును కదిలించినది. మాలతీమాధవమునకు చక్కని తెలుగు అనువాదము చేసినవారు అభినవ వాగనుశాసన మల్లాది సూర్యనారాయణ శాస్త్రి చరణులు. వారు భవభూతి మూడు నాటకములను తెలిగించారు. వారు భవభూతిని గురించి ప్రమాణం. పై శ్లోకమునకు వారి యనువాదమునిట నొసగు చున్నాను.

> ప్రాణసఖీవచోమృత మహత్త్వ మహా! యదుగంటినట్టి నా
> ప్రాణములేచి వచ్చినది, వాడగజొచ్చిన యింద్రియంబులన్
> ద్రాణ యొకింత చేరినది, దైవ వశంబున జావు దప్పెఁ గ
> ల్యాణము గల్గునన్న యభిలాషయునేర్పడె మానసంబునన్.

మాధవ మకరందులు మాలతి నన్వేషించుచు పెక్కుచోట్లు తిరుగుదురు. ఆ సందర్భమున భవభూతి గిరిగుహాలతావి

హంగ మృగములను గూర్చి వర్ణనలు విరివిగా జేసినాడు. ఇవి శ్రీరాముడు దండకారణ్యమున తిరుగునప్పుడు వ్రాసిన శ్లోకముల జ్ఞప్తికి తెచ్చును.

నిర్మాణమేవ హి తదాదరలాలనీయం
మా పూతనాత్వ ముపగాః శివతతిరోధి
నైసర్గికే సురభిణః కుసుమస్య సిద్ధా
మూర్ధ్నిస్థితిన్నముసలైరవతాడనాని. (IX-50)

భగవత్సృష్టిని చక్కగా పరిరక్షింప వలెను. రాక్షసుని వలెగాక,మానవత్వమును సర్వజీవ కోటిని ప్రేమించుట నేర్చుకొనవలెను. స్వభావ సిద్ధముగా పరిమళించు కుసుమమునకు సహజమైన తావు శిరస్సు కాని, రోకటి పోటులకు గురి చేయుట కాదు. దీనికి తెలుగు పద్యము.

దివ్య సౌందర్యరాశియా దేహమునకు
హానికలిగింపఁబోకు పుణ్యంబు నీకు
సురభికుసుమంబు నెవరైన శిరసునందు
దాల్తురేకాని రోకళ్ల దంపబోరు.

మకరందుడు మాధవునకు చెలికాడు. అతని కాంతరంగికుడు కూడ, అతడు మాలతికై పడుబాధ చూచి యివ్విధముగబలికినాడు.

సుహృది గుణనివాసే ప్రేయసి ప్రాణనాథే
కథమపి సహపాంసుక్రీడనక్రీడసఖ్యే
ప్రియజన విరహాధివ్యాధివేగం దధానే
మతహృదయ విదీర్యత్వం ద్విధాన ప్రయాసి.
(IX-28)

(తెలుగు అనువాదము)

చిన్నతనమునుండి నాచెలిమికాడు
నాబహిః ప్రాణమీ సుగుణాలరాశి
మాలతీ విరహాగ్ని చే మగ్గిందుచుండ
పాడుహృదయమ! రెండుగా బగులవేమి?

మకరందుడు ఒకసరోవర రామణీయకతను చూచి ముగ్ధుడగును. భవభూతి దానినీ విధముద వర్ణించినాడు.

ఏతస్మిన్ మదకలమల్లికాక్ష పక్ష
వ్యాధూతస్ఫురదురుదండపుండరీకః
బాష్పాంభః పరిపతనోద్గమాంతరాలే
దృశ్యంతమ విరహితా శ్రియోవిభాగాః (IX-14)

కలనాదంబొనరించు హంసముల రెక్కల్ సోకదూగాడుతూ
డుల భాసిల్లెడు తెల్లతామరల చోటుల్ వేడికన్నీటిచు
క్కల చాలొల్కుచు వెండిపుట్టునడుమన్ గన్గొమ్మ
కన్నారమం
జులసత్పంకజలక్ష్మి నీకు గనిపించున్ నైజరమ్యాకృతిన్

ఇట్లింకెన్నియోగలవు. ఇట్టిసరసమైన ప్రకరణమును చదివియానందించవలసినదే. భవభూతి ప్రతిభ యద్వితీయమని ప్రశంసించవలసినదే, దీనికి మనదేశమున పఠనపాఠనములు కల్గించి విద్వల్లోకమున లోకప్రాచుర్యము గావింపదగిన నాటకము, ఉత్తర రామచరితముపై ఇంతకుమున్నే వేఱొకచో విపులమగు వ్యాసమును వ్రాసితిని. మహావీరచరితము పైమరొక మారువ్రాసెదను.

"దృష్టం కిమపి లోకేऽస్మిన్న నిర్దోషంననిర్గుణమ్
అవృణుధ్వమతోదోషాన్ వివృణుధ్వంగుణాన్బుధాః"

---

విను సంసృతి మృత్యువు ప
ట్టనఘా నిస్సంగ వృత్తి యమరగృహము నె
ట్టన నిట్లగుటంగనికొని
తునుముము సంసార రజ్జు దురితవిదూరా!
-భార. శాంతి.

# ప్రభుత్వ నిర్ణయాలు

భారత ప్రభుత్వం నిర్దేశించిన సైనికపాఠశాలను విశాఖపట్నం జిల్లా కోరుకొండలో నెలకొల్పడానికి రాష్ట్ర ప్రభుత్వం నిశ్చయించింది. పాఠశాలకొరకు విజయనగరం మహరాజ్‌కుమార్ రూ.30 లక్షలు విలువచేసే ఒక భవనాన్నీ, 49 ఎకరాల భూమిని దానం చేశారు. పాఠశాలను వచ్చే జనవరిలో తెరుస్తారు పాఠశాలలోని సీట్లలో 50శాతం సీట్లను ఆంధ్రప్రదేశ్‌కు చెందిన అభ్యర్థులకొరకు కేటాయిస్తారు. మిగితా స్థానాలకు ఇతర రాష్ట్రాలనుంచి అభ్యర్థులను ఎన్నికచేస్తారు. పాఠశాలకు అయ్యే ఖర్చులో కొంతభాగాన్ని కేంద్రం భరిస్తుంది.

ప్రణాళికా పథకాల క్రింద నెలనెలా జరిగేడి అభివృద్ధిని పరిశీలించే నిమిత్తం మంత్రులతోనూ, సీనియర్ అధికార్లతోనూ శాఖాపరంగా ఆరు సమన్వయ సంఘాలను ఏర్పాటు చేయడానికి రాష్ట్ర ప్రభుత్వం నిశ్చయించింది. ఇంకా సమర్థంగా పనిచేయడానికి వీలుగా ప్రస్తుత సంఘాన్ని విభజించడానికై రాష్ట్ర పరిపాలన సంస్కరణల సంఘం సిఫార్సు చేసింది. విద్యుచ్ఛక్తి, పరిశ్రమల సంఘానికి ముఖ్యమంత్రి అధ్యక్షత వహిస్తారు. వ్యవసాయం, నీటి వనరులు సంఘానికి ఉపముఖ్యమంత్రి, రహదార్ల సంఘానికి పబ్లిక్ వర్క్సుశాఖమంత్రి, ఆరోగ్యం గృహ నిర్మాణ సంఘానికి ఆరోగ్యశాఖ మంత్రి విద్య, సంక్షేమ కార్యక్రమాల ఉప సంఘానికి విద్యాశాఖమంత్రి, పంచాయతీలు, పట్టణాభివృద్ధి, ప్రచారంతో సహా ఇంకా ఇతర విషయాలకు సంబంధించిన సంఘానికి ప్రణాళిక సమాచార శాఖామంత్రి అధ్యక్షత వహిస్తారు.

ఆంధ్రసర్పులు, మంత్రసానులచట్టాన్ని తెలంగాణా ప్రాంతానికికూడా వర్తింపజేయడానికి రాష్ట్రప్రభుత్వం నిశ్చయించింది.

కొత్తఢిల్లీలో వచ్చే డిశెంబరు నెలలో భారత వాణిజ్య పరిశ్రమల మండలుల సమాఖ్య అధ్వర్యంలో జరుగనున్న, అంతర్జాతీయ పారిశ్రామిక ప్రదర్శనంలో రాష్ట్రప్రభుత్వం పాల్గొంటుంది. మంటపం నిర్మాణం, స్థలం అద్దెక్రింద ప్రభుత్వం రూ. 2½ లక్షలు మంజూరు చేసింది.

~~~~~~~~~~

# రక్తదాత త్యాగనిరతి

గూడూరుకు చెందిన న్యాయవాది, రక్తదాత శ్రీ ఎస్.వి. **నరసింహారావు**, 1961 ఆగస్టు 7వ తేదిన నెల్లూరులో రిజిస్టరు చేసిన వీలునామాలో తన మరణానంతరం తన భౌతికదేహాన్ని హైదరాబాదులోని ఉస్మానియా జనరల్ ఆసుపత్రి సూపరింటెండెంటు అతని ఇష్టప్రకారం ఉపయోగపరుచుకోవాలని పేర్కొన్నారు. తన నేత్రాలను ఎవరైనా వ్యక్తి ప్రయోజనార్థం. వినియోగించాలని కూడా ఆయన తన విల్లులో వ్రాశారు. శ్రీ **నరసింహారావు** ఇప్పటికి నలభైసార్లు రక్తదానం చేశారు.
~~~~~~~~~~

రామగుండం వద్ద బొగ్గు గనికి ప్రారంభోత్సవం జరిగిన సమయంలో వచ్చిన గ్రామస్థులు. వీరిలో చాలామందికి ఈ గనిలో ఉద్యోగం లభించింది.



సింగరేణి గని ఉద్యోగులు ప్రదర్శించిన నాటకంలోని ఒక దృశ్యం



సింగరేణి బొగ్గుగనుల వద్ద ఏర్పాటు చేసిన "పిల్లల వినోద స్థలం"



"కిసాన్ యాత్ర": ఆంధ్రప్రదేశ్ కర్షక బృందం భారత దర్శనయాత్ర సందర్భంలో ఢిల్లీ వెళ్ళినప్పుడు అక్కడ రాష్ట్రపతి ముఖ్యమంత్రిని, ఆర్థిక మంత్రిని కలుసుకున్నప్పుడు తీసిన చిత్రం



తెలంగాణా వేంకటేశ్వరస్వామి—శిథిల దేవాలయం —(10 వ పుట చూడుడు)



కూచిపూడి నృత్య నాటిక—ఒక దృశ్యం.



కూచిపూడి నాట్య భంగిమలో కుమారి యామినీకృష్ణమూర్తి



స్వాతంత్ర్య దినోత్సవాన దీపాలంకరణ : హైద్రాబాదులో సెక్రటేరియట్ గేటు దృశ్యం



హైద్రాబాదు టెలిఫోను విభాగం మూడవదశ కార్యక్రమానికి రాష్ట్ర పబ్లిక్‌వర్క్స్ శాఖామంత్రి శ్రీ అల్లూరి సత్యనారాయణరాజు జూలై 22 వ తేదీన సికింద్రాబాదులో ప్రారంభోత్సవం చేశారు.



ధైర్య సాహసాలకు బహుమతులు : స్వాతంత్ర్య దిన సందర్భాన ముఖ్య మంత్రి పతకములను బహూకరిస్తున్నారు : (కుడి నుండి యెడమకు)

(1) శ్రీ మదనాల వెంకయ్య, పోలీసు కానిస్టేబులు, సైఫాబాదు పోలీసు స్టేషను, డివిజన్–2, హైద్రాబాదు. (ధైర్య సాహసాలకు గాను పోలీసు పతకం)

(2) శ్రీ పల్లపు వెంకటేశ్వర్లు, పోలీసు కానిస్టేబులు, ఐనవోలు పోలీసు స్టేషను, వినుకొండ సర్కిల్, గుంటూరు జిల్లా. (అదే పతకం)

(3) శ్రీ నర్సింగు పర్షాదు, ఐ.పి.ఎస్., రిటైర్డు పోలీసు సూపరింటెండెంటు, ప్రభుత్వ రైల్వే పోలీసు, సికింద్రాబాదు: విశిష్టమైన సేవకు గాను రాష్ట్రపతి బహూకరించిన పోలీసు, అగ్నిమాపకదళ పతకం

(4) శ్రీ కల్కాపర్షాదు, పోలీసు డిప్యూటీ సూపరింటెండెంటు, అవినీతి నిరోధక శాఖ, హైద్రాబాదు, (ప్రశంసనీయమైన సేవకు గాను పోలీసు పతకం)

(5) షేక్ అబ్దుల్‌నబి, పోలీసు డిప్యూటీ సూపరింటెండెంటు, క్రైం బ్రాంచి, సి.ఐ.డి., హైదరాబాదు. (అదే పతకం)

(6) శ్రీ ఇ. గోవిందరాజులు, పోలీసు ఇనస్పెక్టరు, స్పెషల్ బ్రాంచి, సి.ఐ.డి., హైదరాబాదు. (అదే పతకం)

# ఆర్థిక సంఘం-ఆంధ్రప్రదేశ్

భారత రాష్ట్రపతి, మన రాజ్యాంగంలోని 280 (1) వ సూత్రాన్ని అనుసరించి, మధ్య మధ్య నిర్ణీత గడువు తరువాత పన్నుల ద్వారా లభించే నికరాదాయాన్ని కేంద్రం, రాష్ట్రాల మధ్య పంపిణీ చేసే విషయంలోనూ, రాష్ట్రాలకు లభింప జేసే సహాయక గ్రాంటులకు వర్తించే నిబంధనల విషయంలోనూ తగుసిఫార్సులు చేసే నిమిత్తం ఆర్థిక సంఘాన్ని నియమించ వచ్చును. ఈ సంఘం చేసే సిఫార్సులనూ, వీటిపై గైకొనబడే చర్యలకు సంబంధించిన మెమొరాండంను పార్లమెంటుకు సమర్పించ వలసి వుంటుంది.

1951 నవంబరులో శ్రీ కె సి. నియోగి అధ్యక్షతన మొదటి ఆర్థిక సంఘం నియమించ బడింది. శ్రీ వి. పి. మీనన్, జస్టిస్ కొనలేంద్రరావు, డా. బి. కె. మదన్, శ్రీ ఎం వి. రంగాచారి ఈ సంఘం సభ్యులుగా పని చేశారు. 1952 ఫిబ్రవరిలో శ్రీ వి. పి. మీనన్ తన సభ్యత్వానికి రాజీనామా ఇచ్చినందువల్ల శ్రీ వి. ఎల్. మల్‌హోత్రాను ఆయన స్థానంలో సభ్యుడుగా రాష్ట్రపతి నియమించారు.

1952 వ సం. లో సమర్పించిన తన నివేదికలో ఈ సంఘం దిగువ సిఫార్సులు చేసింది :—

(1) రాబడి పన్నుద్వారా లభించే దానిలో నూటికి 55 వంతుల ఆదాయాన్ని రాష్ట్రాలకు పంపిణీచేయాలి. నూటికి 80 వంతుల ఆదాయాన్ని రాష్ట్రాల జనాభాను బట్టి, మిగతా 20 వంతుల ఆదాయాన్ని ఆయా రాష్ట్రాలలో వసూలవుతున్న మొత్తాలను బట్టి పంచాలి.

(2) పొగాకు, అగ్గిపెట్టెలు, కూరగాయల ఉత్పత్తుల వల్ల లభించే ఎక్సైజు సుంకాలలో 40 శాతాన్ని రాష్ట్రాలకు వాటి వాటి జనాభానుబట్టి పంపిణీ చేయాలి.

## రెండవ ఆర్థిక సంఘం నివేదిక

శ్రీ కె. సంతానం అధ్యక్షతన 1956 జూన్‌లో రెండవ ఆర్థిక సంఘం నియమించ బడినది. పంజాబ్ మాజీ ఆర్థిక మంత్రి శ్రీ ఉజ్జల్ సింగ్, హైద్రాబాదు హైకోర్టు రిటైర్డు చీఫ్‌జడ్జి శ్రీ ఎల్. ఎస్. మిశ్రా, ఢిల్లీ స్కూల్ ఆఫ్ ఎకనమిక్స్ ప్రొఫెసర్ డా. బి. ఎన్. గంగూలీ గారలు ఈ సంఘం సభ్యులుగా నియమించ బడ్డారు.

1957 సెప్టెంబరులో ఈ సంఘం తన నివేదిక సమర్పించింది. రాబడి పన్నులద్వారా లభించే నికరాదాయంలో రాష్ట్రాలకు లభింపజేసే వాటాను 55 శాతం నుంచి 60 శాతంకు పెంచాలని ఈ సంఘం సిఫార్సు చేసింది. 90 శాతం ఆదాయాన్ని రాష్ట్రాల జనాభాను బట్టి, 10 శాతం ఆదాయాన్ని ఆయా రాష్ట్రాలలో లభిస్తున్న పన్నులను బట్టి పంపిణీచేయాలని ఇది సిఫార్సు చేసింది. వివిధ రాష్ట్రాలకు వాటి వాటి వసూళ్ల ననుసరించి పన్నుల ఆదాయాన్ని పంచే పద్ధతికి క్రమంగా స్వస్తి చెప్పాలని కూడా ఈ సంఘం సూచించింది. పొగాకు, అగ్గిపెట్టెలు, కూరగాయల ఉత్పత్తులే గాకుండా, చక్కెర, టీ, కాఫీ, కాగితం పై విధించే సుంకాల ద్వారా వచ్చేఆదాయాన్ని కూడా రాష్ట్రాల మధ్య పంచాలని ఇది సిఫార్సు చేసింది. అయితే ఈ ఆదాయంలో 25 వ శాతాన్ని మాత్రమే రాష్ట్రాలకు లభింపజేయాలని ఇది అభిప్రాయ పడింది. ఆదాయంలో 90 శాతం వరకు వివిధ రాష్ట్రాలకు జనాభా ప్రాతిపదికపై పంపిణీ చేయడమైనది. మిగతా 10 వ శాతం రాబడి తక్కువ ప్రయోజనంపొందిన రాష్ట్రాలకు సర్దుబాటు చేసే నిమిత్తం ప్రత్యేకించ బడినది. మిల్లు వస్త్రాలు, చక్కెర, పొగాకుపై అదనంగా విధించిన ఎక్సైజు సుంకాల మూలంగా లభించిన ఆదాయంలోనుంచి ఆంధ్ర ప్రదేశ్ కు ఏటా రూ. 235 లక్షలు కేటాయించడానికి సంఘం సిఫార్సు చేసింది. రాష్ట్రాల మధ్య రైలు ఛార్జీ పన్ను పంపిణీకి సంబంధించి, ఈ సంఘం, ప్రతి మండలంలోనూ లభించే ఆదాయం, ఆయా మండలాలలోని రూట్ మైలేజి మొదలైన విషయాలను పరిగణలోకి తీసుకొని నూటికి కొంత చొప్పున ఈ మొత్తాలను రాష్ట్రాల మధ్య పంచాలని సూచించింది. ఆంధ్రప్రదేశ్‌కు 8.86 శాతం వాటా నిర్ణయించబడినది మన రాష్ట్రానికి 1957_58 సంవత్సరం నుంచి 1961_62 వ సంవత్సరం వరకు

ఏటా రూ. 4 కోట్ల చొప్పున సహాయక గ్రాంటు ఇవ్వ డానికి సంఘం సిఫార్సు చేసింది. కరువు, కాటకాలు, వరదలు మొదలైన విపత్కర పరిస్థితులలో సహాయపడ డానికి ఉద్దేశించబడి జాతీయ నిధికి ఈ మొత్తంలోనుంచి ప్రతి సంవత్సరం రూ. 75 లక్షలను విరాళంగా ఇవ్వవలసి ఉంటుంది.

## మూడవ ఆర్థిక సంఘం

మూడవ ఆర్థిక సంఘాన్ని రాష్ట్రపతి 1960 డిశెంబరు 2వ తేదీన నియమించారు. డిశెంబరు 15 వ తేదీనుంచి ఇది పని ఆరంభించింది. మాజీ కంట్రోలర్, భారత ఆడిటర్ జనరల్ శ్రీ ఎ. కె. చాందా సంఘం అధ్యక్షుడుగానూ, జస్టిస్‌రాయ్, పి. గోవిందమీనన్, ఎం. వి. మాథుర్, జి. ఆర్. కామత్ గారలు సభ్యులుగా నియమించ బడినారు. పైన పేర్కొన్న అంశాలతో పాటు, దిగువ తెలిపిన విషయములపై కూడా తనకు సిఫార్సులు చేయడానికై రాష్ట్రపతి ఈ సంఘాన్ని కోరారు :—

(1) తృతీయ ప్రణాళిక అవసరాల దృష్ట్యా, సహాయం అవసరమైన రాష్ట్రాలకు 275 వ సూత్రం క్రింద సహాయక గ్రాంటులద్వారా చేయదగిన సహాయం. ఈ రాష్ట్రాలు తమకు అందు బాటులో నున్న వనరుల వల్ల అదనంగా ఆదాయం పొందడానికి చేయవలసిన కృషి.

(2) ఏదైనా ఆర్థిక సంవత్సరంలో వ్యవసాయభూముల మినహా ఇతర ఆస్తులపై విధించే ఎస్టేటు డ్యూటీ మూలంగా లభించే నికరాదాయాన్ని 269 వ సూత్రం క్రింద రాష్ట్రాల మధ్య పంపిణీ చేసే విషయంలో వర్తించే నిబంధనలలో అవసరమైతే మార్పులు.

(3) ఏదైనా ఆర్థిక సంవత్సరంలో, రైలు చార్జీలపై విధించెడి పన్నులద్వారా లభించే నికరాదాయాన్ని 269 వ సూత్రం క్రింద రాష్ట్రాల మధ్య పంపిణీ చేసే విషయంలో వర్తించే నిబంధనలలో అవసరమైతే మార్పులు.

(4) ఏదైనా ఆర్థిక సంవత్సరంలో (అ) నూలు వస్త్రాలు, (ఆ) రేయాన్ లేదా కృత్రిమ సిల్కు, (ఇ) ఉన్ని వస్త్రాలు, (ఈ) చక్కెర, (ఉ) పొగాకుపై విధించెడి అదనపు ఎక్సైజు పన్నులద్వారా లభించే నికరాదాయాన్ని పంచడానికి వర్తింపజేసే నిబంధనలలో అవసరమైతే మార్పులు.

## రాష్ట్ర ప్రభుత్వ మెమొరాండం

మూడవ ఆర్థిక సంఘం రాష్ట్ర రాజధానిలో 1961 ఆగస్టు 7 వ తేదీ నుంచి 11 వ తేదీ వరకు గడిపింది. రాష్ట్ర ప్రభుత్వం ఈ సంఘానికి సమర్పించిన మెమొరాండంలో రాష్ట్రం ఎదు ర్కొంటున్న ప్రత్యేక సమస్యలను గురించి అవసరాలను గురించి తెలపబడింది. రాష్ట్ర శాసనసభ, శాసనమండలిలో కూడా దీన్ని ప్రవేశపెట్టడమైనది.

అఖిల భారత తలసరి సగటు ఆదాయం రూ. 265 లు కాగా ఆంధ్రప్రదేశ్‌లో ప్రస్తుతం ఇది రూ. 231 లు మాత్రమేనని ఈ మెమొరాండంలో తెలపబడినది.

1965-66 వ సంవత్సరం నాటికి అఖిల భారత ప్రమాణం రూ. 311 లకు పెరుగుతుందనీ, అప్పటికి రాష్ట్ర ప్రమాణం బహుశా రూ. 258 లకు పెరగవచ్చుని ఆశించబడుతున్నది. రాష్ట్ర ప్రమాణం తక్కువగా వుండడానికి తెలంగాణా, రాయల సీమ ప్రాంతాలు వెనుకబడి వుండటమే కారణం. ఈ రెండు ప్రాంతాలలోనూ ఇతర ప్రాంతాలతో సమానంగా అభివృద్ధిని సాధించడానికి కనీసం రూ 75 కోట్లు ఖర్చుపెట్టవలసి వుంటుంది. అని మెమొరాండంలో వివరించబడినది.

తక్కువ జీతాలు పొందే ఉద్యోగుల వేతనాలను పెంచ డానికి అయ్యే అదనపు వ్యయాన్ని భరించడానికి వీలుగా తృతీయ ప్రణాళికా కాలంలో కూడా సహాయాన్ని కొనసాగించవలసిందిగా కేంద్ర ప్రభుత్వాన్ని అభ్యర్థించడమైనది. ఈ పద్దు క్రింద కేంద్రం 1961 వ సం. నుంచి 1966 వ సం. వరకు రూ. 10 కోట్లు కేటాయించవలసివుంది. గ్రామాధికార్ల వేతనాలను కూడా సవరించ వలసి వుంది. ముఖ్యంగా వారికి గల వంశ పారంపర్యపు హక్కులు కోల్పోయే ఫలితంగా ఈ అవసరం అధికంగా వుంది. గ్రామాధి కార్ల కోర్కెలను సమ్మతించి వారి వేతనాలను లోయర్ డివిజన్ గుమాస్తాల వేతనాలకు సమానంగా హెచ్చించినట్లయితే ఏటా రూ 2½ కోట్ల వ్యయం పెరుగుతుంది

క్షామ నివారణ నిధి, జమీందార్లకు నష్టపరిహారం, రోడ్ల నిర్వహణ, జిల్లాపరిషత్తులకు గ్రాంటులకు సంబంధించి రాష్ట్ర ప్రభుత్వానికి గల ఇబ్బందుల విషయమై కూడా ఆ మెమొరాం డంలో ప్రస్తావించడం జరిగింది.

1961 వ సంవత్సరం నుంచి 1966 వ సంవత్సరం వరకు

ఈ క్రింద పేర్కొన్న అంశాల విషయంలో రాష్ట్రానికి అదనంగా రూ. 60 కోట్లు కావల్సి వుంటుందని కూడా మెమొరాండంలో తెలపబడినది. మూడవ ప్రణాళిక ఆదాయ వనరులలో లోటు (ప్రస్తుతం గల ఆదాయవనరులకూ, ఖర్చుచేయ నుద్దేశించిన మొత్తానికి మధ్య గల వ్యత్యాసం) రూ. 26 కోట్లు; నాగార్జున సాగర్ ప్రాజెక్టు నిర్మాణానికి తీసుకున్న ఋణాలపై 1960-61 వరకు అయ్యే వడ్డీ రు 7 8 కోట్లు; జిల్లాపరిషత్తులు, పంచాయతీ సమితులు మొదలైన వాటికి అధనపు గ్రాంట్లు రు 6 కోట్లు ప్రభుత్వోద్యోగుల వేతనాల పెంపుదలకు, పెన్షన్లకు రూ. 13 25 కోట్లు. రోడ్ల నిర్వహణకు రూ. 6 కోట్లు.

మూడవ ప్రణాళికలో తలపెట్టిన వ్యయానికీ, ఈ కాలంలో లభించగల ఆదాయానికి మధ్య నున్న వ్యత్యాసం పన్నులను పెంచినప్పటికి కూడా సుమారు రూ 60 కోట్లు వుంటుందని రాష్ట్ర ప్రభుత్వం మెమొరాండంలో వెల్లడించింది

ఈ తేడాను కొంతలో కొంతవరకైనా పూరించడానికి రాష్ట్ర ప్రభుత్వం అనేక ప్రతిపాదనలు చేసింది కేంద్రం విధించెడి పన్నుల ద్వారా వచ్చే నికరాదాయాన్ని పూర్తిగా జనాభా ప్రాతిపదికపై రాష్ట్రాలకు పంపిణీ చేయాలనీ, యూనియన్ ఎక్సైజు పన్ను విధించబడే వస్తువుల జాబితాలో సాధ్యమైనన్ని ఎక్కువ పదార్థాలను చేర్చాలనీ, విభజించదగిన ఆదాయాన్ని పూర్తిగా జనాభాను బట్టి రాష్ట్రాలకు పంచాలనీ, రైలు ఛార్జీలపై విధించెడి పన్నులలో రాష్ట్రాలకు న్యాయసమ్మతంగా రావల్సిన వాటాను ఇవ్వాలనీ ప్రస్తుతం లభింపజేస్తున్న రూ. 4 కోట్ల గ్రాంటును కొనసాగించడంతో పాటు కనీసం రూ. 6 కోట్లు మేరకు అదనంగా సహాయక గ్రాంట్లు మంజూరు చేయాలని రాష్ట్రం సూచనలు చేసింది.

నాగార్జునసాగర్ ప్రాజెక్టు ప్రాముఖ్యతనూ దాని నిర్మాణం నిర్విఘ్నంగా కొనసాగవలసిన అవశ్యకతను ప్రత్యక్షంగా తెలుసుకొనే నిమిత్తం ఈ ప్రాజెక్టును సందర్శించవలసిందిగా రాష్ట్ర ప్రభుత్వం సంఘాన్ని అభ్యర్థించింది.

మన రాష్ట్రం అవసరాలనూ, గ్రాంటుల రూపంలో మనకు కేంద్రం నుంచి ఇతోధికంగా ఆర్థిక సహాయం లభించవలసిన అవశ్యకతను గమనించి చాందా సంఘం తన సిఫార్సులు చేయగలదని ప్రభుత్వం ఆశిస్తున్నది.

---

## నవంబరు ప్రత్యేక సంచిక

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పడి ఈ అక్టోబరు ఆఖరుకు ఐదేండ్లు నిండుతవి. ఈ సందర్భంలో "ఆంధ్రప్రదేశ్" నవంబరు 1961 సంచిక ప్రత్యేక జన్మదిన సంచికగా వెలువడుతుంది. ఈ సంచికలో ప్రకటనార్థం ప్రత్యేకంగా సాహిత్య, చారిత్రక వ్యాసాలు, కవిత, హాస్యరచనలు మొదలైనవి 4-10-61 లోపుగా అందేటట్లు ఆంధ్రప్రదేశ్ నవంబరు సంచికలో ప్రకటనార్థమని వ్రాసి పంపవలెను. ఈ రచనలు ఆంధ్ర సంస్కృతికి సంబంధించినవై ఉత్తమ స్థాయిలో ఉండవలెను.

ఏజంట్లు తమకు అదనంగా కావలసిన కాపీలను గూర్చి 10-10-61 లోగా తెలియజేయవలెను.

—డైరెక్టరు, సమాచార పౌర సంబంధముల శాఖ.

# పారిశ్రామిక విశేషాలు

జూలై 1961

(రాష్ట్ర పారిశ్రామిక రంగంలో అనుదినం అభివృద్ధి పథకాలు ప్రవేశపెట్టబడుతున్నాయి. వాటిని గురించి తెలుసుకోవడం పారిశ్రామిక వేత్తలకూ, ప్రజలకూ ముఖ్యం. కాబట్టి ముఖ్య పారిశ్రామిక విశేషాలు యీ శీర్షిక క్రింద యివ్వబడుతున్నవి)

## కేంద్ర ప్రభుత్వ పరిశ్రమలు

హైదరాబాదులో సింథటిక్ మందుల ఫ్యాక్టరీని స్థాపించే విషయంలో అవసరమైన ఏర్పాట్లు జరుగుతున్నాయి. భారీ విద్యుత్పరికాల ఫ్యాక్టరీ సున్నితమైన పరికరాలను ఉత్పత్తి చేసేఫ్యాక్టరీలను ఎక్కడ నెలకొల్పాలన్న విషయాన్ని భారత ప్రభుత్వం పరిశీలిస్తున్నది.

## ప్రైవేటు రంగం

ఆంధ్రప్రదేశ్‌లో దుక్క ఇనుము కర్మాగారాన్ని స్థాపించడానికి ప్రైవేటు సంస్థల నుంచి వచ్చిన దరఖాస్తులను ఇండియా ప్రభుత్వం పరిశీలిస్తున్నది. బోధన్‌లో కాగితం ఫ్యాక్టరీని నెలకొల్పడానికి కూడా దరఖాస్తులు కోరడమైనది చక్కెర ఫ్యాక్టరీలో నిరుపయోగంగా మిగిలిపోయే పదార్థాలతో ఈ ఫ్యాక్టరీలో కాగితం ఉత్పత్తి చేయడానికి తలపెట్టబడినది.

ట్రాన్స్‌ఫార్మర్లు, స్విచ్‌గేర్లు, సర్క్యూట్ బ్రేకర్లు, ఫుడ్ యీస్ట్, ఎండ్రిన్ క్లోరిడన్ హెప్టాక్లర్, సెల్యూలస్ అసిటేట్, ఫ్లేకులు మొదలైన పరికరాలను ఉత్పత్తి చేయడానికి ఆయా సంస్థలకు లైసెన్సులు మంజూరు చేయబడినవి. సెల్యూలస్ ఆసిటేట్ ఫ్లేకులను తయారు చేసే సంస్థ తణుకులో నెలకొల్పబడుతుంది. ఈ పరికిరాలను ఉత్పత్తి చేసే మరొక సంస్థ విశాఖపట్నంలో కూడా స్థాపించబడుతుంది.

## నిజాం చక్కెర ఫ్యాక్టరీ

నిజాం చక్కెర ఫ్యాక్టరీని విస్తృతపరిచే పని శీఘ్రగతిని కొనసాగుతున్నది. చక్కెర పరిశ్రమ వేతనాల బోర్డు సూచించిన కొత్త వేతనాలను అమలు పరిచిన ఫలితంగా ఫ్యాక్టరీ అభివృద్ధికి తలపెట్టిన పథకాలను పునః పరిశీలించడం జరుగుతున్నది.

వరంగల్‌లోని ఆజంజాహీ మిల్లులలో హెచ్చుగా వున్న కార్మికుల విషయంలో మేనేజిమెంటుకూ, పనివారలకు మధ్య ఒప్పందం కుదిరిన తరువాత మిల్లుల అభివృద్ధి పథకాన్ని ప్రవేశపెట్టారు.

## సింగరేణి కాలరీస్

తాండూరు కాలరీలలో మందమరి వద్ద రూ. 50/- లక్షల బొగ్గు స్క్రీనింగ్ యంత్రం మొదటి సెక్షన్ను ప్రారంభించారు, ఇక్కడ రోజుకు 3000 టన్నుల బొగ్గు పని జరుగుతుంది. దీని నమూనాను సింగరేణి కంపెనీ లిమిటెడ్ వారు రూపొందించింది నెలకొల్పారు. ఇక్కడ నుంచి బెల్లంపల్లి రైలు స్టేషన్ వరకు అయిదు మైళ్ళ రైలు మార్గాన్ని కంపెనీ నిర్మించింది.

కాలరీలలో ఉత్పత్తి పెరుగుతూ వుంది. 1960 జూన్ నెలలో వీటిలో 1,90,660 టన్నుల బొగ్గు ఉత్పత్తి జరగ్గా 1961 జూన్‌లో 2,10,824 టన్నుల బొగ్గు ఉత్పత్తి అయింది,

## ఖనిజాల అభివృద్ధి, సర్వే

మహబూబ్‌నగరం జిల్లాలో సోమశిల ప్రాంతంలో ఆస్బెస్టాస్ లభించనున్నట్టు ఇటీవల కనుగొనబడింది. కడప ఆస్బెస్టాస్ గనులకు ఉత్తరాన ఈ ఖనిజం కనుగొనబడటం ఇదే ప్రథమం.

## లఘు పరిశ్రమలు, చేతి పరిశ్రమలు

చిత్తూరులో సహాయక ప్రైవేటు పారిశ్రామిక ఎస్టేటుకు

(మిగతా 59వ పేజీలో)

# ఆదర్శగ్రామం శాయంపేట

సామల వీరేశము

దశాబ్దము క్రితము మా గ్రామము :— నిజామ్ పరిపాలనానంతరము అప్పుడప్పుడే స్వాతంత్ర్య భానుడు తొంగి చూస్తున్న తొలి రోజులవి, మా జీవితంలో మొదటిసారిగా ఓటు నిచ్చి రాష్ట్రము, కేంద్రాలకు ప్రతినిధులను పంపుకొన్నాము. మరి కొద్ది రోజులకే ఓం ప్రథమంగా పంచాయతీ బోర్డు ఏర్పడింది మా శాయంపేట గ్రామంలో ( హన్మకొండ తాలూకా, వరంగల్లు జిల్లా).

అప్పుడు మా గ్రామంలో ముచ్చటగా ముగ్గురు అధ్యాపకులతో ఒక ప్రాథమిక పాఠశాల నడుస్తు ఉండేది, ప్రజోపయోగ సంస్థ అన్నది అదొక్కటి మినహా మరేదియు లేకుండినది, మేము మా పని, మాగ్రామము తప్ప విశాలదృక్పథంగాని, దేశీయ వ్యవహారాల పరిచయం గాని మా పరిసరాలలో తీవ్రంగా జరుగుతున్న పరిణామాల గుర్తించాలనే జిజ్ఞాస కాని, లేని కూపస్థమండూ లమప్పుడు స్వార్థమే కాని, సహకార మంటే తెలియదు, ప్రజా సమూహంలో గల శక్తిని గూర్చి అంచనా వేయగల పరిస్థితిలో కూడా ప్రజలు లేరు.

తొలి ప్రజాసంస్థ :— అట్టి సందర్భములో దాదాపు నూరు గ్రంథాలతో శ్రీ రవీంద్ర గ్రంథాలయము అను పేర ఒక గ్రంథాలయము వెలిసింది. అప్పటి తహశీలుదారు శ్రీ గురువా రెడ్డిగారు దానికి ప్రారంభోత్సవము గావించి యుండిరి, కాని పురిటిలోనే సంధి కొట్టింది, కార్య కర్తల అశ్రద్ధవలన గ్రంథాలయము త్వరలోనే మూతపడింది, తిరిగి 1953 లో పునరుద్ధరింప బడినాటినుండి దినదినాభి వృద్ధి గాంచుతు ప్రజల విజ్ఞాన వికాసానికి కృషి చేస్తున్నది.

మాధ్యమిక పాఠశాల :— పిదప స్థానిక అధ్యాపకులగు శ్రీ దేవెలపెల్లి సాంబశివరావు గారు మరియు శ్రీ మామిడి రమాకాంతము గారల కృషివలన మాధ్యమిక తరగతులు ప్రారంభమైనవి. అప్పటి జిల్లా కలెక్టరు శ్రీ టి. పి, ఆర్. మీనన్ గారు 1953 లో ఆరవ తరగతిని, మరుసటి సంవత్సము డిప్యూటి కలెక్టర్ గారు ఏడవ తరగతిని ప్రారంభించి యుండిరి. 1954 లో ప్రజల వద్ద విరాళం ప్రోగుచేసి ¼ కంట్రిబ్యూషన్‌తో ఐదు గదుల పాఠశాల భవనము నిర్మింప బడినది, అప్పటి P. W. D ఉపమంత్రియగు శ్రీ యం ఎస్ రాజలింగం గారిచే నూతన భవన ప్రారంభోత్సవము గావింపబడినది.

ఇదే సందర్భములో ఆయుర్వేద గ్రాంట్ ఐన్. యేడ్. దవాఖాన యొకటి ప్రభుత్వము వారిచే నెలకొల్ప బడినది. ప్రథమ పర్యాయంగా పంచాయతీ బోర్డు ఎన్నికలు జరిగినవి అంత వరకు స్తబ్ధంగా యున్న పంచాయతీ సంస్థ ప్రజాకార్య క్రమాలలో క్రమ క్రమంగా పాల్గొన సాగినది ఇది డెవలప్ మెంట్ బ్లాక్ ఏర్పడు నాటికి స్థూలంగా మా గ్రామ పరిస్థితి. అభివృద్ధి బ్లాక్ ప్రారంభము:

1958 లో అప్పటి రెవెన్యూ మంత్రియగు శ్రీ కొండా వెంకటరంగారెడ్డి గారిచే మా పర్కాల అభివృద్ధి బ్లాకు ప్రారంభించ బడినది, వారి హస్తముతో మా శాయంపేట గ్రామములో మరొక పాఠశాల భవనమునకు శంకుస్థాపన జరిగినది. ఒక కమ్యూనిటీ రేడియో ప్రారంభించ బడినది.

పంచాయతి సమితి: ఇంత వరకు మా గ్రామములో ఎప్పుడు ఏదో ఒక అభివృద్ధికరమైన కార్యక్రమము నిర్వర్తింపబడడంజరుగుతున్నప్పటికి అభివృద్ధి తాబేటి నడకలాగానే యున్నది. ప్రజలలో అభివృద్ధి కరమైన కార్య క్రమాల ఎడ జిజ్ఞాస అప్పుడప్పుడే మొలకెత్త నారంభించింది, ఇట్టి తరుణములో "కలయో వైష్ణవ

మాయమో" అన్నట్లు తర తరాలుగా ఎదురు చూస్తున్న, గాంధీజీ కలలుగన్న పంచాయతీ రాజ్యం 1959 లో మన ప్రధాని కర కమలాలతో దేశంలోకెల్ల ప్రథమంగా మన ఆంధ్ర ప్రదేశ్‌లో ప్రారంభించ బడింది. గ్రామాభి వృద్ధి యెడల ఆశక్తి అధిక మైంది. బ్లాకులో ప్రారంభింప బడే ప్రతి అభి వృద్ధి కార్య క్రమములో ముందంజ వేయడము నేర్చుకున్నారు. తమ గ్రామాన్ని ఆదర్శ గ్రామంగా రూపొందించుకొన్నారు. నేటిస్థితి :

పంచాయతీ రాజ్య ప్రారంభానంతరము జరిగిన అభివృద్ధి తో సహా స్థూలంగా మా గ్రామ పరిస్థితి ఈ విధంగా యున్నది.

తొమ్మిది రిజిష్టర్డు సంస్థలు : ప్రస్తుతము రిజిష్టర్ అయిన సంస్థలు ఐదు. త్వరలో రిజిష్టరు కానున్న సంస్థలు నాల్గు మొత్తము తొమ్మిది ప్రజా సంస్థలున్నవి. (1) కుటీర పరిశ్రమల అభివృద్ధి నిమిత్తమై 1959 లో దంపుడు బియ్యం పరిశ్రమ స్థాపించ బడినది. ప్రజలు పదకొండు వందల రూపాయలు డిపాజిట్ చెల్లించగా ప్రభుత్వమువారు పదహారు వందల రూపాయలు గ్రాంటు నొసంగినారు. తద్వారా నిరుద్యోగ సమస్యకు పరిష్కార మార్గము ఏర్పడుటతో పాటు ఆరోగ్య ప్రదాయకమగు బియ్యము మాగ్రామమునకే కాక పరిసర గ్రామములకు కూడా సరఫరా చేయబడుతున్నవి.

2. ఇంతవరకు పెదకొడెపాకలో యున్న చేనేత పారిశ్రామిక సహకార సంఘం ప్రభుత్వ ఆదేశం ప్రకారము రెండుగా విభజింప బడి మా శాయంపేట గ్రామములో ఒక నూతన సంఘం ఏర్పడినది. 600 మంది పారిశ్రామికులు రూ 1800 ల వాటా ధనముతోను, ప్రభుత్వము వారి గ్రాంటుతోను నిర్వహింప బడుతున్న ఈ సంస్థ అనేకమంది చేనేత పారిశ్రామికులకు పని కల్పించుచున్నది.

3. ఒక నవారు చేనేత సహకార సంఘం 1951 లో రిజిష్టరు అయి తిరిగి ఇటీవలనే పని ప్రారంభమయి కొంత మంది నవారు పారిశ్రామికులకు పని కల్పించు చున్నది.

4. '000 రూ. కార్మికుల వాటా ధనముతో ఒక చర్మ పారిశ్రామిక సహకార సంఘం ఇటీవలనే రిజిష్టర్ అయినది, సంస్థకై ప్రభుత్వ గ్రాంటుతో ఒక భవనము నిర్మింప బడుతున్నది భవన నిర్మాణానంతరము చర్మకారులకు అందులో పని లభిస్తుంది

5. 800 రూ. వాటా ధనముతో ఖాదీ స్పిన్నింగ్ అండ్ వీవింగ్ సహకార సంఘం రిజిస్ట్రేషన్ గావించబడినది. ప్రభుత్వ గ్రాంటుకై ప్రయత్నములు జరుగుతున్నవి. గ్రాంటు లభించ గానే కార్య క్రమ ఆరంభము కాగలదు.

6. కల్లు పారిశ్రామిక సహకార సంఘమునకై 2700 రూ. వాటా ధనము కేంద్ర సహకార బ్యాంకులో డిపాజిట్ చెల్లించి రిజిస్ట్రేషన్ నిమిత్తమై ప్రయత్నములు జరుగుతున్నవి.

7. సబ్బు పారిశ్రామిక సహకార సంఘ నిమిత్తమై 1100 రూ.ల వాటా ధనము చెల్లించ బడినది. త్వరలోనే రిజిస్ట్రేషన్ అగు అవకాశమున్నది.

8. కాగితపు పరిశ్రమకు వలయు వాటా ధనము చెల్లించుటకు సంసిద్ధతను తెలియజేస్తు అట్టి సంఘమును మా గ్రామములో స్థాపించుటకు అంగీకరించ వలసినదిగా పంచాయతి సమితిని కోరనైనది వారి అంగీకారము లభించిన వెంటనే అట్టి సంస్థను శీఘ్రగతితో స్థాపించు కొనుటకు ప్రజలువ్విళ్ళూరు చున్నారు.

9. 1951 లో నూరు పుస్తకములతో స్థాపించబడిన మా గ్రంథాలయము ప్రస్తుతము 1700 పుస్తకములతో విజ్ఞాన వికాసానికై కృషి చేయుచున్నది. రెండు దినపత్రికలు, రెండు వార పత్రికలు, ఐదు మాస పత్రికలు తెప్పించి పాఠకులకందింప బడుచున్నవి. గ్రంథాలయ పక్షమున చెల్లించిన 30 రూ. కలుపుకొని గాంధీ స్మారకనిధి వారు రూ. 120/-ల గ్రంథములు సరఫరా చేసినారు. ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘము వారు 1956 లో నిర్వహించిన గ్రంథాలయ శిక్షణ కళాశాలలో తెలంగాణలోకెల్ల ఏకైక ప్రతినిధిగా గ్రంథాలయ కార్యదర్శి యగు శ్రీ సామల ఉప్పలయ్యగారు శిక్షణ పొంది గ్రంథాలయ అభివృద్ధికై కృషి చేయుచున్నారు. 1957 లోను- 1959 లోను ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ సంఘ పాలకవర్గములో మా గ్రంథాలయానికి ప్రాతినిధ్యము లభించింది 1957 లో డైరెక్టర్ ఆఫ్ పబ్లిక్ ఇన్‌స్ట్రక్షన్ ద్వారా మా గ్రంథాలయముకు రికగ్నిషన్ లభించి ప్రభుత్వ పక్షమున లభించిన దాదాపు 1000 రూ గ్రాంటుతో పుస్తకాలు ఖరీదు చేయటం మరియు పత్రికల చందాలు చెల్లించడం జరిగింది. పంచాయతీ బోర్డువారొసంగిన 100 రూ. గ్రాంటుతో రెండు బీరువాలు చేయించ బడినవి. ఇంటింటా స్వంత గ్రంథాలయము ప్రణాళికలో చేరి రూ. 120/ల పుస్తకాలు ఖరీదు చేయడం జరిగింది. ముద్దునూరులో ఒక శాఖా గ్రంథాలయము ఏర్పాటుచబడినది. ఈ విధంగా లభించిన అవకాశాలన్నింటిని పూర్తిగా వినియోగించుకొని దినదినాభివృద్ధి గాంచుతు సమస్త ప్రజాంగాలలో ప్రజలకు సలహా

సహకారాల నందిస్తు విరాజిల్లుతున్న గ్రంథాలయ పక్షమున జాతీయ అంతర్జాతీయ పర్వదినముల, పర్వదినముల సందర్భమున అనేక ఉత్సవములు నిర్వర్తింపబడు చున్నవి. ఇటీవలనే శ్రీ రవీంద్రుని శతజయంత్యుత్సవములు బ్రహ్మాండముగా నిర్వహింపబడి వైజ్ఞానిక సాంస్కృతిక కార్య క్రమములు నిర్వర్తింపబడినవి. ఇది తాలూకాలో ఏకైక ప్రజా గ్రంథాలయము, జిల్లాలోని ప్రముఖ గ్రంథాలయాలలో నొకటి ఈ గ్రంథాలయ రిజిస్ట్రేషన్ నిమిత్తమై రెండేండ్ల నుండి ప్రయత్నములు జరుగుతున్నవి. త్వరలో రిజిస్ట్రేషన్ అగు అవ కాశములున్నవి.

పరకాల బ్లాకులో స్థాపింప నిర్ణయించిన ప్రాథమిక ఆరోగ్య కేంద్రమును మా గ్రామములో స్థాపించుటకై ప్రజల వద్ద నుండి 1/4 కంట్రిబ్యూషన్ చెల్లించుటకు అంగీకరిస్తు. దాదాపు 3000 రూ. ల విరాళములు ప్రోగు చేసి డిపాజిటు కట్టబడినది. అద్దె ఇం టిలో ప్రస్తుతము దవాఖానా నడుపబడుచున్నది. 1960 నవంబర్ నెలలో ఆర్థిక శాఖామాత్యులగు శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డిగారిచే భవన శంకుస్థాపన జరుపబడినది.

1955 లో ప్రారంభింపబడిన నూతన పాఠశాలా భవనము దినదినాభివృద్ధి గాంచుచున్న విద్యార్థి లోకమునకు చాలకుండుటచే నూతనముగా నాల్గు గదులు నిర్మింపబడినవి. శిథిలావస్థలో నున్న లోకల్‌ఫండ్ పాఠశాలా భవనము రిపేరింగు నిమిత్తమై బ్లాకు నుండి లభించిన రూ. లు 1200 లతో భవనము పునర్నిర్మించ బడినది. ప్రస్తుతము (500) విద్యార్థులు గల ఈ పాఠశాలలో 16 గురు అధ్యాపకులు పనిచేయుచున్నారు. త్వరలోనే మాధ్యమిక స్థాయిలో నున్న మా పాఠశాల ఉన్నత పాఠశాలగా రూపొం దించుటకు ప్రయత్నములు జరుగుచున్నవి.

## రోడ్ల నిర్మాణం

బ్లాకు పక్షము నుండి లభించిన గ్రాంటుతోను ప్రజా పక్ష మున చెల్లించిన 1/4 కంట్రిబ్యూషన్‌తో P.W.D. రోడ్డు నుండి మా గ్రామమునకు 11 ఫర్లాంగుల మొరము రోడ్డు వేయబడినది. జిల్లాపరిషత్తు సహకారముతో మా శివారుపల్లెయగు ఆరెపల్లి నుండి మా గ్రామమునకు మొరము రోడ్డు వేయబడుతు నిర్మాణము పూర్తి కావస్తున్నది. పశు వైద్యశాల ప్రస్తుతము అద్దె ఇంటిలో నడుపబడుతున్నది. వైద్యశాలా భవన నిర్మాణమునకై 1000 రూ. డిపాజిటు పంచాయతీ బోర్డు నుండి చెల్లించుటకు నిర్ణయించ బడినది. సమితి ప్రోత్సాహముతో ఒక యువజనక్లబ్ స్థాపించి యువజనులకు విజ్ఞాన వినోదాలు గూర్చుచున్నది.

మహిళామండలి:- 1958 లో ఒక మహిళామండలి స్థాపించబడినది. సమితి సహకారముతో ఒక కుట్టుమిషన్ ఖరీదు చేయబడి ఉత్సాహశీలురకు పనినేర్పుటకై ఒక మహిళ వేతనముపై ఏర్పాటు చేయబడి వివిధ తీరుల కుట్టు మరియు పోత పనుల నేర్పుచున్నది. 20 మంది మహిళలకు విద్య గరుపబడి మండలి పక్షమున జాతీయ పర్వదినములు జరుపబడుచున్నవి. ప్రతి సంవ త్సరము కార్యవర్గ ఎన్నికలు జరుపబడును మండలికి ఎక్కువ సంఖ్యలో సభ్యులను తయారు చేస్తు బ్లాకులో ఆదర్శ మహిళా మండలిగా ఎన్నుకోబడినది. 19-7-61 రోజున అఖిల భారత మహిళా సంక్షేమ శాఖ డిప్యూటీ డైరెక్టర్ శ్రీమతి సౌందరం ఆంధ్రప్రదేశ్ మహిళా సంక్షేమ శాఖా డైరెక్టర్ కుమారి శకుంతలా దేవిగారలు మా బ్లాకుకు విచ్చేసి పర్కాల మహిళా మండలిని దర్శించిన పిదప మాశాయంపేట మహిళా మండలికి వచ్చినారు. వారికి మండలి పక్షమున నివేదిక అర్పించబడినది. తదనంతరము శ్రీమతి సౌందరంగారు ప్రసంగించారు.

సమితి ప్రగతి పంచాయతీసమితి పరకాల బ్లాకులో 99000 జనాభా గల 67 గ్రామాలున్నవి. 10 గ్రామ పరకాలుగా విభజింప బడినవి. బ్లాకు ప్రాంతము 1,49,623 ఎకరాల విస్తీర్ణం గలిగి యున్నది. ఈ ప్రాంతములో అన్ని రకాల పాఠశాలలు 89, ఇటీ వలనే నిర్బంధ విద్యావిధానము అమలు జరుపబడినది కావున ఇంకా కొన్ని పాఠశాలలు పెంచబడవచ్చు. పాత పంచాయతీలు 15, కొత్త పంచాయతీలు, 27. ఒక పురపాలక సంఘమున్నది, ఈ పంచాయతీ సమితికి అధ్యక్షులు శ్రీ పింగిలి ధర్మారెడ్డిగారు ఉపాధ్యక్షులు శ్రీ కె. శ్రీనివాస్‌రెడ్డి మొత్తము సభ్యులు 59 మందిలో 42 మంది సర్పంచులు, ఒకరు పురపాలక సంఘ ప్రతినిధి 6 గురు కోఆప్టు సభ్యులు స్థానిక సంఘాలకు చేర్చుకోబడిన నాన్ మెంబర్సు 10, మరియు సమితి పక్షమున పరకాలకు సమీపమున దాదాపు లక్ష రూపాయలతో భవనములు నిర్మింపబడినవి, ఈ బ్లాకు ఏర్పడగానే వ్యవసాయాభివృద్ధికై కృషి ప్రారంభింపబడి రైతు లకు అప్పులిస్తు, ఎరువులను సప్లయి చేస్తు సాంస్కృతిక ప్రదర్శనలు, విద్యాభివృద్ధికై కృషి సల్పుతు ఆరోగ్య కేంద్రము లను, పరిశ్రమలను నెలకొల్పుతు ప్రజలకు పని కల్పించబడు చున్నది. శ్రీ పి ధర్మారెడ్డిగారి కృషి వలన సమితి ప్రగతి మార్గంలో పురోగమిస్తున్నది.

ఈ బ్లాకులో చలివాగు ప్రాజెక్టు నిర్మాణము 27 లక్షల రూ. లతో జరుపబడుతున్నది. అందుకు 17 లక్షల రూ.లు కేంద్రము మిగతా రాష్ట్ర ప్రభుత్వము భరించును దాదాపు 6 మాస ముల నుండి పని జరుగుతున్నది.

**

# గ్రామాలకు విద్యుచ్ఛక్తి

1961 జూన్‌లో తెలంగాణ ప్రాంతంలోని దిగువ గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరా చేశారు:

| క్రమం సంఖ్య | గ్రామం పేరు | తాలూకా | జిల్లా |
|---|---|---|---|
| 1 | గొల్లపల్లి. | పశ్చిమ హైద్రాబాదు | హైద్రాబాదు |
| 2 | మామిడిపల్లి | పశ్చిమ హైద్రాబాదు | హైద్రాబాదు |
| 3 | తొండపల్లి. | పశ్చిమ హైద్రాబాదు | హైద్రాబాదు |
| 4 | బొక్కనిగూడెం | తూర్పు హైద్రాబాదు | హైద్రాబాదు |
| 5 | చినగొల్లపల్లి | తూర్పు హైద్రాబాదు | హైద్రాబాదు |
| 6 | మల్లాపురం | తూర్పు హైద్రాబాదు | హైద్రాబాదు |
| 7 | దొడ్డి | మేడ్చెల్ | హైద్రాబాదు |
| 8 | బొబ్బిపేట | చేవెళ్ళ | హైద్రాబాదు |
| 9 | ఫతేపూరం | చేవెళ్ళ | హైద్రాబాదు |
| 10 | కమ్మెత | చేవెళ్ళ | హైద్రాబాదు |
| 11 | యెంకిపల్లి | చేవెళ్ళ | హైద్రాబాదు |
| 12 | కొండపాక | సిద్దిపేట | మెదకు |
| 13 | రామునిపట్ల | సిద్దిపేట | మెదకు |
| 14 | హైదార్‌బాదుగ్రామం | జహీరబాదు | మెదకు |
| 15 | రాజన్నపల్లి | జహీరబాదు | మెదకు |
| 16 | పెద్దాపురం | సంగారెడ్డి | మెదకు |
| 17 | కొత్తపల్లి | అందోలు | మెదకు |
| 18 | లక్ష్మీనగరం | అందోలు | మెదకు |
| 19 | పోలేపల్లి | నాగరకర్నూలు | మహబూబునగరం |
| 20 | లత్తపల్లి | నాగరకర్నూలు | మహబూబునగరం |
| 21 | దాసరపల్లి | ఆత్మకూరు | మహబూబునగరం |
| 22 | తిరుమల | ఆత్మకూరు | మహబూబునగరం |
| 23 | కొండూరు | షాదునగరం | మహబూబునగరం |
| 24 | యెలికట్ట | షాదునగరం | మహబూబునగరం |
| 25 | సురాజఖాన్ పేట | కొడంగల్ | మహబూబునగరం |
| 26 | దామెర | వరంగల్లు | వరంగల్లు |
| 27 | ఆరేపల్లి | వరంగల్లు | వరంగల్లు |
| 28 | ఆత్మకూరు | వరంగల్లు | వరంగల్లు |
| 29 | ఓరుకొండ | వరంగల్లు | వరంగల్లు |
| 30 | చింతఘాట్ | కరీంనగరం | కరీంనగరం |
| 31 | మాతే | జగిత్యాల | కరీంనగరం |

# పంచాయతీరాజ్య పురోగమనము

(పంచాయతీరాజ్యం ప్రవేశపెట్టబడిన తరువాత గ్రామస్థుల దృక్పథం పూర్తిగా మారిపోయింది. సమిష్టి కుటుంబాలతో కూడుకున్న గ్రామాల కూటమిగా భారతావని వర్ధిల్లాలని గాంధీజీ కన్నకలలు నేడు నిజమవుతున్నాయి. నవభారత నిర్మాణానికి ఎల్లెడలా కార్యదీక్ష కానవస్తున్నది. మారుమూల గ్రామాలలో సైతం ఎన్నో విశేషాలు జరుగుతున్నాయి, రాష్ట్రంలోని వివిధ బ్లాకులలో అలాంటి విశేషాలను గూర్చి తెలిపెడి వార్తలను ఈ శీర్షిక క్రింద ప్రచురిస్తున్నాము.)

## ప్రతి ఇంటా ఒక పెరటి తోట

గ్రామాలలో కూరగాయలు ఎక్కువగా పండుతున్నప్పటికీ అవి వాటికి దగ్గరలో వున్న పట్టణాలలోనే వినియోగమవుతాయన్న సంగతి అందరికీ తెలిసిందే. పట్టణ ప్రాంతాలకు సరఫరా చేసే నిమిత్తం వాటికి చుట్టుపట్ల వున్న గ్రామాలలో కూరగాయలు పండిస్తారు. కాని మహబూబ్‌నగరం జిల్లాలోని బిజనపల్లి బ్లాకు ప్రజలు అందుకు భిన్నమైనవారు. కూరగాయలకు గల ఆహార విలువ వారికిబాగా తెలుసు.కనుకనే ఆప్రాంతంలోప్రతి ఇంటిలోను ఒక పెరటి తోట మనకు దర్శన మిస్తుంది. అయితే కూరగాయలను విక్రయించే వారు కూడా అక్కడ కొంత మంది లేక పోలేదు. వారు తమ ఇంటి వాడకానికి పోను మిగిలిన వాటిని మాత్రమే అమ్ముతారు.

## ఒక రూపాయి పొదుపు ఉద్యమం

బాన్స్‌వాడ సమితి బ్లాకులో 1961. జూలై 1 వ తేదీనుంచి ఒక రూపాయి చొప్పున పొదుపు చేసే చిన్న మొత్తాల పొదుపు ఉద్యమాన్ని ప్రారంభించారు. ఈ ఉద్యమాన్ని విస్తృతంగా నిర్వహించే నిమిత్తం బ్లాకు సిబ్బంది, గ్రామసేవకులు, విస్తరణాధికార్లకు ఒక్కొక్కరికి నాలుగు మొదలు అయిదు గ్రామాల వరకు కేటాయించారు. ఉద్యమాన్ని ప్రారంభించిన రోజుననే రూ 1,300 లు వసూలయ్యాయి

## ప్రసూతి, శిశు సంక్షేమ కేంద్రం

వరంగల్లు జిల్లా కమలా పురం బ్లాకులోని మొగుళ్ళపల్లి గ్రామంలో ఇటీవల ప్రసూతి శిశు సంక్షేమ కేంద్రాన్ని తెరిచారు. కేంద్రానికి సిబ్బందికి అవసరమైన గృహవసతిని గ్రామస్తులు సమకూర్చి పెట్టారు

## యువజన క్లబ్బు

* శ్రీ కాకుళం జిల్లా పాలకొండ పంచాయతీ సమితిలోని రాజుపేట యువజనులు తమ గ్రామంలో వివిధ అభివృద్ధి కార్యక్రమాలను విజయవంతంగా నిర్వహించే నిమిత్తం ఒక క్లబ్బును స్థాపించు కున్నారు. రూ 1,000 ల వ్యయంతో క్లబ్బు భవనాన్ని నిర్మించారు,

## పాఠశాల భవనానికి ప్రజల విరాళము

మంగళగిరి పంచాయతీ సమితిలోని మెల్లంపూడి గ్రామంలో ఇటీవల రూ 27,000 ల ఖర్చుతో ఎలిమెంటరీ పాఠశాల భవనాన్ని నిర్మించారు. ఈ వ్యయంలో రూ 17,000 లను స్థానిక ప్రజలు విరాళంగా ఇచ్చారు జూలై 1వ తేదీన దీనికి ప్రారంభోత్సవం జరిగింది

## అధికాహారోత్పత్తి సాధనకు కృషి

కరీంనగర్ జిల్లా సర్మల్ బ్లాకు లోని మద్దికుంట గ్రామ ప్రజలు రసాయనిక ఎరువులు వాడటం ద్వారా ఆధునిక వ్యవసాయ పద్ధతులను అవలంబించడం ద్వారా అధికాహారోత్పత్తిని సాధించడానికి తీవ్రంగా కృషి చేస్తున్నారు. వారికి నీటి పారుదలసౌకర్యం కేవలం బావుల ద్వారానే లభిస్తున్నప్పటికీ ఆయిల్ ఇంజన్లను నెల

కొల్చి బావుల నుంచి ఇతోధికంగా ప్రయోజనం పొందడానికి వారు పూనుకున్నారు సాగుబడికి అయ్యే ఖర్చులో పెద్ద తేడా వున్నప్పటికి మానేరు నీటి పారుదల ప్రాజెక్టు క్రింద గల గ్రామస్తులలో సమానంగా ఉత్పత్తిని సాధించే స్థితిలో వీరు ఇప్పుడు వున్నారు. వీరు స్వయంగా ఒక పంచాయతీ గృహాన్ని కూడా నిర్మించుకున్నారు.

## శ్రమదానంతో రోడునిర్మాణం

కరీంనగర్ జిల్లా నర్మల్ బ్లాకులోని మల్లారెడ్డిపేట గ్రామస్థులు గ్రామీణప్రజల సమస్యలను పరిష్కరించడానికి సామూహిక కృషి ఎలా తోడ్పడ గలుగుతుందో నిరూపించారు. తమ గ్రామం నుంచి సిద్దీపేట, కామారెడ్డి ప. వ శాఖ రోడ్డు వరకు రెండున్నర మైళ్ళ పొడువున ఒక అప్రోచ్ రోడ్డును పూర్తిగా శ్రమదానంద్వారా వీరునిర్మించారు. లోగడ ఈ మార్గం చాలా యిరకాటంగా వుండేది ఈ పని విలువను రూ. 10 000 లకు అంచనా కట్టారు.

## నాలుగు సహకార సంఘాల స్థాపన

నెల్లూరు జిల్లా చేజర్లసమితిలో 1961 జూన్‌లో 92 మంది సభ్యులతోనూ, రూ. 2471 ల వాటా ధనంతోను కూడిన నాలుగు సహకార సంఘాలను స్థాపించారు. ఈ సంఘాలలో ఒకటి విద్యార్థుల కొరకు ఉద్దేశించబడినది. పుస్తకాలు మొదలైన వాటిని ఇది సరఫరా చేస్తుంది.

## మహిళా సహకారసంఘం

చిత్తూరు జిల్లా నగరిలో గత జూన్ నెలలో 20 మంది మహిళలు కుట్టుటాకుల సహకార సంఘాన్ని స్థాపించుకున్నారు. దీనివల్ల వారి కుటుంబాదాయం పెరగగలుగుతుంది.

## చిన్న మొత్తాల పొదుపు

తూర్పు గోదావరి జిల్లాలోని రంగం పేట సమితిలో 1961 మార్చి 16వ తేదినుంచి 31 వ తేదీవరకు చిన్న మొత్తాల పొదుపుపక్షాన్ని జరిపారు. సమితి అధ్యక్షుడు పంచాయతీ అధ్యక్షుడు తదితరలు పాదయాత్ర చేస్తూ చిన్న మొత్తాల పొదుపు పథకం ప్రాముఖ్యతను గురించి ప్రజలకు చెప్పారు. ఈ పక్షం రోజులలో రూ. 1,540 లు వసూలయ్యాయి. ఈ సమితి ప్రాంతంలో 1960-61 వ ఆర్థిక సంవత్సరం ఉత్తరార్థంలో చిన్న మొత్తాల పొదుపు పథకానికి రూ. 19,376 లు మొత్తం వసూలైంది.

## ఆయిల్ ఇంజన్ల కొనుగోలుకు ఋణాలు

విద్యుచ్ఛక్తి మోటార్లు, ఆయిల్ ఇంజన్లు కొనుక్కోవడానికీ, భూములను సేద్యయోగ్యం చేసుకోవడానికి గాను, కోటౌరట్ల భారీ సహకార పరపతి సంఘం, రైతులకు ఋణాల క్రింద రూ. 55,000 ల మేరకు మంజూరు చేసింది. దీని ఫలితంగా అదనంగా 148 ఎకరాలకు నీటి వరుదల సౌకర్యం లభిస్తుంది. 79 టన్నుల ధాన్యం అధికంగా పండుతుంది.

## పాఠశాలలకు 90 శాతం పిల్లల హాజరు

పెద్దాపురం పంచాయతీ సమితి గ్రామాలన్నింటిలోనూ గత జూన్ నెలలో నిర్బంధ ప్రాథమిక విద్యా వారోత్సవాలు జరిగాయి 6-11 సంవత్సరాల మధ్య వయస్సుగల పిల్లలందరినీ పాఠశాలల్లో చేర్చడానికి ఈ సందర్భంలో కృషి జరిగింది. ఇక్కడ ఈనాడు సుమారు 90 శాతం విద్యార్థులు పాఠశాలలకు వెళ్తున్నారు.

## హరిజనునిచే రూ. 50 ల విరాళం

హైద్రాబాదు జిల్లా మోమిన్ పేట బ్లాకులోని వీర్లపల్లి వాస్తవ్యుడైన జి గాలయ్య అనే ఒక బీద హరిజనుడు, తన గ్రామంలో ప్రాథమిక పాఠశాలకు ఒక పాకను నిర్మించే నిమిత్తం రూ. 50/- లు విరాళంగా ఇచ్చాడు.

## నెల్లూరు జిల్లాలో ప్రజా సహకారం

పొదలకూరు పంచాయతీ సమితిలో, 1961 జూన్ 30 వ తేదీతో అంతమైన మూడు నెలల్లో, సమాజాభివృద్ధి కార్య క్రమం క్రింద జరిగిన వివిధ కార్యకలాపాలకు రూ. 2,529 ల మేరకు ప్రజలనుండి విరాళాలు లభించాయి.

ఇందుకూరు పేట పంచాయతీ సమితిలోని పల్లిపాడు, ముదివర్తి పాలెం గ్రామాలలో 100 మంది ప్రజలు శ్రమదానంలో పాల్గొన్నారు. వీరు మూడు రోజుల పాటు పనిచేసి మూడు మైళ్ళ పొడవు గల నీటి పారుదల కాలువలు నిర్మించారు.

చినకట్టువపల్లిలో భారత్ సేవక్ సమాజ్ గ్రామీణ యువజన శిబిరానికి చెందిన 40 మంది శిక్షితులు, హరిజన వాడ లోని వీధులను చదును చేసి గ్రామంలోని సాముదాయిక కేంద్రానికి సున్నం వేశారు.

ఆత్మకూరు బ్లాకులో మాధ్యమిక పాఠశాలలను ప్రారంభించడానికి రూ. 11,000 ల మేరకు డిపోజిట్లుగా సేకరించారు.

దర్శి పంచాయతీ సమితిలో 1961 జూన్ నెలాఖరుతో అంతమైన మూడు మాసాల కాలంలో ప్రాథమిక ఆరోగ్య కేంద్రానికి రూ. 2,000 లు, గ్రంధాలయాలకు రూ. 500 ల వరకు ప్రజలనుంచి విరాళంగా లభించాయి.



## పారిశ్రామిక విశేషాలు

(52వ పేజీ తరువాయి)

రాష్ట్ర లఘు పరిశ్రమలు, ఎక్సైజు శాఖల మంత్రి శంకుస్థాపన చేశారు.

చేతి పరిశ్రమల పరిశోధన, నమూనాల తయారీ కేంద్రా న్నొకదాన్ని హైద్రాబాదులో తెరవడానికి, విజయనగరంలో దానికి ఒక శాఖను కూడా నెలకొల్పడానికి ప్రభుత్వం ఆమోదించింది. వినిమయదార్ల అభిరుచులకు అనుగుణంగా కొత్తకొత్త నమూనా లలో, పద్ధతులలో విరివిగా చేతి వస్తువులను తయారు చేయడంలో ఈ సంస్థ సహాయపడుతుంది. మన చేతి పరిశ్రమల వస్తువులకు విదేశాలలో మంచి గిరాకి వుంది కాబట్టి, అందువల్ల మనకు తగి నంతగా విదేశమారకం లభిస్తున్నది. కనుక ఈ సంస్థ సాపన అవసరమైంది.

సమాజాభివృద్ధి కమీషనర్ల సమావేశం సందర్భంలో హైద్రాబాదులోని ప్రభుత్వ చేతి పరిశ్రమల వస్తువులు, కుటీర పరిశ్రమల వస్తువుల విక్రయశాలలో పలురకాల వస్తువులను ప్రత్యేకంగా అలంకరించిన తీరు అనేక మంది ప్రతినిధులనూ, విదేశ యాత్రికులనూ, ప్రముఖులను అమితంగా ఆకర్షించింది.

మన రాష్ట్రంలో

# సాంకేతిక విద్యాభివృద్ధి

ప్రణాళికాబద్ధమైన అభివృద్ధి కృషి విజయానికి వస్తుసంపదతో పాటు మానవ శక్తిని కూడా సమర్థంగా వినియోగించుకొనడం అవసరమవుతుంది. సాంకేతిక నిపుణుల కొరత లేనప్పుడే మానవశక్తి సక్రమంగా వినియోగపడగలుగు తుంది. సాంకేతిక విద్యాభివృద్ధి ద్వారానే దేశావసరాలకు కావలసిన సాంకేతిక విషయజ్ఞులను సిద్ధం చేయడానికి వీలుంటుంది. సాంకేతిక విద్యారంగంలో మన రాష్ట్రంలోని ఉభయ ప్రాంతాలలో జరిగిన అభివృద్ధిని గురించి ఈ సందర్భంగా తెలుసుకొనడం భావ్యంగా ఉంటుంది. తెలంగాణా ప్రాంతంలో మొట్టమొదటి పారిశ్రామిక పాఠశాల 1890 వ సంవత్సరంలో తెరవబడింది. పాతిక సంవత్సరాల తరువాత 1915 వ సంవత్సరంలో ఇలాంటి పాఠశాలలను మరో ఆరింటిని తెరిచారు. 1922 వ సంవత్సరంలో ఉస్మానియా సెంట్రల్ టెక్నికల్ ఇనిస్టిట్యూట్ అనే కేంద్ర సాంకేతిక సంస్థను, కేవలం మింట్‌లో శిక్షణ పొందే అభ్యర్థుల ప్రయోజనార్థం నెలకొల్పారు ఇదే ప్రభుత్వ పాలిటెక్నిక్‌గా వ్యవహరించబడుతున్నది.

పూర్వ హైద్రాబాద్ రాష్ట్రంలో చాలాకాలం క్రిందటనే సాంకేతిక విద్యా రంగంలో గమనార్హమైన అభివృద్ధి సాధించబడింది. సర్ అక్బర్ హైదరీచే నియమించబడిన మెకంజీ కమిటీ అనేక ఇతర సిఫార్సులతో పాటు, మాధ్యమిక, ఉన్నత పాఠశాలల విద్యానంతరం విద్యార్థులకు వృత్తి పనులలోనూ, సాంకేతిక విద్యలోను శిక్షణకు అవకాశం కల్పించాలని సూచించింది. ఈ కమిటీ సిఫార్సులను పురస్కరించుకొని 1937 వ సంవత్సరం మే నెలలో సాంకేతికవృత్తి విద్యాశాఖను నెలకొల్పడం జరిగింది. సాంకేతిక విద్యా ప్రమాణాన్ని పెంపొందించడానికై ఎబ్బట్ నివేదికలోని సిఫార్సుల ప్రకారం ప్రభుత్వ సాంకేతిక కళాశాలలో మరికొన్ని కోర్సులను ప్రవేశపెట్టడం, బాలబాలికల కొరకు నాలుగు పోస్ట్ ప్రైమరీ పాఠశాలలను ప్రారంభించడం కూడా జరిగింది. 1922 వ సంవత్సరంలో 12 మంది సివిల్ ఇంజనీరింగ్ కోర్సు విద్యార్థులతో ఉస్మానియా విశ్వవిద్యాలయం ఇంజనీరింగ్ కళాశాల స్థాపించబడినది.

1946వ సంవత్సరంలో కాకినాడ, అనంతపురంలలో రెండు ఇంజనీరింగ్ కళాశాలలను ప్రారంభించారు. ఆంధ్ర ప్రాంతంలో సాంకేతిక విద్యాభివృద్ధి అప్పటి నుంచే ఆరంభమైంది. అదే సంవత్సరంలో కాకినాడ, ఉయ్యూరులలో రెండు పాలిటెక్నిక్‌లను కూడా తెరిచారు.

కాకినాడలోని ఆంధ్ర పాలిటెక్నిక్‌లో, సర్టిఫికెటు కోర్సు శిక్షణ నిమిత్తం పారిశ్రామిక విభాగాన్ని నెలకొల్పి దానిలో 9 రకాల పనులలో 120 మంది విద్యార్థులకు శిక్షణ ఇవ్వడానికి ఏర్పాట్లు చేశారు. రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో, రక్షణ శాఖోద్యోగులకు శిక్షణ ఇవ్వడానికి తెలంగాణాలో హైద్రాబాదులోనూ, ఆంధ్రలో మూడు ప్రదేశాలలోను పారిశ్రామిక శిక్షణ సంస్థలను తెరిచారు.

## ప్రణాళికాబద్ధమైన కృషి

అయితే రాష్ట్రంలో సాంకేతిక విద్యాభివృద్ధికి ప్రణాళికాబద్ధమైన కృషి మొదటి పంచవర్ష ప్రణాళిక క్రిందనే జరిగింది. ఈ ప్రణాళికా కాలంలో సాంకేతిక విద్యా సంస్థలను బాగా అభివృద్ధి పరచడం జరిగింది. ఈ కాలంలో కాకినాడ, అనంతపురంలోని ఇంజనీరింగ్ కళాశాలలను అభివృద్ధిపరచడంతో పాటు ఆంధ్ర విశ్వవిద్యాలయం ఆవరణలో కొత్తగా ఒక ఇంజనీరింగ్ కళాశాలను ప్రారంభించారు. 1955 వ సంవత్సరంలో తెరిచిన ఈ కళాశాలలో ప్రారంభంలో 100 మంది విద్యార్థులను చేర్చుకున్నారు. కాకినాడలోని ఆంధ్ర పాలిటెక్నిక్ భవనాలను

రూ. 14 లక్షల వ్యయంతో నిర్మించి, పాలీటెక్నిక్‌కు అవసరమైన వివిధ పరికరాల కొనుగోలుకు రూ. 38 లక్షలు ఖర్చు చేశారు. ప వ. శాఖకు అవసరమైన పర్యవేక్షణ సిబ్బంది కొరతను తీర్చే తలంపుతో కాకినాడ అనంతపురంలలోని ఇంజనీరింగ్ కళాశాలలో 2½ సంవత్సరాల స్వల్ప కాలిక డిప్లొమా కోర్సును రూ. 3 లక్షల వ్యయంతో ప్రవేశపెట్టారు.

మొదటి పంచవర్షప్రణాళిక చివరి సంవత్సరంలో వరంగల్లులో పాలీటెక్నిక్ స్థాపించబడటం, తెలంగాణాలో జరిగిన సాంకేతిక విద్యాభివృద్ధి కృషిలో ముఖ్యంగా పేర్కొనదగిన అంశం. 1947 వ సంవత్సరంలో సాంకేతిక, వృత్తి విద్యాశాఖకు ప్రత్యేకాధికారిని నియమించారు. రూ. 29.61 లక్షల ఖర్చుతో కూడిన 16 పథకాలను విజయవంతంగా అమలు జరిపారు.

## రెండవ ప్రణాళికా పథకాలు

1956 వ సంవత్సరంలో ఆంధ్రప్రదేశ్ అవతరణతో సాంకేతిక విద్యాభివృద్ధికి ఇతోధికంగా ప్రోత్సాహం లభించింది. రెండవ ప్రణాళికలో రూ. 324 లక్షల వ్యయంతో సమన్విత పథకాన్ని రూపొందించారు దీనిలో రూ. 254 లక్షలను ఆంధ్ర ప్రాంతానికి కేటాయించారు. ఆంధ్ర ప్రాంతంలో 1857-58 వ సంవత్సరంలో అయిదు కొత్త సంస్థలను తెరవడంతో పాటు విశాఖపట్నంలోని హిందుస్తాన్ నౌకానిర్మాణకేంద్రంలో నిపుణత గల పనివారలకు శిక్షణ ఇవ్వడానికి అప్రెంటీస్‌షిప్ పథకాన్ని కూడా ప్రారంభించి, 120 మంది అభ్యర్థులను చేర్చుకున్నారు. టెలీ కమ్యూనికేషన్స్‌లో డిగ్రీ కోర్సును కాకినాడలోని ఇంజనీరింగ్ కళాశాలలో 1958-59 వ సం. లోనూ, డిప్లొమా కోర్సును హైద్రాబాదులోని ప్రభుత్వ పాలీ టెక్నిక్‌లో 1957-58 వ సం. లోనుప్రవేశ పెట్టారు.

సాంకేతిక విద్యా విస్తరణ కార్య క్రమం క్రింద, ఎక్కువ సంఖ్యలో విద్యార్థులకు ప్రవేశం కల్పించే నిమిత్తం, హైద్రాబాదులోని ప్రభుత్వ పాలీ టెక్నిక్‌నూ, కాకినాడలోని ఆంధ్ర పాలీ టెక్నిక్‌నూ, విశాఖపట్నం పాలీటెక్నిక్‌ను కేంద్ర ప్రభుత్వం ఎన్నిక చేసింది వీటిలో అదనంగా 250 మందికి ప్రవేశం లభింపజేయడానికి కేంద్రం రూ. 21 లక్షల వ్యయం భరిస్తుంది. రెండవ ప్రణాళికా కాలంలో, గనుల సంస్థలలో పనిచేసే ఉద్యోగులకు శిక్షణ ఇవ్వడానికి గూడూరు, కొత్తగూడెంలలో రెండు మైనింగ్ ఇనిస్టిట్యూట్లను తెరిచారు. ఇవిగాక ఈ కాలంలో ప్రైవేటు సంస్థల ఆధ్వర్యం క్రింద రెండు పాలీటెక్నిక్‌లు కూడా తెరవబడ్డాయి.

## వృత్తి పనివారల శిక్షణ

వివిధ దశలలో సాంకేతిక విద్యాభివృద్ధిపై ప్రభుత్వానికి తను సూచనలు చేసే నిమిత్తం 1957 ఫిబ్రవరిలో సాంకేతిక విద్య రాష్ట్రబోర్డును నియమించారు. తరువాత. వృత్తి పనివారల శిక్షణ వృత్తి పనుల శిక్షితులపై ప్రభుత్వానికి సూచన లొసంగడానికి వృత్తి పనుల శిక్షణ రాష్ట్ర మండలిని కూడా నియమించారు. రెండవ ప్రణాళికా కాలంలో సాధించిన విజయాలలో, తిరుపతి శ్రీ వేంకటేశ్వ విశ్వవిద్యాలయావరణలో ఇంజనీరింగ్ కళాశాలను స్థాపించడం, వరంగల్‌లో కేంద్ర అధ్వర్యంలో ప్రాంతీయ ఇంజనీరింగ్ కళాశాలను తెరవడం, మరో మూడు పాలీటెక్నిక్‌లను ప్రారంభించడం ముఖ్యంగా పేర్కొనదగినవి ఈ సంస్థ లన్నింటికీ రూ. 150 లక్షలు కేటాయించారు.

రెండవ ప్రణాళికలో ప్రారంభించిన సంస్థలను సమగ్రంగా అభివృద్ధి పరచడంతో పాటు వివిధ నూత్న పథకాలను చేపట్టడానికి మూడవ పంచవర్ష ప్రణాళిక కార్యక్రమాల క్రింద తలపెట్ట బడింది. సాంకేతిక విద్యా వ్యాప్తికి రెండవ ప్రణాళికలో రూ. 262 లక్షలు కేటాయించ బడగా, మూడవ ప్రణాళికలో రూ. 303.25 లక్షలు కేటాయించబడినాయి. సివిల్, ఎలక్ట్రికల్, మెకానికల్ ఇంజనీరింగ్ విభాగాలతో ఒక పాలీ టెక్నిక్‌ను శ్రీ కాకుళంలో తెరవడానికి తలపెట్ట బడినది. ప్రైవేటు అధ్వర్యంలో, ఇంజనీరింగ్ డిగ్రీ కోర్సులో శిక్షణ ఇవ్వగల ఇంజనీరింగ్ కళాశాల స్థాపనను ప్రోత్సహించడానికి కూడా ఉద్దేశించ బడినది.

## బాలికల పాలీటెక్నికులు

సాంకేతిక విద్యా వ్యాప్తికై క్రొత్త సంస్థలను, క్రొత్త కోర్సులను ప్రవేశ పెట్టుటకు మూడవ ప్రణాళికలో ప్రాధాన్యం యివ్వబడింది. ... ... యింజనీరింగ్ డిప్లొమా కోర్సులుగల బాలికల పాలిటెక్నికులను స్థాపించ బడుతున్నాయి. డిప్లొమా పొందిన వారు పార్టుటైంగా యింజనీరింగ్ కోర్సును చదవడానికి వీలుగా క్రొత్త సంస్థలు నెలకొల్పే పథకాలను మూడవ ప్రణాళికలో చేర్చారు.

హైద్రాబాదులోని ప్రభుత్వ వాస్తు శాఖను, ప్రభుత్వ వాస్తు శాస్త్ర లలితకళ కళాశాలను అభివృద్ధి పరచి, వాటిని జాతీయ

డిప్లొమా స్థాయికి తెచ్చే పథకాలను మూడవ ప్రణాళికలో చేర్చారు. విజయవాడ, హైద్రాబాదులలో గల సంగీత పాఠశాలలకు, శాశ్వత భవనాలను, కావల్సిన పరికరాలను చేకూర్చే ప్రతిపాదనలు కూడా గలవు.

హైద్రాబాదులోని సంగీత నాట్య కళాశాలలో, సంగీతంలో డిగ్రీకోర్సును ప్రవేశ పెట్టే ప్రతిపాదన కూడా వున్నది.

ఆంధ్ర, ఉస్మానియా, శ్రీ వెంకటేశ్వర విశ్వ విద్యాలయాలో యింజనీరింగ్‌లో ఐదు సంవత్సరాల సమీకృత కోర్సులు ప్రవేశ పెట్టేందుకు కూడా అవకాశం కల్పించ బడింది,

## ఇతోధిక శిక్షణ సౌకర్యాలు

కేంద్ర కార్మిక మంత్రిత్వ శాఖకు సంబంధించిన పారిశ్రామిక శిక్షణ సంస్థలపై ఆంధ్ర ప్రదేశ్‌లో రాష్ట్ర సాంకేతిక విద్యాశాఖ అజమాయిషీ వహిస్తున్నది.

మూడవ ప్రణాళికా కాలంలో క్రొత్తగా 8 పారిశ్రామిక శిక్షణ సంస్థలను నెలకొల్పుతారు. ప్రస్తుతం పని చేస్తున్న వాటిలో 5 శిక్షణ సంస్థలను విస్తృత పరిచే ప్రతి పాదనలు కూడా కలవు.

వృత్తి పనివారల శిక్షణ పథకం క్రింద, 2600 మంది శిక్షితులకు యతోధికంగా శిక్షణ వసతులు కల్పిస్తారు. పరిశ్రమలో శిక్షణపొందే పథకం మరియు పారిశ్రామిక కార్మికులకు విద్యా సౌకర్యాలు కల్పించే పథకాలను కూడా మూడవ ప్రణాళికలో చేర్చారు.

కార్మిక మంత్రిత్వ శాఖ పథకాలకై మూడవ ప్రణాళికలో రు. 2 కోట్లు కేటాయించారు. రాష్ట్రంలో సాంకేతిక విద్యా వ్యాప్తికై అమలు పరిచే వివిధ పథకాల ఫలితంగా పెక్కు పారిశ్రామిక సంస్థలకు సుశిక్షితులైన, సమర్థులైన పనివారలు లభించడంలో ఇబ్బందులుండవని ఆశించవచ్చును.

మూడవ ప్రణాళిక ముగింపునాటికి ఆంధ్ర ప్రదేశ్‌లో వివిధ సాంకేతిక సంస్థలు దిగువ తెల్పిన విధంగా వుంటాయి.

| క్రమ సంఖ్య | వివిధ సంస్థలు | మొదటి ప్రణాళిక ఆఖరులో | | రెండవ ప్రణాళిక ఆఖరులో | | మూడవ ప్రణాళిక ఆఖరు నాటికి (తాత్కాలిక లక్ష్యాలు) | |
|---|---|---|---|---|---|---|---|
| | | సంస్థల సంఖ్య | వార్షిక ప్రవేశాలు | సంస్థల సంఖ్య | వార్షిక ప్రవేశాలు | సంస్థల సంఖ్య | వార్షిక ప్రవేశాలు |
| 1. | ఇంజనీరింగ్ కళాశాలలు | 4 | 390 | 6 | 1015 | 7* | 1135 |
| 2. | పాలీటెక్నిక్‌లు, గనుల సంస్థలు | 4 | 460 | 18 | 2450 | 19 | 2570 |
| 3. | పారిశ్రామిక శిక్షణసంస్థలు | 6 | 1112 | 9 | 3182 | 17 | 5782 |
| 4. | బాలికల పాలీటెక్నిక్‌లు | — | — | — | — | 4 | 360 |
| 5. | జూనియర్ సాంకేతిక పాఠశాలలు | — | — | 3 | 180 | 7 | 420 |

* ప్రైవేటు నిర్వహణలో ఒక ఇంజనీరింగ్ కళాశాలను నెలకొల్పడానికి తలపెట్టబడినది.

# ప్రగతి పథంలో

(జిల్లాల నుంచి అందిన వివిధ అభివృద్ధి కార్యక్రమాలను గూర్చిన సంక్షిప్త వార్తలు)

## ఆదిలాబాదు

### రోడ్లకు గ్రాంటు మంజూరీ

ప్రస్తుతం జిల్లా పరిషత్తు, పంచాయతీ సమితుల అధీనంలో నున్న పూర్వపు జిల్లాబోర్డు రోడ్ల నిర్వహణకుగాను జిల్లాపరిషత్తు ఒకటవ స్థాయీసంఘం 1961 జూలైలో రూ. 55 555ల గ్రాంటును మంజూరు చేసింది.

## అనంతపురం

### రైతులకు ఋణాలు

భైరవాని తిప్ప ప్రాజెక్టు, ఎగువపెన్నారు ప్రాజెక్టులకు సంబంధించిన సహకార సంఘాలు రైతులకురు. 2½ లక్షలమేరకు ఋణాలు పంపిణీచేసాయి.

### కందుకూరు సహకార సమిష్టి వ్యవసాయ సంఘం

పూర్తిగా హరిజన సభ్యులతో కూడుకున్న కందుకూరు సహకార సమిష్టి వ్యవసాయ సంఘం 115 ఎకరాల మెట్టభూమిని సాగుక్రిందికి తెచ్చింది. 5ఎకరాలను తరీక్రింద మార్చింది. ఈ జిల్లా అంతటిలోకీ ఇటువంటి సంఘం ఇదొక్కటే. వీరు ఆహార ధాన్యాలనూ కూరగాయలను కూడా పండించారు. త్వరలోనే వీరు మరో 103 ఎకరాల భూమిని సేద్యంచేయనున్నారు.

### భూముల కేటాయింపు

రెవెన్యూ బోర్డు జూలై 1వ తేదిన చేసిన సమీక్ష ప్రకారం భూములు కేటాయింపుకు సంబంధించిన సవరించబడిన విధానాన్ని అమలు పరచడంలో అనంతపురం జిల్లా రాష్ట్రమంతటిలోకీ ప్రథమ స్థానాన్నలంకరించింది. ఇప్పటి వరకూ 926 దరఖాస్తు దార్లకు 13.35 సెంటుల తరీ భూములను 5213.64 సెంటుల ఖుష్కీ భూములను కేటాయించడం జరిగింది. ఇంకా 1687.25 సెంటుల తరీభూమి, 275250-76 సెంటుల ఖుష్కీ భూమి కేటాయింపుకు సిద్ధంగా వుంది.

## చిత్తూరు

### లోక సహాయకుల శిక్షణ శిబిరం

పుంగనూరులో గత జూలై 8వ తేదినుంచి ఒక నెల రోజులపాటు లోకసహాయక శిక్షణ శిబిరం నిర్వహించబడినది.

### గ్రామ సహాయకుల శిక్షణ శిబిరం

చౌడేపల్లి పంచాయతీ సమితిలోని కరకమండ గ్రామంలో గత జూలై 25వ తేదీన గ్రామ సహాయక శిక్షణ శిబిరం ప్రారంభించబడింది. గ్రామప్రజలు పంచాయతీకి ఒక పక్కా భవనాన్ని దానం చేశారు.

## తూర్పుగోదావరి జిల్లా

### పోలియో మందు పంపిణీ

కాకినాడ మునిసిపాలిటీ జనరల్ ఆసుపత్రి ప్రజారోగ్య శాఖల సంయుక్తాధ్వర్యాన గత జూలై 17వ తేదీన జరిగిన సమావేశంలో ఆసుపత్రి సూపరింటెండెంటు, కాకినాడకు 4000 మోతాదుల పోలియోమందు మంజూరైనట్టు తెలియజేశారు.

### అనాథ బాలికలకు చేతి పనులు

కమలా నెహ్రూస్మారక అనాథ శరణాలయంలో 1961 జూలై నెలలో చేతిపనుల విభాగాన్ని తెరిచారు. 42 మంది హరిజన బాలికలు దీనిలో వుంటున్నారు.

## గుంటూరు

### మధ్యాహ్న భోజన కేంద్రం

గుంటూరు కోబాల్ట్ పేటలోని మునిసిపల్ ఎలిమెంటరీ పాఠశాలలో గిల్డ్ ఆఫ్ సర్వీస్ ఆధ్వర్యాన తెరవబడిన ఉచిత మధ్యాహ్న భోజన కేంద్రానికి గతనెల 20వ తేదీన యూనియన్ రక్షణశాఖ ఉపమంత్రి శ్రీ కె. రఘురామయ్య ప్రారంభోత్సవం చేశారు.

### పాఠశాల భవనానికి శంకుస్థాపన

మద్దిపాడు హయ్యర్ సెకండరీ పాఠశాల నూత్నభవనానికి జూలై 10వ తేదీన శంకుస్థాపన జరిగింది. భవననిర్మాణానికి, కీ. శే. శ్రీ కడియాల యానాదయ్యగారి కుటుంబీకులు రు. 25000 లనూ, గ్రామస్థులు రు. 25000 లను విరాళంగా ఇచ్చారు. ఈ పాఠశాలకు శ్రీ కడియాల యానాదయ్య గారి పేరు పెట్టబడినది.

### బ్రెజిల్‌కు ఒంగోలు పశువుల ఎగుమతి

కొత్తఢిల్లీలోని జాతీయ పశుకొనుగోలు సంఘంచే పంపబడిన బ్రెజిల్ ప్రతినిధివర్గం, 1961 జూలై నెలలో ఈ జిల్లాలోని కీలక గ్రామబ్లాకులను సందర్శించి బ్రెజిల్‌కు ఎగుమతిచేసే నిమిత్తం. 30 000రు విలువచేసే పశువులను కొన్నారు.

### విద్యుచ్ఛక్తి సరఫరా

కురగల్లులో జూలై 19వ తేదీన విద్యుద్దీపాలకు ప్రారంభోత్సవం జరిగింది.

### నేత పనివారల గృహ నిర్మాణ కాలనీ ప్రారంభం

నిడుబ్రోలులో రు. 169000ల వ్యయంతో నిర్మించబడిన నేతపనివారల గృహనిర్మాణ కాలానికి 1961 జూలైలో ప్రారంభోత్సవం జరిగింది.

## హైదరాబాదు

### పొదుపు పథకం సలహాసంఘం సమావేశం

జాతీయ పొదుపు పథకం రాష్ట్ర సలహాసంఘం సమావేశం జూలై 12వ తేదీన హైదరాబాదులో జరిగింది. రాష్ట్రంలో 1961–62 వ సం. లో జాతీయ పొదుపు పథకానికి రూ. 900 లక్షల మేరకు డిపాజిట్లు సేకరించడానికీ, రూ. 200లక్షల మేరకు బహుమతి బాండ్లు విక్రయించడానికీ సంఘం నిర్ణయించింది.

### పాఠ్య పుస్తకాల గ్రంథాలయం

ఉస్మానియా విశ్వవిద్యాలయావరణలో జూలై 14 వతేదిన జరిగిన ఒకసభలో ప్రణాళికా సంఘంసభ్యుడు శ్రీ సి. ఎం. త్రివేది పాఠ్యపుస్తకాల గ్రంథాలయానికి ప్రారంభోత్సవం చేశారు. హైదరాబాదు రోటరీక్లబ్బు, నిజాం ద్రవ్యనిధి సంస్థ సంయుక్తాధ్వర్యాన ఈ పథం ప్రవేశ పెట్టబడింది.

### మూడు చేతి పరిశ్రమల సంస్థల ప్రారంభం

రాష్ట్ర సాంఘిక సంక్షేమ శాఖామంత్రిణి జూలై నెలలో హైదరాబాదులోని ఫతే దర్వాజాలో చేతి పరిశ్రమల కేంద్రాన్ని తెరిచారు. అదేనెలలో ఆసిఫ్‌నగర్, మల్లేపల్లిలో కూడా మరో రెండు చేతిపరిశ్రమల కేంద్రాలను తెరవడం జరిగింది.

### ఫోను సౌకర్యాల విస్తరణ

హైదరాబాదు టెలిఫోను సంస్థ మూడవదశ విస్తరణ కార్యక్రమానికి జూలై 22వ తేదీన ప్రారంభోత్సవం జరిగింది. దీనితో ఇది భారతదేశమంతటిలోకీ అయిదవ ప్రధాన టెలిఫోను సంస్థ అయింది. ఈ పనికి రు. 24.40 లక్షలు ఖర్చవుతుంది.

### జాతీయ పొదుపు సర్టిఫికెట్లు

చేవెళ్ల, ఇబ్రహింపట్నం పంచాయతీ సమితుల సభ్యులు తమకు లభించే సిటింగ్ ఫీజు మొత్తాలను జాతీయ పొదుపు సర్టిఫికెట్లు కొనుగోలుకు పెట్టుబడి పెట్టడానికి నిశ్చయించుకున్నారు. ఇబ్రహింపట్నం పంచాయతీ సమితి సభ్యులు అన్ని సమావేశాలను లభించే సిటింగు ఫీజు మొత్తాలను పొదుపు పథకానికి పెట్టుబడి పెట్టగా చేవెళ్ల సమితి సభ్యులు ప్రతి రెండు సమావేశాలకు ఈ ప్రకారం చేస్తారు. ఈ విషయాన్ని ఈ పంచాయతీ సమితుల బ్లాక్ డెవలప్‌మెంట్ ఆఫీసర్లు జూలై 21వ తేదీన వెల్లడించారు.

### నవభారత నిర్మాణ ప్రదర్శన

హైదరాబాదు ఫీల్డ్ ఎగ్జిబిషన్ ఆఫీసువారు జూలై 23 వ తేదీనుంచి 29వ తేదీవరకు పంచవర్ష ప్రణాళికలపై నవభారత నిర్మాణం అనే ప్రదర్శనాన్ని నిర్వహించారు. పంచవర్ష ప్రణాళికల క్రింద అమలు జరుగుతున్న వివిధ అభివృద్ధి కార్యక్రమాలకు ప్రచారం ఇచ్చేనిమిత్తం ఈ ప్రదర్శనంలో అనేక నమూనాలు, చిత్రపటాలు, గ్రాఫులు మొదలైనవాటిని వుంచారు. ప్రతిరోజు చలనచిత్రాలను కూడా ప్రదర్శించారు.

భూమి విరాళం

మోవిన్‌పేట బ్లాకులోని మేక వనంపల్లి గ్రామ హరిజనులు 9మంది, తమ గ్రామంనుంచి, అమ్రాదికలం వరకు అప్రోచ్ రోడ్డు నిర్మించే నిమిత్తం 25 గుంటల భూమిని విరాళంగా ఇచ్చారు.

## ఖమ్మం

### వ్యవసాయఋణాలు

వ్యవసాయ తక్కావి ఋణాల కొరకు జిల్లా పరిషత్తు మధిర, ఖమ్మం, కొత్తగూడెం తాలూకాలకు వరుసగా రూ. 20,000, రూ. 25,000, రూ. 7500 లనూ ఎల్లందు, బూర్గంపాడు భద్రాచలం, నాగూరు తాలూకాలకు రూ. 92500లను కేటాయించింది "శీఘ్రంగా ఎరువులు వేసే పథకం" క్రింద సహకార సంఘాలద్వారా ఋణాలు ఇచ్చేనిమిత్తం సమితులు, సమితులు ఏర్పడని ప్రాంతాలకు ఒక్కొక్కదానికి రూ. 1లక్ష చొప్పునకూడా పరిషత్తు మంజూరు చేసింది.

### గ్రామీణ వృత్తిపనివారల శిక్షణకేంద్రం

బూర్గంపాడు తాలూకా పినపాకలో 1961 ఆగస్టు నెలలో వడ్రంగం పనిలో సమిష్టి సౌకర్య కేంద్రాన్ని తెరిచారు. ఆధునిక పనిముట్లను ఉపయోగించి మంచిరకం వస్తువులను తయారుచేయ డంలో గ్రామీణ వృత్తిపని వారలకు ఈ కేంద్రంలో శిక్షణ ఇస్తారు.

### వెనుకబడిన తరగతుల వారి కాలనీ

మధిర పంచాయతీసమితి మడపల్లిలో 1961 జూలైలో వెనుకబడిన తరగతుల కాలనీకి ప్రారంభోత్సవం జరిగింది. రూ. 5,0000ల వ్యయంతో నిర్మించబడిన మీనవోలు చెరువు తూముకూడా ఈ నెలలో ప్రారంభించ బడినది,

### నమూనా పొదుపు గ్రామం

కనిగిరి శిరిపురంకు చెందిన 150 మంది ప్రజలు తమ గ్రామంలో పోస్టల్ సేవింగ్స్ బ్యాంకు అకౌంటు సౌకర్యాలు కల్పించ గోరారు. అయితే ఈగ్రామ జనాభా 200 కంటే ఎక్కువ వున్నప్పటికీ అక్కడపోస్టాఫీసులేదు. కాబట్టి వారు తమ గ్రామంలో ఒక పోస్టాఫీసు స్థాపించడానికి అభ్యర్థించారు. ఈ గ్రామప్రజలు తమ గ్రామాన్ని వైర పంచాయతీ సమితిలోని "నమూనా పొదుపు గ్రామంగా" ఏర్పాటుచేయ దలిచారు.

నిర్బంధోచిత ప్రాథమిక విద్యాపథకం క్రింద ఖమ్మం జిల్లాలో ఈ సంవత్సరం 24016 మంది పిల్లలు పాఠశాలల్లో ప్రవేశం పొందుతారు. ప్రస్తుతం ఈ జిల్లాలో 33,238 మంది పిల్లలు పాఠశాలలకు వెళ్తున్నారు. పిల్లలను ఆకర్షించే నిమిత్తం వారికి మధ్యాహ్నభోజనం సరఫరా చేయడం, అర్హులైన విద్యార్థుల కు పుస్తకాలు ఇవ్వడం, అర్హులాండ్రైన బాలికలకు వస్త్రాలు ఇవ్వడం, అటెండెన్స్ స్కాలర్ షిప్పులు ఇవ్వడం జరుగుతుంది.

## కృష్ణా

### ముక్త్యాలలో పిల్లల పరిపాలన

ముక్త్యాలలోని సమితి ఎలిమెంటరీ పాఠశాలలో, సమితి అధ్యక్షుడు శ్రీ వి. ఆర్. జి, కె, ఎం ప్రసాద్, ప్రయోగాత్మకంగా పిల్లల ప్రభుత్వాన్ని ప్రారంభించారు. ప్రతిభావంతులైన నలుగురైదుగురు విద్యార్థులకు తమ సంస్థ యొక్క నిర్వహణ వ్యవహారాలలో శిక్షణ ఇవ్వబడుతుంది ఈ ప్రయోగ ఫలితాలను పురస్కరించుకొని ఇటువంటి పద్ధతిని బ్లాకు ప్రాంతంలోని అన్ని పాఠశాలలకు కూడా విస్తరింపజేయడమవుతుంది, శ్రీ ప్రసాద్ పాఠశాల పిల్లకు డ్రస్సులు బహూకరించారు.

### పంచాయతీ రాజ్యంపై మొదటి జిల్లా స్థాయిసమ్మేళనం

పంచాయతీ రాజ్యంపై జరిగిన మొదటి జిల్లా స్థాయి సమ్మేళనానికి మచిలీపట్నంలో జూలై 2వ తేదీన జిల్లా కలెక్టరు ప్రారంభోత్సవం చేశారు.

### క్షయవ్యాధినిరోధక సంఘానికి భూదానం

టి, బి. ఔట్ పేషంట్ వార్డును నిర్మించుకునేందుకై మచిలీపట్నం క్షయవ్యాధి నిరోధక సంఘానికి శ్రీ జె. రామరావు అయిదు ఎకరాల భూమిని దానం చేశారు.

### టాగూరు స్మారక గ్రంథాలయం

రూ. 2లక్షల వ్యయంతో నిర్మించ నుద్దేశించిన టాగూరు స్మారక గ్రంథాలయ భవనానికి జూలై 18వ తేదీన రాష్ట్ర విద్యామంత్రి విజయవాడలో శంకు స్థాపన చేశారు.

## [illegible]

### బహూళార్థసాధక సహకార సంఘం

కసల బహుళార్థ సాధక సహకార సంఘానికి జూలై 28వ తేదిన పునాదిరాయి వేయడమైనది.

### ప్రాథమిక ఆరోగ్య కేంద్రం

నంది కొట్కూరు బ్లాకు పారుమంచలలో ప్రాథమిక ఆరోగ్య కేంద్రానికి జూలై 23వ తేదీన ప్రజారోగ్య శాఖా మంత్రి శంకుస్థాపన చేశారు.

## మహబూబ్‌నగరం

### ప్రాధమిక పాఠశాలల ఉపాధ్యాయుల మహాసభ

కొడంగల్ పంచాయతీ సమితి బ్లాకు ప్రాధమిక పాఠశాలల ఉపాధ్యాయుల ప్రథమ వార్షికోత్సవం 1961 జూలైలో జరిగింది. సుమారు 120 మంది ఉపాధ్యాయ ప్రతినిధులు పాల్గొన్నారు.

### చిన్న మొత్తాల పొదుపు ఉద్యమం

కొడంగల్ పి. ఎస్. బ్లాకు రావులపల్లి గ్రామంలో జూలై 20వ తేదీన చిన్న మొత్తాల పొదుపు ఉద్యమం ప్రారంభించ బడినది.

### 6వ తరగతి ప్రారంభం

షాద్‌నగర్ పంచాయతీ సమితి బ్లాకులోని బూర్గుల గ్రామంలో జిల్లా పరిషత్తు అధ్యక్షుడు జూలై 24వ తేదీన 6వ తరగతికి ప్రారంభోత్సవం చేశారు.

## మెదక్

### గ్రంధాలయ భవనం

సంగారెడ్డిలో మెదక్ జిల్లా కేంద్ర గ్రంధాలయానికి భవనం నిర్మించే నిమిత్తం ప్రభుత్వం రూ. 5,0000 లు మంజూరు చేసింది.

### భూముల కేటాయింపు

ఈ జిల్లాలోగల 1,06,542 ఎకరాల బంజరు భూములలో జూన్ ఆఖరు వరకు 41,739 ఎకరాల భూమిని, భూవసతి లేని వ్యవసాయదార్లకు కేటాయించడం జరిగింది. వీటిలో తరీ భూములు 2346 ఎకరాలు.

## నల్గొండ

### గిరిజానగర్ లంబాడీ కాలనీ

దేవరకొండ తాలూకా గిరిజానగర్‌లో జూలై 20వ తేదీన లంబాడీ కాలనీకి ప్రారంభోత్సవం జరిగింది.

### క్రొత్త పాఠశాలలు

జూలై 20వ తేదీన జిల్లా పరిషత్ అధ్యక్షుడు శ్రీ జి. యస్ రెడ్డి నల్గొండ పంచాయతీ సమితిలోని చినమాధవరంలో కొత్త మాధ్యమిక పాఠశాలకు ప్రారంభోత్సవం చేశారు. యీ సందర్భంలో మాట్లాడుతూ ఆయన 1961-62వ సం॥ లో 21 మాధ్యమిక పాఠశాలలు, 14 ఉన్నత పాఠశాలలను ప్రారంభించాలని పరిషత్ తలపెట్టిందని అన్నారు.

### యువకులచే వంగమర్తి పునర్నిర్మాణం

నకిరెకల్లు పంచాయతీ సమితిలో నివంగమర్తి గ్రామంలో యువకులు శ్రమదానం ద్వారా విరాళాల ద్వారా ఒక గ్రామ పఠనాలయ భవనాన్ని నిర్మించారు. మూడెకరాల భూమి కౌలుకు తీసుకొని పొగాకు పండించి దానితో వచ్చిన లాభంతో తమ క్లబ్‌కు ఒక రేడియో సెట్టు కొనుక్కున్నారు. ప్రజల విరాళాలతోనూ, పంచాయతీ సమితి యిచ్చిన రు 1500/- ల గ్రాంటులోను సామూహికహాలు—బహిరంగ ప్రదర్శనశాలను నిర్మించారు.

### మహిళలచే మరొక గ్రామ పంచాయితి నిర్వహణ

ఆత్మకూరు పూర్వవిస్తరణ బ్లాకులోని గోరంట్ల గ్రామ పంచాయతీ 8 సీట్లలో 7 సీట్లకు మహిళలు యెన్నుకోబడ్డారు. శ్రీమతి జి. యశోద, అ. సుగుణమ్మ, జి. వెంకటమ్మ, కె. వజ్రమ్మ, యం, సుగుణమ్మ అనసూయ, యం. లక్ష్మమ్మ టి. వి. సీతారాంరావు గారలు ఈ పంచాయతీ సభ్యులుగా ఎన్నికైనారు.

### సంచార గ్రంధాలయం

పండిత మోతీలాల్ నెహ్రూ స్మారక దినోత్సవ స్మృతి చిహ్నంగా సంచార గ్రంధాలయాన్ని ప్రారంభించుటకై నారాయణపురం పంచాయతీ సమితి రు. 500/- లు మంజూరు చేసింది. సమితి ప్రాంతం ప్రజల అవసరాలను యిది తీరిస్తుంది.

### గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరా

ఈ జిల్లాలో గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరా చేసే కార్యక్రమం లక్ష్యాన్ని మించి అమలు జరిగింది రెండవ ప్రణాళికా కాలంలో మొత్తం 22 గ్రామాలకూ, పట్టణాలకు విద్యుచ్ఛక్తి సరఫరా చేయాల్సి వుండగా, 55 గ్రామాలకూ, పట్టణాలకు సరఫరా చేయడం జరిగింది. రెండవ ప్రణాళికా పథకం క్రింద, వ్యవసాయాభివృద్ధికై నీటి పారుదల సౌకర్యం నిమిత్తం బావులకు విద్యుచ్ఛక్తి ఇవ్వబడుతున్నది. జిల్లాలోని భువనగిరి నల్లగొండ, సూర్యాపేట, కోదాడులలో విద్యుచ్ఛక్తి ఉప కేంద్రాలు స్థాపించబడ్డాయి.

## నెల్లూరు

### మంచినీటి సరఫరాకై రు. 96000/- ల కేటాయింపు

మంచినీటి సరఫరాకై రు. 96000/- కేటాయించుటకు, 1961 జూలైలో జరిగిన సమావేశంలో జిల్లా పరిషత్ అంగీకరించింది... ఆసుపత్రి నిర్మాణానికి రు. 20,000/- రూ. పాఠశాల

భవనాలు, పంచాయతీ ఆఫీసు భవన నిర్మాణాలకురు. 76000/-లు రు. 1.99 లక్షల యీక్వలైజేషన్ గ్రాంటు నుండి ప్రభుత్వం, పరిషత్‌కు యిచ్చిది.

ప్రణాళికా ప్రదర్శన

జూలై 9 వ తేదీన నెల్లూరులోని ప్రభుత్వ శిక్షణ కళాశాలలో పంచవర్ష ప్రణాళికా ప్రదర్శనానికి ప్రారంభోత్సవం చేయబడింది. భారత ప్రభుత్వ ప్రదర్శనం యూనిట్‌వారు దీనిని నిర్వహించారు రెండు ప్రణాళికలలో సాధించిన అభివృద్ధిని తెలిపే పటాలు, చిత్రాలు, వగైరా ప్రదర్శించారు.

'ప్యాకేజి పథకం' ప్రగతి

నెల్లూరు జిల్లాలోని రెండు గ్రామాలలో రాబి, కరీఫ్ పంటల అభివృద్ధికై ప్రవేశపెట్టిన ప్యాకేజి పథకం మంచి ఫలితాలను యిచ్చింది. దీనివల్ల యెకరాకు, 960,550 పౌండ్ల అదనపు పంట తేలింది. కరీఫ్ పంట కాలంలో వెంకటాచలం పంచాయతీసమితిలోని తాటిపర్తిపాలెం గ్రామంలో, రాబి పంట కాలంలో చేజెర్ల పంచాయతీసమితిలోని అనంతసాగరం గ్రామంలో యీ పథకం అమలు పరచబడింది.

తాటిపర్తిపాలెంలో జపాన్ పద్ధతిలో వరి సాగు చేయబడి 225 పౌండ్ల అదనపు పంట అంటే మామూలు పంటకన్నా దాదాపు సగానికి పైగా యెక్కువ పంట తీయబడింది యీ క్రొత్త పథకం వల్ల యెకరాకు రు. 50/- ల అదనపు ఖర్చుతో రు. 110/- ల యెక్కువ లాభం తీయబడింది. అనంతసాగరంలో యెకరాకు 550 పౌండ్ల పంట అధికంగా తేలి భూస్వామి రాబడి 10 శాతం పెరిగింది.

ప్రాథమిక ఆరోగ్య కేంద్రం

ఆత్మకూరు పంచాయతీసమితిలోని అన్నసముద్రం గ్రామంలో జూలై 23 వ తేదీన కేంద్ర మంత్రి శ్రీ బెజవాడ గోపాలరెడ్డి. ప్రాథమిక ఆరోగ్య కేంద్రానికి ప్రారంభోత్సవం చేశారు. యీ కేంద్రం 16000 ప్రజలు గల 20 గ్రామాలకు వైద్య సౌకర్యం లభింపజేస్తుంది. చేజర్ల సమితిలోని వీరూరు గ్రామంలో మాధ్యమిక పాఠశాలకు శ్రీ రెడ్డిగారు ప్రారంభోత్సవం చేశారు.

పోలియో మందు పంపిణీ

నెల్లూరు పట్నంలో జూలై 22 వ తేదీ నుండి రెండవ తడవ పోలియో మందు పంచారు.

సామూహిక హాలు

1961 జూలై నెలలో చేజెర్లలో సామూహికహాలు తెటిచారు.యిందులో ఒక పఠనాలయం, బ్లాకు సమాచార కేంద్రం పార్కు వున్నాయి.

కంపోస్టు వారం :- 1961 జూలైలో నెల్లూరులో 'కంపోస్టు వారం' జరిపారు.

పురపాలక సంఘం రెండు కంపోస్టు డిపోలను నిర్వహిస్తున్నది. వీటి వల్ల గత రెండు సంవత్సరాలలో రు. 50,000/-ల రాబడి లభించింది.

## నిజామాబాదు

ప్రధాని నిధికి విరాళం

1961 ఆగస్టులో నిజామాబాదు రోటరీ క్లబ్ సభ్యులు రు. 1400 లు వసూలు చేసి ప్రధాని జాతీయ నిధికి పంపారు.

హరిజనులకు సౌకర్యాలు

1961 జూలైలో జిల్లా పరిషత్తు స్థాయీ సంఘం సమావేశమై యీ క్రింది వాటికి గ్రాంట్లు మంజూరు చేసింది. కామారెడ్డి హరిజన హాస్టల్‌కు రు. 18000 లు హరిజన విద్యార్థులకు ఉపకార వేతనాలు రు. 10,000 లు హరిజన వాడలలో బావుల త్రవ్వకానికి రు. 7000. వెనుకబడిన జాతుల విద్యార్థులకు ఉపకార వేతనాలకు రు. 4000 లు.

## శ్రీకాకుళం

పాఠశాల భవన నిర్మాణం

జూలై 17 వ తేదీన జిల్లాపరిషత్ అధ్యక్షులు శ్రీ బి. కూర్మన్న పెదమేడపల్లిలో మాధ్యమిక పాఠశాల భవనానికి ప్రారంభోత్సవం చేశారు. శ్రీ వి వి ఎ. సన్యాసయ్య. తన తండ్రి శ్రీ వి. సీతారామస్వామి స్మారక చిహ్నంగా యిచ్చిన విరాళంతో యీ భవనం నిర్మించారు.

బాలికల మాధ్యమిక పాఠశాల

జూలై 16 వ తేదీన నరసన్నపేటలో బాలికల మాధ్యమిక పాఠశాలకు ప్రారంభోత్సవం చేశారు.

రెండు పాఠశాలలు

జూలై 23 వ తేదీన జిల్లా పరిషత్ అధ్యక్షుడు పోలవరం, పాతపట్నం దగ్గఱ లింగాలలో రెండు పాఠశాలలకు ప్రారంభోత్సవం చేశారు.

## విశాఖపట్నం

శిశుపోషణ శిక్షణ శిబిరం

చముడు మహారాణి 5 యెకరాలతో కూడిన ఒక భవనాన్ని

శిశుపోషణ శిక్షణ శిబిరానికై విరాళంగా యిచ్చారు.

నక్కపల్లిలో గోష్ఠి

1961 జూలైలో నక్కపల్లి పంచాయతి సమితి ప్రాథమిక ఉపాధ్యాయుల గోష్ఠి జరిగింది. బ్లాకు ప్రాంతంలో నిర్బంధోచిత ప్రాథమిక విద్యా పథకం విజయవంతంగా అమలు చేయడానికి తీర్మానించారు... 10 యెలిమెంటరీ పాఠశాలల ఉచిత మధ్యాహ్న భోజన కేంద్రాలు స్వచ్ఛందంగా నడుపుటకు నిర్ణయించారు.

## వరంగల్లు

జిల్లాపరిషత్ గ్రాంట్లు: 1961 జూలైలో జిల్లాపరిషత్ ఆర్థిక స్థాయీ సంఘం క్రింది వాటికి గ్రాంట్లు మంజూరు చేసింది. చిన్న తరహా నీటి పారుదల వనరులకు అత్యవసర మరమ్మతులు చేయుటకు రు. 25000/- లు 23 చిన్నతరహా నీటి పారుదల మరమ్మతులకు రు. 30,000/- లు.

గ్రామీణ రోడ్ల పరిరక్షణకు రు 66,600/- లు.

క్రొత్త రోడ్ల నిర్మాణానికి రు 1,10,000/- లు.

లంబాడీల కాలనీ

జూలై 23 వ తేదీన రాష్ట్ర వ్యవసాయ మంత్రి మహబూబాబాదు దగ్గర రజాలిపేట తండాలో 100 యిండ్లు గల లంబాడీ కాలనీకి ప్రారంభోత్సవం చేశారు.

చిన్నతరహా నీటి వనరులు

1961-62 సంవత్సరంలో జిల్లాలో చిన్నతరహా నీటి వనరుల మరమ్మతులకై . రూ. 3 లక్షలు ఖర్చు చేశారు.

మన్నూరు పొదుపు సంఘం

మన్నూరు పోలీసులు స్థాపించిన పొదుపు సంఘం, ఆంధ్ర ప్రదేశ్‌లో కంతటికీ పెద్ద సంఘంగా నిర్ణయించారు. యీ సంఘం 8 కంపెనీలకు చెందిన 1200 పోలీసులు, ఆఫీసర్లతో స్థాపించ బడింది, ప్రతి నెలా రు. 2000 ల వసూలౌతున్నది.

వరంగల్లులో శిశుపోషణ కేంద్రం

జూలై 26 వ తేదీన శ్రీమతి అక్బర్‌సాబీరు, అఖిలభారత మహిళా సమాజంచే నిర్వహించ బడుతున్న శిశుపోషణ కేంద్రానికి ప్రారంభోత్సవం చేశారు.

## పశ్చిమ గోదావరి

అభివృద్ధి పథకాలకై పరిషత్తు మంజూరీ

జిల్లా పరిషత్తు ఆర్థిక స్థాయీ సంఘం, జూలై 10 వ తేదీన జరిపిన సమావేశంలో 1961-62 సంవత్సరంలో 12 గ్రామాలలో మాధ్యమిక పాఠశాలలు ప్రారంభించుటకు, 21 సెకండరీ పాఠశాలలో పైతరగతులు ప్రారంభించుటకు తీర్మానించింది...

పాఠశాల అభివృద్ధి

తాడేపల్లిగూడెంలోని జిల్లాపరిషత్ ఉన్నత పాఠశాలను హయ్యర్ సెకండరీ పాఠశాలగా మార్చారు.

బాలభటుల కృషికి ప్రశంసలు

జూలై 9 వ తేదీన తణుకులో జిల్లా బాలభటులు గైడుల సంఘ రెండవ వార్షికోత్సవాలు జరిగాయి. తమ కృషికి రు. 100/ల బహుమతి పొందినందుకు చాలా మంది యీ సంఘాన్ని ప్రశంసించారు.

బావుల త్రవ్వకానికి సబ్సిడీలు

పశ్చిమ గోదావరి జిల్లా మెట్ట ప్రాంతాలలో యితోధికంగా ఆహార ధాన్యాల ఉత్పత్తి జరగడానికి వీలుగా బావులు త్రవ్వుటకు రాష్ట్ర ప్రభుత్వం రు. 105000 లు మంజూరు చేసింది. తృతీయ ప్రణాళికా కాలంలో జిల్లాలో 200 బావులు త్రవ్వుటకు యేటా రు. 1,50,000/- లు యిచ్చుటకై ప్రభుత్వం ఉత్తర్వులు జారీ చేసింది.

పొదుపు గ్రామం

ఈ జిల్లాలో మాదేపల్లిని (పెదపాడు పంచాయితీ సమితి) "పొదుపు గ్రామం"గా నిర్ణయించారు. ఈ గ్రామంలోని అన్ని కుటుంబాలకు పొదుపు యెకౌంట్లు వున్నవి.

# సంగ్రహ ప్రకటనలు

## పోర్టు ట్రస్టులు

ఆంధ్ర ప్రదేశ్ చిన్న రేవుల అభివృద్ధి మండలి ద్వితీయ సమావేశం పబ్లిక్‌వర్క్సుశాఖా మంత్రి అధ్యక్షతన 1961 జూలై 29 వ తేదీన జరిగింది. ట్యూటికోరిన్ నమూనాలో కాకినాడ, మచిలీపట్నం రేవులకు ప్రత్యేకంగా పోర్టు ట్రస్టు వుండాలనీ, రాష్ట్రంలోని కృష్ణపట్నం, భీమిలిపట్నం మొదలైన చిన్న రేవులకు మరో పోర్టు ట్రస్టు వుండాలని ఈ సమావేశంలో నిశ్చయించారు. ప వ శాఖ సహాయంతో, బ్రహ్మనపట్నం రేవును అభివృద్ధి పరచడానికి ప్రాథమిక పరిశీలనలు జరపాలని కూడా సిఫార్సు చేశారు. కాకినాడ రేవులో వర్తకం తగ్గడాన్ని పరిశీలించి అక్కడి వర్తక వ్యాపారాలను తిరిగి పెంపొందించడానికై తగు చర్యలు గైకొనడానికి నిశ్చయించారు.

## వెనుకబడిన తరగతులకు రాయతీలు

ప్రభుత్వోద్యోగాల లోనూ, విద్యా రాయతీలు తదితర విషయాలలోను నిమ్న జాతులు, నిమ్న తెగలు, వెనుక బడిన తరగతుల వారికి ప్రభుత్వం కల్పించిన సౌకర్యాలు, రాయతీలు మొదలైన ప్రత్యేక పనులు చూడడానికి గాను, సాధారణ పరిపాలన శాఖలో ఎక్స్ అఫీసియో డిప్యూటీ సెక్రటరీగానూ, ప్రత్యేకాధికారిగాను శ్రీ ఎన్. యాగంటి, ఐ ఏ ఎస్. (రిటైర్డ్) 1961 ఆగస్టు 9 వ తేదీన ఛార్జి పుచ్చుకున్నారు. ఆయన సేకరించిన సమాచారం ప్రభుత్వంచే నియమించబడ సంఘానికి సమర్పించబడుతుంది.

## వరకట్న నిషేధ చట్టం

1961 వ సం. పు వరకట్న నిషేధ చట్టం 1961 జూలై 1 వ తేదీనుంచి అమల్లోనికి వచ్చినట్టు భారత ప్రభుత్వం ప్రకటించింది.

## శిస్తు రెమిషను

గుంటూరు జిల్లా, వినుకొండ తాలూకాలోని దిగువ గ్రామాల మెట్ట భూములలో మిడుతల దండు దాడుల ఫలితంగా పంట నష్టపోయినందువల్ల ప్రభుత్వం 1370 వ ఫసలీ కిస్తుకు రెమిషన్ యిచ్చింది.

భూమిలో నాల్గు అణాలు అంత కన్న తక్కువ పంట తేలిన వాటికే యీ రెమిషన్ వర్తిస్తుంది.

1. ఇనవోలె, 2. నూరేపల్లి, 3. తిమ్మాయపల్లి, 4. వినుకొండ, 5. పెద్దవరం.

## "పట్టాల" మార్పిడి

మరణించిన "పట్టేదార్ల" వారసులకు కలుగుతున్న ఇబ్బందుల దృష్ట్యా, చనిపోయిన వ్యక్తుల పేరిట వున్న భూముల పట్టాలను వారి వారసుల పేరిట మార్చే విషయంలో తహశీల్దార్లు శీఘ్రంగా చర్యలు గైకొనుటకు ఆదేశించ వలసిందిగా ప్రభుత్వం జిల్లా కలెక్టర్లకు ఉత్తర్వులు చేసింది. అసలు పట్టేదార్లు మరణించి భూముల పట్టాల మార్పిడి జరగకుండా వున్నట్లయితే, పట్టాలను మార్చడానికి గాను తక్షణమే తమ ప్రాంతానికి సంబంధించిన తహశీల్దార్లను కోర వలసిందిగా ప్రజలకు విజ్ఞప్తి చేయడమైనది.

## స్కాలర్ షిప్పులు

ప్రస్తుతం వెనుకబడిన తరగతులకు చెందిన అభ్యర్థులకు వర్తిస్తున్న భారత ప్రభుత్వ నిబంధనావళిలోని "మీన్స్ టెస్ట్",

1961-62 వ సంవత్సరం నుంచి నిమ్న జాతులకు చెందిన అభ్యర్థులకు కూడా వర్తింప జేయబడుతుంది. దీని ఫలితంగా, నిర్ణీత కనిష్ట ఆదాయంగల నిమ్న జాతుల దరఖాస్తు దార్లు మాత్రమే స్కాలర్‌షిప్పులు పొందడానికి అర్హులవుతారు. కాబట్టి అభ్యర్థులు తమ తండ్రి లేదా సంరక్షకుడి ఆదాయాన్ని సంబంధించి తహశీల్దారు లేదా డిప్యూటీ తహశీల్దారు హోదాకు తక్కువ కాని రెవెన్యూ అధికారి వద్దనుంచి ధృవీకరణ పత్రం పొంది దానిని హైద్రాబాదులోని సాంఘిక సంక్షేమ శాఖ డైరెక్టరు కార్యాలయంలో దాఖలు చేయవలెను. ఈ సర్టిఫికెటు జతపరచని దరఖాస్తులు త్రోసిపుచ్చబడతాయి.

## పబ్లిక్ సర్వీస్ కమీషన్

ఆంధ్ర ప్రదేశ్ పబ్లిక్ సర్వీసు కమీషను 1958-59 వ సంవత్సరములో మొత్తం 36,168 కేసులు నిర్వహించింది. కమీషను సభ్యులు చర్చలు జరుపుకోవడానికి గాను జరిగిన సమావేశాలు కాక ఈ సంవత్సరములో మౌఖిక పరీక్ష జరిపే నిమిత్తం 115 రోజులలో సమావేశాలు జరిగాయి. స్టేట్, సబార్డినేటు సర్వీసులలో సాంకేతికమైనవి కాని ఉద్యోగాలకు అభ్యర్థులను నేరుగా ఎన్నికచేసే నిమిత్తం లిఖిత, మౌఖిక పరీక్షలతో కూడుకున్న సమిష్టి పోటీ పరీక్షను యీ సంవత్సరం కమిషను జరిపి, యీ పరీక్షా ఫలితాలను బట్టి అభ్యర్థులను నియమించింది.

మామూలు ప్రకారం సర్వీసు కమిషను 1958 జూన్, డిశెంబరు నెలలలో 13 కేంద్రాలలో స్పెషల్ టెస్టులు, డిపార్టుమెంటల్ టెస్టులు జరిపింది. 1957 జూన్‌లో స్పెషల్ టెస్టుకు 4 094 మంది, డిపార్టుమెంటల్ టెస్టుకు 2,557 మంది అభ్యర్థులు హాజరు కాగా 1957 డిశెంబరులో యీ పరీక్షలకు వరుసగా 5,196 మంది, 2,593 మంది అభ్యర్థులు హాజరయ్యారు.

గుజరాతీ, మార్వాడీ భాషలలో ప్రావీణ్యత సంపాదించిన వాణిజ్య సుంకముల శాఖా-కార్లను రూ. 1,000 బహుమతి ఇచ్చే నిమిత్తం కమిషను 1958 డిశెంబరు నెలలో ఒక పరీక్ష జరిపింది.

ఈ కాలంలో కమిషను క్రమశిక్షణ చర్యకు సంబంధించిన 3 అప్పీళ్లు, 6 పిటిషన్లు, 7 ప్రతిపాదన విషయంలోనూ, ఇంజ్యూరీ పెన్షన్, ఇంజ్యూరీ గ్రాచ్యుటీలకు సంబంధించిన 17 కేసుల విషయంలో తగు సలహాలిచ్చింది.

## ప్రజోపయోగకరమైన సర్వీసు

ఆంధ్ర ప్రదేశ్‌లో సిమెంటు, వస్త్ర పరిశ్రమలు, 1947 వ సం. పు పారిశ్రామిక వివాదాల చట్టం నిమిత్తమై, 1961 జూన్ లగాయతు మరో ఆరు నెలల పాటు ప్రజోపయోగకరమైన సర్వీసులుగా ప్రకటించబడినాయి.

## మురికి పేటల పరిశీలన

ఆంధ్ర ప్రదేశ్‌లోని మురికిపేటల సాంఘిక, ఆర్థిక స్థితి గతుల పరిశీలనకు సంబంధించిన పథకం వివరాలను రూపొందించడానికి గాను నియమించబడిన ఉప సంఘం చేసిన సిఫార్సులను ప్రభుత్వం ఆమోదించి, ఈ పనికి మూడు సంవత్సరాల వరకు సిబ్బందిని, ఇతర ఖర్చులను మంజూరు చేసింది.

## సంపాదకవర్గం

ఆంధ్ర ప్రదేశ్ జిల్లా గెజెటీర్ల సంపాదకవర్గం అధ్యక్షుడు, ఉపాధ్యక్షుడు, సభ్యులుగా దిగువ పేర్కొన్న వ్యక్తుల నియమకారి 1961 జూన్ లగాయతు మరో రెండు సంవత్సరాల పాటు కొనడానికి ప్రభుత్వం ఉత్తర్వు చేసింది :

| | | |
|---|---|---|
| 1. | శ్రీ ఎం. పురుషోత్తంపాయ్ ఐ. సి. ఎస్., ప్రధాన కార్యదర్శి | అధ్యక్షుడు |
| 2. | శ్రీ ఎం. టి. రాజు, ఐ సి.ఎస్., | ఉపాధ్యక్షుడు |
| 3. | శ్రీ డి. ఎస్. రెడ్డి | సభ్యుడు |
| 4. | శ్రీ ఎస్. గోవిందరాజులు నాయుడు | ,, |
| 5. | శ్రీ డా. మహాదేవ్ | ,, |
| 6. | శ్రీ ఆచార్య ఎం. వెంకటరంగయ్య | ,, |
| 7. | శ్రీ హబీబుర్రహ్మాన్ | ,, |
| 8. | శ్రీ సి. నరసింహం, ఐ. ఏ. ఎస్. | ,, |
| 9. | శ్రీ ఏ. ఆర్. వెంకట్రామన్ | ,, |
| 10. | శ్రీ ఎం. పి. కరియప్ప, ఐ. ఏ. ఎస్. | ,, |
| 11. | శ్రీ ఎం. వెంకట్రామయ్య | ,, |
| 12 | భారత ప్రభుత్వ ఇండియన్ గెజిటీర్ల సంస్థ ఎడిటర్ | ,, |
| 13. | శ్రీ సి. కె. మూర్తి, ఐ. ఏ. ఎస్. కార్యదర్శి | ,, |

## లాటరీలకై అనుమతి

ప్రభుత్వానుమతి లేకుండా అలాగే రొక్క రూపంలోగానీ, వస్తు రూపంలోగాని బహుమతులు పంచే ప్రతిపాదనలు ప్రచురించకుండా, లాటరీ ఆఫీసులు నిర్వహించడం, బహిరంగంగా లాటరీలు నడపడం, చట్టవిరుద్ధమవుతుంది. చట్ట వ్యతిరేకమైన

లాటరీలు నడిపినవారు 1860 వ సం. పు భారత శిక్షాస్మృతి 294ఏ సెక్షన్ననుసరించి శిక్షార్హులవుతారు. యీ రాష్ట్రంలో లాటరీలు నడిపే వ్యక్తులు, సంస్థలు, లాటరీలు నడుపుటకై పొందిన అధికార పత్రాలను వెంట వుంచుకోవల్సిందిగా కోరడమైనది

### కడం ఆనకట

1958 ఆగస్టులో కడం ఆనకట్టకు గండిపడటంతో, దెబ్బ తిన్నంత వరకు పునర్నిర్మించే పని 8000 ఎకరాల భూమికి సరిపడిన నీటిని వదలటానికి వీలయేంత వరకు పూర్తయింది. 1961 జూలై 16 న ఎడమ కాలువ నీటి పారుదల తూములను తెరిచారు. వచ్చే సాగు తరుణానికల్లా మరమ్మత్తుల పని సంపూర్తి అవుతుందని ఆశించబడుతోంది. అంతా పూర్తయితే 6,500 ఎకరాల విస్తీర్ణానికి నీరును వదల వీలవుతుంది.

### రాష్ట్ర శాసన క్రోడీకరణ సంఘం

1961 ఆగస్టు 1వ తేదీనుంచి ప్రభుత్వం ఆంధ్ర ప్రదేశ్ శాసన క్రోడీకరణ సంఘాన్ని ఆరుగురు సభ్యులతో నియమించింది. శ్రీ పి సత్యనారాయణ రావు సంఘం అధ్యక్షుడుగా నియుక్తులయ్యారు. సభ్యుల పేర్లు ఇవి :

1 శ్రీ డి. నరసరాజు, అడ్వొకేటు జనరల్
2. శ్రీ డి. సూర్యనారాయణ స్వామి
3. శ్రీ ఆర్. లక్ష్మీనరసింహ దొర
4 శ్రీ గోపాలరావు ఎక్బోటే
5 శ్రీ ఆర్. బి. రామకృష్ణరాజు

ఆంధ్రప్రదేశ్ లో ప్రస్తుతం అమల్లో నున్న వివిధ శాసనాలను పరిశీలించి వాటి సవరణ మొదలైన వాటికి ఈ సంఘం తగు సూచనలు చేస్తుంది. దీని కార్యస్థానం హైద్రాబాద్ లో వుంటుంది.

### గ్రంధాలయాలు

హైద్రాబాదు జిల్లాలో పనిచేస్తున్న ప్రతి పౌర గ్రంథాలయం యొక్క కార్యదర్శి, 1961 వ సంవత్సరపు ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయాల నియమావళి క్రింద, తను గ్రంథాలయం పేరు, గ్రంథాలయ సభ్యుల పేర్లు, చిరునామాలు తెలుపుతూ, వికారాబాదులోని హైద్రాబాదు జిల్లా స్థానిక గ్రంథాలయ సంస్థ కార్యదర్శికి తక్షణమే స్టేట్ మెంట్లు పంపించాలని హైద్రాబాదు జిల్లా విద్యా శాఖాధికారి ప్రకటిస్తున్నారు. గ్రంథాలయ పాలక వర్గం సభ్యుల పేర్లలో గానీ, చిరునామాలలో గాని ఏమైనా మార్పు వచ్చినట్లయితే మార్పు వచ్చిన 30 రోజుల లోపుగా ఆ విషయాన్ని గ్రంథాలయ కార్యదర్శి స్థానిక గ్రంథాలయ సంస్థకు తెలపాలని కూడా ఆయన తెలియజేస్తున్నారు.



ధర్మంబుఁ బరి జ్ఞానము
నిర్మల మతి నభ్యసించి నృపయనిశంబున్
ధార్మిక సంగతి గలిగినఁ
బేర్మి నుభయ లోకముల నభీష్టత్వ మగున్.

భార-శాంతి

# గ్రంథ సమీక్ష

## నవోదయము

(ఖండ కావ్య సంపుటి)

కవి: అందె వెంకట రాజము

వెల: రెండు రూపాయలు

ప్రతులకు: కోరుట్ల (పోస్టు) కరీంనగర్ జిల్లా, కవిగారి పేర వ్రాయాలి.

ఇది 48 ఖండికల సంపుటి. వివిధ విషయాలమీద పద్యగేయ రూపాలలో ఖండికలు సమకూర్చబడినవి. "ఇది నా తొలి కృతి, నాలో నెలకొనిన నవోదయ స్వర్ణదీధితులలో పొల్చిన భావప్రపంచమును మురిపెముగా వర్ణవిన్యాసముచే దీర్చిదిద్దుకొన్న దృశ్యములే యిందలి ఖండికలు" అని కవి 'మనవి'లో చెప్పుకున్నాడు. గ్రంధాన్ని పూర్తిగా పరిశీలిస్తే వీరికి ప్రబంధ కవిత్వంమీద చాల మోజు వున్నట్లు తెలుస్తున్నది. ఏ ఖండికలో చూచినా ఆ పద్ధతికి సంబంధించిన ఊహలు, ఉత్ప్రేక్షలు, శైలీవిన్యాసం కనిపిస్తూనే వుంటుంది. "అల్లిబిల్లిగ మల్లెమొల్లలల్లిన మాలికల పాలికల ప్రోలికల ధరించె పిల్లగాడ్పులకు నల్లల్ల నాడెడు నచ్చరల పయ్యెదల నెయ్యముల నహించె" నని మబ్బు తునకల వర్ణన. కవిగారు యీ గ్రంధములో ప్రకటించిన ఫోటోలలో కూడ మను చరిత్ర కావ్యం చేతబట్టుకున్నారు. 'పెద్దన్న' అనే ఖండికలో మను చరిత్రను యీ కవి యీ విధంగా ప్రశంసించాడు:

"పాయక యాంధ్రలోకమున భారతభాగవత ద్వయంబు, రామాయణ కావ్యముల్ జదివి యా పయి నీ కృతి రత్నమే శ్రవఃపేయముగా పఠింతురు"–అని.

తొలిరచన కావడం వల్లనే ప్రబంధ రచనా పద్ధతికి యీ కావ్యం ఇంత దగ్గరగా వున్నట్లు తోస్తుంది. దీనికి అనుగుణంగా యీకవి ప్రబంధ పద్ధతులపై ప్రత్యేక పరిశ్రమ చేసిన డా. పల్లా దుర్గయ్య గారిచే పీఠిక వ్రాయించుకోవడం సమంజసంగా వుంది. క్రమంగా తన కవితాసాధన పురోగమించిన కొలది యీ కవిగారు కూడా కాలానుగుణంగా యిప్పటి కవితా రీతులలోకి వస్తాడని ఆశిద్దాం. ఆధునిక కవితా రీతిలోకి ఆయనను హృదయపూర్వకంగా ఆహ్వానిద్దాం.

అటువంటి సూచనలు యీ సంపుటిలో పుష్కలంగా కనిపిస్తూనేవున్నాయి. ఇందులోసుమారు యిరవైవరకు గేయరచనలు. గేయం చేపట్టిన చోటల్లా కవి తన పరిసరాలవైపు తొంగిచూశాడు. లోకంలోని సహజస్థితులమీద వాచ్యంగానో వ్యంగ్యంగానో తీవ్రమైన విమర్శ ప్రారంభించాడు. కవిత మడికట్టుకని జీవితానికి దూరంగా సంచోని వుండకూడదనీ, దానిలోకి ప్రవేశించి సర్వధా పరిశోధించాలనీ నిరూపించాడు అయితే వాటిలో చేయి తిరుగనందున కాబోలు చాలా భాగం పేలవంగా వున్నాయి. "మేము" అనే ఖండికలో నవనాగరికుల మీద హేళనాత్మకమైన విమర్శ విసరివేయబడింది "రమ్మీ" ఆడడం, పుంఖాను పుంఖాలుగా పొగచుట్టలు త్రాగడం, డిటెక్టివులు చదవడం, డంబాలుచెప్పుకోవడం, సినిమాలకు ఎగబడడం వంటి విషయాలు ప్రస్తావించబడినవి. పద్య రచనలో కూడా సీతాకోక చిలుక, విద్యుద్దీపాలు, ఈతచెట్టు పిపీలిక వంటి సామాన్య విషయాలనూ, గొల్లవాడు, వడ్డెవాడు, దారిద్ర్యము, ముసలి అవ్వ, తాతవంటి సామాన్య మానవులనూ కథా వస్తువులు చేసుకుని కవిత్వం నడిపించాడు. పద్య రచన కవసరమైన ధారాశుద్ధి యీ కవికి పుష్కలంగా వుంది. పద్యం కుంటుపడకుండా ఎంతదూరమైనా నడిపించగలడు. ఈ కావ్యంలో చేర్చిన ఖండికలన్నింటిలోకి "చిట్టితండ్రి" అనే ఖండిక మనోజ్ఞంగా వుంది. ఇది శిశువును గురించి. "సంసార జలధి నీ సరణి దాటెదనంచు గిరిపాదముల బిట్టుగా గదల్చు" వంటి సమర్ధనలు చక్కగా వున్నాయి. శిశువు సహజంగా చేసే చేతలకు మనోహర

మైన అర్థం కల్పించబడింది ఈ ఖండిక "బొటవ్రేల ముల్లోక ములు చూచి లోలోన గానందపడు నోరులేని యోగి" అని శిశువును గురించిన జాషువాగారి రచనతో సమాన స్థాయిలో వుంది అదేవిధంగా "లేకబ్రదుకు" అనే ఖండికలో ఒక ముదుసలి అవ్వ పొలంలోకి వచ్చింది. అప్పటికే రైతులు కోతకోసి నూర్చిన ధాన్యం బండ్లపై కెత్తి యిండ్లకు తీసుకుపోయారు. ఆయాసపడుతూ వచ్చి ఆ అవ్వ అక్కడ రాలిన ధాన్యపు గింజలను ఏరుకుంటూ మన కవిగారి కంటబడింది. ఆమె "ఎవ్వరికి కాంక్షలేని యీ యింత దాని పట్టుదలతోడ బంగారుపగిది కూర్చు" కుంటుంది. "చిల్లిగంపయు, చింపిరి చీపురులును, పేలికల ముల్లె" యివి ఆమెకున్న ఆస్తి "చేతనైనంతమట్టుకార్జించుకొనుచు కలియొగంజియోత్రాగు" నామె కలిమిని కవి ఘనంగా ప్రస్తుతిస్తాడు. "పరితాపము" అనే ఖండికలో పంజరంలో చిక్కుకు పోయిన రామచిలుక స్వేచ్ఛ కోసం పరితపిస్తున్నట్లు కవి చిత్రించాడు. కొనకొమ్మల మీద వూగుతూ కుహుకుహుకు కోకిలా నాదలహరులలో తేలియాడుటకు, కొత్త కొత్త పండ్లు చవిచూసి పరవశమగుటకు. "ఎదబొంగరిజదలం గనదభంగ కాంతులన్ బంతాల రొదలతో పాడు"టకు ఆ రామచిలుక పడు ఆవేదన యింతని చెప్పటానికి సాధ్యం కాదు. "నవోదయము" అనే ఖండికలో కవి కళలు ప్రయోజనాత్మకములని సూచించాడు. "రాత్రి జాబిల్లి కళలలో రక్తి జూపి, కళలు కళలకోసమెయన గాదు మరి ప్రయోజనము గలదనగ జ్ఞానోదయమ్ము తనరెననగ భానూదయమ్మొనరెపిగుల." అందులోనే, "మొదట్లో కొద్దిగానే కదా అని తుంగమహీధరపాళి, ద్రుమాళి, సౌధాగ్రముల వంటి ఎత్తయిన వాటికి రవి బంగరు పూత పూశాడు. కాని చూస్తే ధరణీతలం అపారంగా వుంది. ఖర్చు ఎక్కువవుతుందని తరువాత ఆయన వెండి పూత పూయడం ప్రారంభించాడనే" ఊహ రమ్యంగా వుంది.

ఈ కవికి ఆంధ్రాభిమానము మెండు. బజారులో కనిపించే బోర్డుల మీద వున్న తప్పుడు తెలుగు ఆయనను చీకాకు పరిచింది. "పలక బల్లల మీద తెలుగాంగ్లము విధాన నొక తప్పు లేకుండ నొప్పుచెపుడొ"! రాచకార్యములందు రమ్యాంధ్ర భాషామ తల్లి తాండవమాడు తరుణమెపుడొ! తాలూకా స్థాయిలో రాష్ట్రిమంతటా రాచకార్యములకు ప్రభుత్వం యిటీవలనే తెలుగును ప్రవేశ పెట్టడం ద్వారా యీ కవిగారి ఆశయం చాలావరకు ఫలించింది. ఈ కవి సంఘ సంస్కరణాభిలాషి 'ఒడ్డెవాడు' అనే ఖండికలో మద్యపానమువలదని తన నాయకునికి బోధించాడు. "కాయము పుండుచేసికొని కష్టములోర్చి గడించుకొన్న యాదాయము పాడు నీళ్లకయి దండుగవోసి మతి భ్రమంబునన్ హాయి యటంచురే గుదు" పవి పాపోతాడు.

సామాన్య కథావస్తువులతో పాటు ఆంధ్రావతరణము, శ్రీరామచంద్రుడు, బాలచంద్రుడు, మహర్షి దయానంద సరస్వతి, వీరేశలింగంపంతులు వంటి సంప్రదాయసిద్ధంగా ఉదాత్తమైన విషయాలను కూడా యీకవి చక్కగానిర్వహించాడు. 'గురుదేవుడు' "మహాకవి దైన్యము" అనుఖండికలలో తన గురువైన అభినవ పోతన బిరుదాంచితులు శ్రీవానమామలై వరదాచార్యుల వారిని గురించి వ్రాసి తన గురుభక్తి వెల్లడించుకున్నాడు. ఈ గ్రంథం శ్రీఆచార్యులవారికి అంకితం చేయబడింది. ఆయన ఫొటోగూడా దీనిలో ముద్రించబడింది. "వీరికవిత్వము ప్రతిభావ్యుత్పత్తుల కాలవాలమై, సరసత్వసంపదలకాకరమై తేజఃకాంతి ప్రసాద మాధుర్యగుణ శోభితమై వైదర్భీరీతి నొప్పుననను నితర కవి పండితుల యభిప్రాయముతో" కృతిభర్త శ్రీ ఆచార్యులవారు ఏకీభవించారు

'కులపతి'

## ఎదురు ప్రశ్నలు

### ( కథలు )

రచన : పోతుకూచి సాంబశివరావు, ప్రతులకు ; ఆంధ్ర విశ్వసాహితి, 208, బోయిగూడ, సికింద్రాబాదు.

పుటలు : 130 వెల రూపాయన్నర

కథకుడుగా, నవలారచయితగా, నాటకకర్తగా తెలుగు పత్రికా పరితలకు సుపరిచితుడైన శ్రీ పోతుకూచి సాంబశివరావు లేఖిని నుంచి వెలువడిన కథల సంకలనం ఇది. (1) ఎదురు ప్రశ్నలు (2) పెళ్ళిభయం, (3) మతిమాలిన వైద్యం, (4) హత్యా ఆత్మ హత్యా!, (5) మంచివాడి చెడ్డతనం, (6) రసికశ్రీ, (7) మారిన స్నేహం, (8) పాప ఫలం, (9) గోదావరి గట్టుమీద అనే తొమ్మిది కథలు ఈ సంపుటంలో చేర్చబడ్డాయి. ఈ కథలన్నీ కూడా ఇదివరలో వివిధ పత్రికలలో ప్రకటితమైనవే.

ఆధునిక కాల్పనిక సాహిత్య శాఖలన్నింటిలోకీ కథానికా ప్రక్రియ విశేషంగా ప్రచారంలోకి వచ్చిన సంగతి అందరికీ తెలిసిందే. కథా వాఙ్మయం ఇంతగా పెంపొందడానికి కారణం కొందరు అభిప్రాయపడుతున్నట్టు కొంచెం ఊహా శక్తి కలిగి, కొద్దిగా వ్రాయనేర్చిన ప్రతివారికీ కథారచన సులభ సాధ్యం

కావడమే అయినప్పటికీ ఈ సాహితీ ప్రక్రియ వికాసానికి ఇదొక్కటి మాత్రమే హేతువు కాదు.

వివిధ సారస్వత శాఖలలో సామాన్య పాఠకుడు కూడా సులభంగా చదివి అర్థం చేసుకొనగలిగేది వచన సాహిత్యాన్నే. కాగా వచన వాఙ్మయంలో కూడా కథా సాహిత్యం వీరికి మరీ సన్నిహితమైనది. చదువు వారికి విసుగుపట్టని విధంగా క్లుప్తమైన కథాంశంతో సంక్షిప్తంగా వుంటుంది కథ. కనుకనే ఈ ప్రక్రియ బాగా ప్రాచుర్యం పొందింది. కాబట్టి ఇది కూడా ఈనాడు కథా వాఙ్మయం ఇంతగా అభివృద్ధి చెందడానికి ఒక కారణమే.

సమకాలీన సమాజ పరిస్థితులను ప్రతిఫలింపజేసినప్పుడే కథయొక్క ప్రయోజనం సిద్ధిస్తుంది. అటువంటి కథలే పాఠకుల మన్ననలు పొందగలుగుతాయి.

ఇప్పుడు తెలుగులో వస్తున్న వందలాది కథలలో ఈ కోవకు జెందినవి ఎన్ని వుంటున్నాయి అని ప్రశ్నించుకున్నప్పుడు మనకు లభించే సమాధానం నిరాశ కలిగిస్తుంది నేడు వస్తున్న కథలు చదువుతున్నప్పుడు కథకులలో కళా దృష్టి, చిత్త శుద్ధి కంటే కాల వేగంతో పోటీ పడాలన్న తాపత్రయం ఎక్కువగా వున్నట్టు గోచరిస్తుంది. అయితే తెలుగు కథా సాహిత్యానికి ఉజ్వల భవిష్యత్తు కలదనే ఆశాభావాన్ని కలిగించే సమర్థులైన కథకులు కొందరైనా లేకపోలేదు. ఉత్తమమైన కథలు వ్రాయడానికి యథాశక్తి ప్రయత్నిస్తున్న రచయితలలో శ్రీ పోతుకూచి ఒకరు

రామం అనే అబ్బాయి పనిమీద అమలాపురం వెళ్తూ మార్గంలో స్టీమరు తప్పిపోవడం వల్ల రాజమండ్రిలో ఆగిపోతాడు. ఆ ఊళ్ళో తన బాబాయి కుటుంబం, మేనత్త వుంటున్న సంగతి జ్ఞప్తికి వచ్చి అక్కడికి వెళ్ళాలనుకొని బాబాయి ఇల్లు కనుక్కోవడానికి ప్రయత్నించి విఫలుడై చివరకు ఏదో వీధి అరుగుమీద గడిపి మర్నాడు ఉదయం స్టీమరు ఎక్కడానికి గోదావరి గట్టుకు వెళ్తాడు. అక్కడ స్నానాల రేవులో వాడికి బాబాయి కనిపించగా ఆనందంతో ఉప్పొంగిపోతాడు. ఆయన స్నానం, జపం ముగించుకునే వరకు గట్టున వేచివుండి ఇంటికి బయలుదేరాక ఎదురుబడి పలకరిస్తాడు కాని ఆయన ఏమీ ఎరుగనట్టు, "ఎవరు నువ్వు" అని ప్రశ్నిస్తాడు. బాబాయి ప్రవర్తనకు అవమానంతో, అభిమానంతో కృంగిపోయిన రామం వెనక్కు తిరిగి స్టీమరు ఎక్కేస్తాడు. తిరుగు ప్రయాణంలో వాడికి మార్గంలో తలవని తలంపుగా పిన్ని, మేనత్త కలిసి బలవంతాన ఇంటికి తీసుకెళ్తారు. ఎండలో ప్రయాణం చేసి వచ్చిన రామంకు పిన్ని చలిది అన్నం వడ్డిస్తుంది. దానితో వాడికి జ్వరం వచ్చి, వ్యాధి ముదిరి మరణిస్తాడు. సంధి ప్రలాపనలో రామం "ఎవరు నువ్వు" అంటూ వేసిన వెర్రి కేకలు బాబాయి హృదయానికి శూలాల్లా గ్రుచ్చుకొని క్షోభపెడతాయి — ఇదీ ఈ సంపుటిలోని మొదటి కథ మేడిపండును పోలిన ఆత్మీయతను ఆప్యాయతను ఇందులో రచయిత చవిచూపారు.

"ఆడది రాక్షసి. మగవారిని తన విలాసం, ఆనందంకోసం ఆటబొమ్మను చేసి ఆడించి, తన సరదాలు తీరాక అతనిని గడ్డి పరకగా చూస్తుంది", అంటారు రచయిత. రెండవ కథ "పెళ్ళి భయం" లో ఒకచోట ఇందులోని స్త్రీ పాత్రలన్నింటిని ఇలాంటి భావాలు కలిగించేవిగా, పెళ్ళంటే భయం పుట్టించేవిగా రచయిత చిత్రించారు. ఈ కథ చదివిన వారికి ఇవి సమంజసమైన అభిప్రాయాలేనాఅన్న సంశయం మాత్రం కలుగుతుంది. ఈ స్వభావానికి పూర్తిగా భిన్నమైన స్త్రీ పాత్రను రచయిత చివరికథ—గోదావరి గట్టుమీద—లో ప్రవేశపెట్టారు. రెండవ కథలో స్త్రీ పాత్రలకు ఆపాదించిన గుణదోషాలను ఇందులో ఒక పురుషునిలో చూపుతారు రచయిత. బహుశా ఆయన దృష్టిలో స్త్రీ పురుషులు ఉభయులూ అలాంటివారేనేమో.

ఈ సంకలనంలోని ఇతర ఆకర్షణీయమైన కథలు: "మతి మాలిన వైద్యం", "హత్యా? ఆత్మహత్యా!", "మంచివాని చెడ్డతనం". ఈ మూడు కథలు మూడు రకాల సమస్యలను స్పృశిస్తాయి. మొదటి కథలోని గోపాల్ పాత్ర చిరకాలం జ్ఞాపకం వుండేదిగా వుంది. రెండవ కథలో రచయిత సస్పెన్స్ చక్కగా పోషించారు. దీనిలో రామనరసుకు పెంపుడుతల్లితో అక్రమ సంబంధం వున్నట్లు చిత్రించడం అసందర్భంగా వుంది. ఆఖరు కథ పాఠకులకు హాయిని గొలుపుతుంది.

'రసిక శ్రీ"— ఈ పేరు వింటుంటే కలుగుతున్న బాధ దీన్ని ఈ సంకలనంలో చేర్చినందువల్ల కూడా కలుగుతున్నది. ఇది హాస్యప్రధానమైనరచన. రచన మొదట్లో బాగానే వున్నా పోను పోను స్థాయి దిగజారింది. కొన్ని కొన్నిచోట్ల రచనా భావాలు మరీ తేలిగ్గా వున్నాయి. ఈ రచయిత హాస్యరచనలు చెయ్యడం మంచిది కాదన్న అభిప్రాయాన్ని ఈ కథ కలిగిస్తుంది.

పోతే, "మారిన స్నేహం" చాలా సహజంగా వుంది.

ఈ కథలోని రామారావు రంగారావు లాంటి నేస్తగాళ్లు నేడు సమాజంలో కొల్లలుగా కనిపిస్తారు. ఇటువంటి వంచకుల ఆటలు కట్టించడానికి ఇందులో రచయిత చూపిన మార్గం సహజంగా వుంది.

"పాపఫలం" కథ బాగానే వున్నా కథానాయకుడు శేఖరం చివర్లో గ్రుడ్డివాడై పోవడం సినిమా టెక్నిక్‌లాగుంది.

ఏమైనప్పటికీ ఈ తొమ్మిది కథల్లోనూ పాఠకులను చివరి వరకూ చదివింపజేసే ఆకర్షణ వుంది. ఈ కథల్లోని కొన్ని వాక్యాలు పాఠకులకు రచయితపై ప్రత్యేకాభిమానాన్ని కలిగించేవిగా వున్నాయి. ఉదాహరణకు :

"అతని నిశ్చయానికి జేజేలు కొడుతున్నట్టు పెద్దపెద్ద కూతలు కూసుకుంటూ గోదావరి నీళ్ళను చీల్చుకుంటూ స్టీమరు రివ్వున పరుగెత్తింది."

"జ్వరాలతో, నీరసాలతో, కళ్ళ రోగాలతో, పళ్ళ బాధలతో, మతిభ్రష్టత్వంతో కుమిలిపోతున్న జనప్రవాహాన్ని ఆ ఆసుపత్రి ఒక ఆనకట్టలా అడ్డుకున్నట్టు కన్పిస్తుంది."

శ్రీ అబ్బూరి గోపాలకృష్ణ వేసిన ముఖచిత్రం ఈ పుస్తకానికి ప్రత్యేకాకర్షణ చేకూర్చింది.

—జ.రా.

## గడ్డురోజులు

(నవల)

కొడవటిగంటి కుటుంబరావు

వెల: రూ. 1-50

ప్రతులకు:- యువ బుక్స్, సైఫాబాదు,

హైద్రాబాదు.

చిన్న కథ ఒక్క సంఘటనను సమగ్రంగా చిత్రిస్తే, నవల ఒక జీవితాన్ని సమగ్రంగా చిత్రిస్తుంది. చిన్నకథ (కథానిక)కు, చిత్రించిన సంఘటన ముందు వెనుకలూ, పాత్రల సంభాషణా, ఔచిత్యమూ, కథ చెప్పే విధానమూ ఏవిధంగా అవసరమో, నవలలో పాత్రల మనస్తత్వ చిత్రణా, సంఘర్షణా, వీట్ల పరిణామమూ, ఆ పరిణామం వల్ల పాత్రలలో కలిగిన మార్పూ, వీట్లన్నిటి వెనకా ప్రతిబింబించ బడ్డ సమకాలీన జీవితమూ, అంతే అవసరమౌతాయి. కనుకనే చిన్న కథకు కథ చెప్పే విధానమూ, శిల్పమూ ముఖ్యం. నవలకు వివరణా, స్పష్టతా అవసరం

"గడ్డు రోజులు" కొడవటిగంటి కుటుంబరావు కలంలోంచి వెలువడ్డ మరో నవల. కుటుంబరావుకు నవల మీదా జీవితం మీదా, సమాజం మీద స్పష్టమైన అభిప్రాయాలున్నాయి. ఆ అభిప్రాయాలు హఠాత్తుగా ఊడి పడ్డవి కావు. హేతువాదానికి నిలబడగలిగేవి. ఆయన చిత్రించిన పాత్రలు బొమ్మలు కావు జీవిత ప్రతిబింబాలు. అవన్నీ మనలో, మనతో తారట్లాడుతూ, మన అనుభూతుల్ని పంచుకుంటూ, ప్రశ్నిస్తూ తిరుగుతాయి "నువ్వు యిట్లా చెయ్యి" అని శాసించవు. అట్లా చేస్తే యీ విధమైన పరిణామాలు వస్తాయని మాత్రం సూచించేటట్టుగా ఉంటాయి. మళ్ళా అట్లాగని జీవితం మీద అభిప్రాయాలు గాని, పాత్రల మనస్తత్వాల్నిగూర్చి చెప్పకపోవడంగాని ఉండదు. కుటుంబరావు సృష్టించిన పాత్రలు జీవితంలోవి కావటం వల్ల అవి మనముందు పెరుగుతాయి. రచయిత పెరగనిస్తాడు కాబట్టి.

సత్యం ఒక చదువుకున్న నిరుద్యోగి- డిప్రెషన్ రోజుల్లో. పాతిక రూపాయలతో సంసారం వెళ్ళబుచ్చ గలిగే రోజులవి. కాని ఆ పాతిక దొరకటమే కష్టమయ్యేది. అతనికి చదువుతో బాటు కొన్ని అలవాట్లూ, కొన్ని అభిప్రాయాలూ ఉన్నాయి. ఏర్పడ లేదు అందరి లాగానే సత్యంకూడా, ఉంటూన్న వ్యవస్థకు వారసుడు అసమర్థతా, అసంతృప్తీ, దురభిమానం యీ మూడు ఏదో ఒకవేళలో అతని జీవితంలోకి తొంగి చూస్తూనే ఉంటాయి. మొదట ప్రెస్సులో ప్రూఫులు దిద్దటానికి ఒప్పుకుంటాడు, తనకు చేతకాక పోయినా, చేతనైన వాళ్ళున్నారని తెలిసినా. తర్వాత మాష్టరు ఉద్యోగం చేస్తాడు. అది వదలిన తరువాత పత్రికలో పని చేస్తాడు. పని చేస్తున్నా అసంతృప్తే. ఏదో తను అనుకున్నట్టు జరగటం లేదనే బాధ. సరిగ్గా జరగటం అంటే ఏమిటో స్పష్టమైన అభిప్రాయం తనకు లేదు. తనకు ఉద్యోగాలు యిచ్చిన నారాయణ శాస్త్రీ, ఆంజనేయులూ - వీళ్ళిద్దరూ మర్యాదగానే ప్రవర్తించారు. సత్యంలో లేనిది ఏదో వాళ్ళల్లో ఉంది. అదే వాళ్ళకు నాల్గురాళ్ళు సంపాదించి పెట్టి, సమాజంలో పరువుగల వ్యక్తుల్లాగ నిలబడేటట్లు చేస్తోంది. నరసింహంకూడా తనకు ఉద్యోగమిచ్చాడు. కాని నరసింహం వేరు. తన పని జరగటం కోసం మనుష్యుల్ని చేరదీస్తాడు డబ్బుతో ప్రతీదీ కొనడానికి ప్రయత్నిస్తాడు. ఉచ్చుపేసి వస్తువుల్ని తెచ్చుకోవటం తెలుసు. అంతకు ముందుదాకా మెడికల్ స్టోర్సు పనిచూసినందుకు కొంత ముట్ట

జెబితే, తరువాత నాటకం కంపెనీ పనిచూసినందుకు కొంత యిచ్చే వాడు. చివరికి మాటా మాటా వచ్చి ఆ ఉద్యోగమూ ఊడి పోతుంది. కాని యీసారి నాటకాలలో అనుభవం పెరుగుతుంది. ఎటువంటి నాటకాలు తెరకి పనికివస్తాయీ రావూ అన్నది తెలుసు కుంటాడు తన రచనలని ఆ రీతిగా మార్చుకోవడానికి ప్రయత్ని స్తాడు. నాటకాలతో బాటు జీవితాన్ని గూడా సరిదిద్దు కోవడానికి ప్రయత్నిస్తాడు. నిప్పులాంటి పాతివ్రత్యంగల భార్య జానకి తనకి ఒకప్పుడు "కవచం"లా ఉన్నా, మిగతా వేళల్లో ఒక బరువుగానూ మారుతుంది, నాటకంలో వేషంవేసి తనతో ఎక్కువ పరిచయం లేని హైమవతి, సత్యానికి ఒక బాట కల్పించ డానికి, జీవితాన్ని వెదుక్కోవడానికీ తోడ్పడుతుంది.

సత్యం పాత్ర తర్వాత వ్యక్తిత్వం గల పాత్ర హైమవతిది. సత్యం పాత్రకు ఆంజనేయులు సంఘర్షణ అయితే జానకికీ హైమవతికీ సంఘర్షణ ఈ సంఘర్షణలో మనకు సాన పట్టిన వజ్రాల్లాంటి జీవిత సత్యాల్ని ప్రవచిస్తాడు రచయిత.

జానకి భర్తకోసం అభిమానాన్ని చంపుకోగలదు బాధ పడగలదు. వ్యక్తపరచకుండా లోలోపలే కుమిలిపోగలదు. అజ్ఞానం మరీమీరి పోయినప్పుడు ఉద్రేకంతో అపార్థం చేసుకో గలదు. కాని హైమవతి భర్తకు దూరంగా ఉన్నా వ్యక్తిత్వం ఉండి తనస్థానాన్ని తాను ఎరిగినస్త్రీ. తన సానుభూతిని శుష్కంగా కన్నీటిద్వారా కాకుండా తోచినదేమిటో చెయ్యడంద్వారా వ్యక్త పరుస్తుంది. ఒక్కమాటలో చెప్పాలంటే హైమవతికి బతకడం తెలుసు. భర్తకొక భారంగానే కాకుండా ఆసట బాసటగా ప్రక్కన నిలబడగలిగే వ్యక్తి హైమవతి, జానకిలాంటిస్త్రీలు తమ భర్తలను పూజిస్తూనో, అనుకునో అనుకోకనో బాధిస్తూనో బతకగలరు.

సత్యమూ, ఆంజనేయులూ ఒకే వయస్సువాళ్ళు ఇంచు మించు ఒకేరకంగా చదువుకున్నవాళ్ళు, ఉన్న అవకాశాలను ఉపయోగించుకొని ఆంజనేయులు పురోగమిస్తాడు, సత్యం మాత్రం ఉన్నచోటే ఉంటూ అందని లక్ష్యాలకోసం, పూర్తిగా తనకు అర్థంకాని లక్ష్యాలకోసం ప్రస్తుతాన్ని జారవిడుచుకుంటాడు మొదట్లో.

"ఆంజనేయులు ఒక చిన్న తెప్పను ఆశ్రయించి జీవిత ప్రవాహంలో ప్రవేశించినమాట నిజమే గాని అతని గమ్యం ఉదాత్తమైనదిగా కనిపించలేదు

జీవితం అశాశ్వతంగా ఉన్నతరుణంలో శాశ్వతసంధాలు నిర్మించుకోరాదు. ప్రస్తుతం తాను చైతన్యరాహిత్యం అనుభవిస్తూ న్నప్పటికీ ఆంజనేయులు లాంటి వాళ్ళ లక్ష్యం కంటె తనదిచాలా పెద్దదని అతను తెలుసుకున్నాడు"

కళయొక్క ప్రయోజనమూ, రచయితకు సమాజంలో ఉన్నబాధ్యతా, విశిష్టతా నవలలో కొట్టొచ్చినట్లు కనిపిస్తుంది. కళ కేవలం వినోదం కోసం కాదనీ, రచయిత కేవలం బఫూన్ గామారి పోగూడదనీ, సామాజిక జీవితాన్ని పరోక్షంగా సరిదిద్ద వలసిన అవసరాన్ని రచయిత గుర్తించాలనీ ఉద్బోధిస్తాడు.

"జీవితంకంటె కళ శక్తివంతమైనది; సందేహం ఏమీ లేదు.......కళద్వారా సమాజాన్ని నిజంగానే రెచ్చగొట్టవచ్చు. అట్లారెచ్చగొట్టిన వాళ్ళుకూడా ఉన్నారు–డికెన్స్! మనదేశంలో కూడా ఉండే ఉంటారు–అవును. వీరేశలింగం! "...తనరచనల్లో మనస్సులను సంస్కరించే లక్షణాలు ఉండితీరాలన్న భావం సత్యానికి తెలియకుండానే అతని మనస్సులో పడిపోయింది.

ఇవి రచయిత అభిప్రాయాలు. పాఠకుడిలో సూటిగా గుచ్చుకుపోతాయి. కాని యీ విషయాలని చెప్పేటప్పుడు ఒక్కొక్కసారి వ్యాసకర్తగా మారిపోతాడు.

కుటుంబరావుకు ఒక ప్రత్యేకమైన శైలిఉంది. దీనికి నిదర్శనంగా ఎక్కడనుంచైనా కొన్నిలైన్లు ఏరితే 'యివి కొడ వటిగంటివి' అని యిట్టేపట్టెయ్యచ్చును.

ఏదిచెప్పినా జీవితాన్ని కాచి వడపోసినట్లు చెబుతాడు.

"జీవితంలో హైరోడ్లు లేవు; చెట్టుకొమ్మలాగ జీవిత మార్గాలు కొద్దిదూరం వెళ్ళినాక రెండు విరుద్ధ మార్గాలుగా చీలి పోతాయి. ఇందులో మనిషి ఏమార్గం తీసుకుంటాడనేది నిర్ణయించ డానికి చాలాకారణాంతరాలుంటై."

"మనిషికి ఉన్నప్రతిశక్తీ ఒక బాధ్యతకూడా..."

సమకాలీన జీవితాన్ని చిత్రిస్తూ, రాబోయే రోజుల్లో మనిషిస్వరూపం నిర్ణయించడం రచయిత కర్తవ్యం.

ఆర్థికమాంద్యంలో యిరుక్కుని, ఆశయాలకూ ఆదర్శాలకు మధ్య సంఘర్షణలో నలిగిపోతూ, తన లక్ష్య మేమిటో తనకే తెలియకుండగా పడుతూ, లేస్తూ, దారితడుముకుంటూ దారిలో పడుతున్న మనిషి సత్యం.

ఆవేశంతోనూ, మూఢభక్తితోనూ సతమతమైపోతూ

జీవితమనే మరగానుగలో నలిగిపోతూ నిస్సహాయంగా భర్తకు భారంగా ఉంటూన్న జానకి, తనకొక వ్యక్తిత్వాన్ని కూర్చుకునే ప్రయత్నం చేస్తుంది.

కాని యీ పాత్రలు ఒకేసారి యిట్లామారిపోవు. క్రమ క్రమంగా, దెబ్బలు తగులుతూన్నకొద్దీ, తెలుసుకుంటూ జీవితంతో బాటు పెరుగుతాయి.

'గడ్డురోజులు' 1930-40మధ్యన ఉన్న ఆర్థిక మాంద్యాన్ని చక్కగా చిత్రించింది. మనిషి విలువల్ని డబ్బు ఏ విధంగా మారుస్తుందో విశదీకరించింది. కొడవటిగంటి మధ్య తరగతి వాళ్ళ జీవితాన్ని ఎంతో వాస్తవికంగా చిత్రించారు ఈ నవలలో.

ఇంతమంచి పుస్తకంలోనూ "ఎవరో తోసినట్టుగా సత్యం శృంగారం చేసాడు" లాటివి ఉండకుండా ఉంటే బాగుండేది.

'గెటప్' చాలా బాగుంది. 'రేఖ' కవరు పేజీ చిత్రం పుస్తకానికి ఎంతో శోభగా వుంది

## బిల్వమంగళీయము

(పద్యకావ్యము)

గ్రంథకర్త : మధురకవి అనిపిండివరాహ నరసింహమూర్తి, డెమీఆక్టెవో 76 పుటలు; వెల రెండు రూపాయలు; ప్రతులకు గ్రంథకర్తపేర పి. డబ్లు.ఐ. ఆఫీసు, బారాదౌర్ పోస్టు, బిలాస్‌పూర్ జిల్లా, మధ్యప్రదేశ్ అని వ్రాయవలెను.

లీలాశుకయోగీంద్రుని కృష్ణ కర్ణామృతము, జగత్ప్రసిద్ధ సంస్కృతస్తోత్ర కావ్యము, ఈతడును భర్తృహరివలెనే ఎంత రక్తుడోఅంత భక్తుడుకూడ. లీలాశుకునకు కృష్ణావతారమనిన ఎంతో ప్రీతి. అతనికికల్గిన కృష్ణపరమాత్మ సాక్షాత్కారము 'వేణీమూలే' అను శ్లోకమున చక్కగా వర్ణించినాడు. ఆ లీలాశుకుని చరిత్రమే ఈ బిల్వమంగళీయము. బిల్వమంగళుడు సదాచారసంపన్నుడు, అతడు చింతామణియను వేశ్యమోహములో పడి అన్నిటిని మరచి తన తండ్రిని, భార్యనుకూడ కోల్పోయెను. చివరకు చింతామణియే అతనికి జ్ఞానోదయము కల్గించినది. అందులకే, చింతామణిర్జయతి సోమగిరిర్గురుర్మేశిక్షాగురుశ్చమేశిఖిపింఛమౌళిః" అని కావ్యాదిని పేర్కొనినాడు. అజ్ఞానోదయమయిన పిదప కూడ ఒక సుందరమైన కాంతను చూచి భ్రమించిన కారణమున తన కన్నుల నూడ పెరికి, ఒక గొల్లపిల్లవాని సహాయమున బృందావనము చేరెను. ఆ గొల్లపిల్లవాడెవడో కాదు — గోపవేషమూనిన మురళీ కృష్ణుడే. అప్పుడతనికి సాక్షాత్కరించిన బృందావన విహారిని 300 శ్లోకములలో వర్ణించి లీలాశుకయోగీంద్రుడయ్యెను.

బిల్వమంగళీయము మూడుస్తబకముల నిర్వచన కావ్యము. ఇందు బిల్వమంగళుని చరిత్ర ఆమూలాగ్రముగ వర్ణింప బడినది. బిల్వమంగళునకు సూరదాసు అను పేరు కూడ కలదని యీ కావ్యము వలన తెలియ వచ్చుచున్నది. పలువురు పండితులు, కవులు ఈ కావ్యమునకు అభిప్రాయముల నిచ్చినారు. అందు ఈ కవి శైలిలో పురాణ కవులశైలి కన్పించుచున్నదనినారు శ్రీఅనిపిండి వరాహ నరసింహమూర్తిగారిశైలి స్వతంత్రమైనది నిర్గళమైనధార, ప్రసాదగుణముతో నలరారుచున్నది. చదువగానే హృదయమునకు హత్తుకొనును.

"రసముల్ చిప్పిల ప్రాజ్ఞసత్కవిబుధేంద్రశ్రేణి, మేల్మేలనన్
విసుగుంజెందనియట్టిధోరణిని, మార్ద్వీకసంపత్తి పెం
పెసగన్ సర్వరసజ్ఞ సమ్మతముగావింపంగ"

యత్నించి కృతకృత్యులైనారు గ్రంథకర్తలు, వీరు వయసున పిన్నలయ్యును కవితావ్యాసంగమున మిన్నలు. ప్రాచీనాలంకారిక లక్షణములకనుగుణముగానే ఈ కావ్యము వ్రాయబడినది. "మనమూ హీహీలపాల్గొనుమా" అనుమకుటములో బిల్వమంగళుని పలిచే వనమును కొన్ని పద్యములను వ్రాసినారు. ఇయ్యవి "మనమూవచ్చి కనాదుమాట వినుమా మర్యాద గాపాడుమా' యనుమకుటమున చెళ్లపిళ్లవారు వ్రాసిన పద్యములు జ్ఞప్తికి దెచ్చుచున్నవి. ఏ తత్కావ్యకర్తలు కీ॥ శే॥ ఆకుండి వ్యాసమూర్తిగారి అంతేవాసులు. లీలాశుకునకు సాక్షాత్కరించిన పరబ్రహ్మమువేరు. వీరు వర్ణించిన కృష్ణసాక్షాత్కారము మూడవస్తబకములో 108వ పద్యములో సుబోధముగా వర్ణించినారు, కావ్యజీవనులైన వారు తప్పక చదువ వలసిన గ్రంథము.

## శ్రీనాథకవితా సమీక్ష

గ్రంథకర్త చిలుకూరి పాపయ్య శాస్త్రి. క్రౌన్ ఆక్టెవో 274 పుటలు, వెల నాల్గు రూపాయలు. ప్రతులకు ఆకెళ్ళశేషశాస్త్రి, రామారావుపేట, కాకినాడ, తూర్పు గోదావరి జిల్లా అని వ్రాయవలెను.

"నిరాశ్రయా న శోభంతేపండితావనితాలతా"అని ఆర్యోక్తి. అట్లే శ్రీనాథుని ప్రాశస్త్య ప్రకాశమునకు కారణభూతులు అతనిని పోషించిన రెడ్డి రాజులు. అందు వలననే శ్రీనాథుని కవితా సమీక్ష, రెడ్డి రాజుల చరిత్రము అని యీ పుస్తకమునకు రెండు పేర్లు

న్నవి. ఇంతకు పూర్వము శ్రీ చిలుకూరి పాపయ్య శాస్త్రిగారు వ్రాసిన శ్రీనాథుడు శృంగారియా అను గ్రంథమున అతని కవితా సమీక్ష కెక్కువ ప్రాముఖ్య మివ్వబడినది. ప్రకృత గ్రంథమున శ్రీనాథుని పోషించిన, రెడ్డి రాజుల రాజ్యపాలన, వారి పాండిత్యము, వారి జీవిత విశేషములను విపులముగా తెలిపినారు, శ్రీనాథుని పోషించిన రెడ్డి రాజులు కూడ పండితులు కాటయవేముడు కాళిదాసనాటక త్రయమునకు వ్యాఖ్యానములను రచించినాడు ముప్పది రెండు ప్రకరణములలో రెడ్డి రాజుల చరిత్రము విపులముగా జర్చింప పడినది అంతేగాక అనుబంధముగా ప్రకటింపబడిన రెడ్డి రాజులకు సంబంధించిన శాసనములు నాల్గు చారిత్రక గవేషణపరుల కుపయుక్తముకాగలవు. శ్రీ పాపయ్య శాస్త్రిగారు ఎంతో కాలమునుండి శ్రీనాథుని సాహిత్య యుగముపై గవేషణ చేయుచున్నారు, శ్రీనాథుడభిమాన కవియైన వారికిదియవశ్య పఠనీయము.

## వైద్య దర్శిని

గ్రంథకర్త: డా. అరిశే వేంకటేశ్వర్లు—క్రౌన్ ఆక్టేవో 67 పుటలు. వెల రెండు రూపాయలు. ప్రతులకు గ్రంథకర్త పేర, రాజా నర్సింగ్‌హోమ్. పెదకళ్లేపల్లి పోస్టు, వయా మోపిదేవి, కృష్ణా జిల్లా అని వ్రాయవలెను.

గ్రంథకర్తలు పోస్టు ద్వారా లండన్‌లోని ఒక కళాశాల నుండి పోస్టల్ ట్యూషను పొంది తద్వారా కలిగిన విజ్ఞానమును గ్రామస్థుల కుపయుక్తమగునట్లు వ్రాసిన చిన్న పుస్తకమిది. దీనిలో సర్వసామాన్యముగ మనకు వచ్చు పలురకములైన జ్వరములు, ఇతర జబ్బులను గూర్చి సూక్ష్మంగా చెప్పబడినది. ఆయా జబ్బులకివ్వవలసిన మందులు వాటి మోతాదులు కూడ తెలుపబడినవి. వైద్య పరిభాషలో ఉపయోగింపపడు పదములకు తెలుగులో అర్థము చెప్పబడినవి. గ్రంథకర్త పీఠికలో ప్రతిపల్లెటూరి వైద్యుడు ఈ పుస్తమును చదివియందలి సూదిమందులు నేర్చుకొని, ఉపయోగించిన యెడల రోగులకు స్వస్థత గూడునని వ్రాసినారు. ఈ గ్రంథము వైద్యులకు, సామాన్యులకు గూడ పనికి వచ్చును.

—'పి'

జీవితమనే మరగానుగలో నలిగిపోతూ నిస్సహాయంగా భర్తకు భారంగా ఉంటూన్న జానకి, తనకొక వ్యక్తిత్వాన్ని కూర్చుకునే ప్రయత్నం చేస్తుంది.

కాని యీ పాత్రలు ఒకేసారి యిట్లామారిపోవు. క్రమ క్రమంగా, దెబ్బలు తగులుతూన్నకొద్దీ, తెలుసుకుంటూ జీవితంతో బాటు పెరుగుతాయి.

'గడ్డురోజులు' 1930–40మధ్యన ఉన్న ఆర్థిక మాంద్యాన్ని చక్కగా చిత్రించింది. మనిషి విలువల్ని డబ్బు ఏ విధంగా మారుస్తుందో విశదీకరించింది. కొడవటిగంటి మధ్య తరగతి వాళ్ళ జీవితాన్ని ఎంతో వాస్తవికంగా చిత్రించారు ఈ నవలలో.

ఇంతమంచి పుస్తకంలోనూ "ఎవరో తోసినట్టుగా సత్యం శృంగారం చేసాడు" లాటివి ఉండకుండా ఉంటే బాగుండేది.

"గెటప్" చాలా బాగుంది. 'రేఖ' కవరు పేజీ చిత్రం పుస్తకానికి ఎంతో శోభగా వుంది

## బిల్వమంగళీయము

### ( పద్యకావ్యము )

గ్రంధకర్త : మధురకవి అనిపిండివరాహ నరసింహ మూర్తి, డెమీఆక్టెవో 76 పుటలు; వెల రెండు రూపాయలు; ప్రతులకు గ్రంథకర్త పేర పి. డబ్లు.ఐ. ఆఫీసు, బారాదొార్ పోస్టు, బిలాస్పూర్ జిల్లా, మధ్యప్రదేశ్ అని వ్రాయవలెను.

లీలాశుకయోగీంద్రుని కృష్ణ కర్ణామృతము, జగత్ప్రసిద్ధ సంస్కృతస్తోత్ర కావ్యము, ఈతడును భర్తృహరివలెనే ఎంత రక్తుడో అంత భక్తుడుకూడ. లీలాశుకునకు కృష్ణావతారమనిన ఎంతో ప్రీతి. అతనికికల్గిన కృష్ణపరమాత్మ సాక్షాత్కారము 'వేణీమూలే' అను శ్లోకమున చక్కగా వర్ణించినాడు. ఆ లీలాశుకుని చరిత్రయే ఈ బిల్వమంగళీయము. బిల్వమంగళుడు సదాచారసంపన్నుడు, అతడు చింతామణియను వేశ్యమోహములో పడి అన్నిటిని మరచి తన తండ్రిని, భార్యనుకూడ కోల్పోయెను. చివరకు చింతామణియే అతనికి జ్ఞానోదయము కల్గించినది. అందులకే, చింతామణిర్జయతు సోమగిరిర్గురుర్మేశిక్షాగురుర్భగవాన్ శిఖిపింఛమౌళిః" అని కావ్యాదిని పేర్కొనినాడు. అజ్ఞానోదయమయిన పిదప కూడ ఒక సుందరమైన కాంతను చూచి భ్రమించిన కారణమున తన కన్నుల నూడ బెరికి, ఒక గొల్లపిల్లవాని సహాయమున బృందావనము చేరెను. ఆ గొల్లపిల్లవాడెవడో కాదు – గోపవేషమూనిన మురళీ కృష్ణుడే. అప్పుడాతనికి సాక్షాత్కరించిన బృందావన విహారిని 300 శ్లోకములలో వర్ణించి లీలాశుకయోగీంద్రుడయ్యెను.

బిల్వమంగళీయము మూడుస్తబకముల నిర్వచన కావ్యము. ఇందు బిల్వమంగళుని చరిత్ర ఆమూలాగ్రముగ వర్ణింప బడినది. బిల్వమంగళునకు సూరదాసు అను పేరు కూడ కలదని యీ కావ్యము వలన తెలియ వచ్చుచున్నది. పలువురు పండితులు, కవులు ఈ కావ్యమునకు అభిప్రాయముల నిచ్చినారు. అందు ఈ కవి శైలిలో పురాణ కవులశైలి కన్పించుచున్నదనినారు శ్రీ అనిపిండి వరాహ నరసింహమూర్తిగారిశైలి స్వతంత్రమైనది నిర్గళమైనధార, ప్రసాదగుణముతో నలరారుచున్నది. చదువగానే హృదయమునకు హత్తుకొనును.

"రసముల్ చిప్పిలఁ బ్రాజ్ఞసత్కవిబుధేంద్రశ్రేణి, మెచ్చోలనన్
విసుగుంజెందనియట్టిధోరణిని, మార్ద్వీకసంపత్తి పెం
పెసఁగన్ సర్వరసజ్ఞ సమ్మతముగా వింపంగ"

యత్నించి కృతకృత్యులైనారు గ్రంధకర్తలు, వీరు వయసున పిన్నలయ్యును కవితావ్యాసంగమున మిన్నలు. ప్రాచీనాలంకారిక లక్షణములకనుగుణముగానే ఈ కావ్యము వ్రాయబడినది. "మనమా హీహీలపాల్గాకుమా" అనుమకుటముతో బిల్వమంగళుని విరిచే వనమును కొన్ని పద్యములను వ్రాసినారు. ఇయ్యవి "మనమావద్దనరాదుమాట వినుమా మర్యాద గాపాడుమా" యనుమకుటమున చెళ్లపిళ్లవారు వ్రాసిన పద్యములు జ్ఞప్తికి దెచ్చుచున్నవి. ఏ తత్కావ్యకర్తలు కీ|| శే|| ఆకుండి వ్యాసమూర్తిగారి అంతేవాసులు. లీలాశుకునకు సాక్షాత్కరించిన పరబ్రహ్మము వేరు. వీరు వర్ణించిన కృష్ణసాక్షాత్కారము మూడవస్తబకములో 108 వ పద్యములో సుబోధముగా వర్ణించినాడు, కావ్యజీవనులైన వారు తప్పక చదువ వలసిన గ్రంథము.

## శ్రీనాథకవితా సమీక్ష

గ్రంథకర్త చిలుకూరి పాపయ్య శాస్త్రి. క్రౌన్ ఆక్టెవో 274 పుటలు, వెల నాల్గు రూపాయలు. ప్రతులకు ఆకెళ్ళ శేషాద్రి, రామారావుపేట, కాకినాడ, తూర్పు గోదావరి జిల్లా అని వ్రాయవలెను.

"నిరాశ్రయా న శోభంతేపండితావనితాలతా" అని ఆర్యోక్తి. అట్లే శ్రీనాథుని ప్రాశస్త్య ప్రకాశమునకు కారణభూతులు అతనిని పోషించిన రెడ్డి రాజులు. అందు వలననే శ్రీనాథుని కవితా సమీక్ష, రెడ్డి రాజుల చరిత్రము అని యీ పుస్తకమునకు రెండు పేర్లు

న్నవి. ఇంతకు పూర్వము శ్రీ చిలుకూరి పాపయ్య శాస్త్రిగారు వ్రాసిన శ్రీనాథుడు శృంగారియా అను గ్రంథమున అతని కవితా సమీక్ష కెక్కువ ప్రాముఖ్య మివ్వబడినది. ప్రకృత గ్రంథమున శ్రీనాథుని పోషించిన, రెడ్డి రాజుల రాజ్యపాలన, వారి పాండిత్య మును వారి జీవిత విశేషములను విపులముగా తెలిపినారు, శ్రీనాథుని పోషించిన రెడ్డి రాజులు కూడ పండితులు కాటయవేముడు కాళిదాసనాటక త్రయమునకు వ్యాఖ్యానములను రచించినాడు ముప్పది రెండు ప్రకరణములలో రెడ్డి రాజుల చరిత్రము విపులముగా జర్చింప పడినది అంతేగాక అనుబంధముగా ప్రకటింపబడిన రెడ్డి రాజులకు సంబంధించిన శాసనములు నాల్గు చారిత్రక గవేషణపరుల కుపయుక్తముకాగలవు. శ్రీ పాపయ్య శాస్త్రి గారు ఎంతో కాలమునుండి శ్రీనాథుని సాహిత్య యుగముపై గవేషణ చేయుచున్నారు, శ్రీనాథుడభిమాన కవియైన వారికిదియ వశ్య పఠనీయము.

వైద్య ఉర్మిని

గ్రంథకర్త; డా. అరిశే వేంకటేశ్వర్లు—క్రౌన్ ఆక్టైవో 67 పుటలు. వెల రెండు రూపాయలు. ప్రతులకు గ్రంథకర్త పేర, రాజా నర్సింగ్‌హోమ్, పెదకళ్లేపల్లి పోస్టు, వయా మోపిదేవి, కృష్ణా జిల్లా అని వ్రాయవలెను.

గ్రంథకర్తలు పోస్టు ద్వారా లండన్‌లోని ఒక కళాశాల నుండి పోస్టల్ ట్యూషను పొంది తద్వారా కలిగిన విజ్ఞానమును గ్రామస్థుల కుపయుక్తమగునట్లు వ్రాసిన చిన్న పుస్తకమిది. దీనిలో సర్వసామాన్యముగ మనకు వచ్చు పలురకములైన జ్వరములు, ఇతర జబ్బులను గూర్చి సూక్ష్మంగా చెప్పబడినది. ఆయా జబ్బుల కివ్వవలసిన మందులు వాటి మోతాదులు కూడ తెలుపబడినవి. వైద్య పరిభాషలో ఉపయోగింపపడు పదములకు తెలుగులో అర్థము చెప్పబడినవి. గ్రంథకర్త పీఠికలో ప్రతిపల్లెటూరి వైద్యుడు ఈ పుస్తకమును చదివియందలి సూదిమందులు నేర్చుకొని, ఉపయోగించిన యెడల రోగులకు స్వస్థత గూడునని వ్రాసినారు. ఈ గ్రంథము వైద్యులకు, సామాన్యులకు గూడ పనికి వచ్చును.

—'పి'

# ముఖ్యవార్తలు

రాష్ట్రంలో

22-7-61

హైద్రాబాదు నగర టెలిఫోను సంస్థ మూడవ దశ విస్తరణ కార్యక్రమానికి రాష్ట్ర పబ్లిక్ వర్క్సు శాఖామంత్రి ప్రారంభోత్సవం చేశారు.

24-7-61

రాష్ట్ర శాసనసభ, శాసన మండలిల వర్షాకాల సమావేశాలు గవర్నరు ప్రసంగంతో నేడు ఆరంభమయ్యాయి.

27-7-61

ట్యూషను ఫీజు హెచ్చింపుపట్ల అసమ్మతి సూచకంగా విద్యార్థులు ప్రారంభించిన సమ్మె ఫలితంగా ఆరు రోజుల పాటు కళాశాలలను మూసివుంచిన తరువాత నేడు జంటనగరాలలోని కళాశాలలన్నింటినీ తిరిగి తెరిచారు.

29-7-61

గోదావరి దక్షిణ కాలువ ప్రాజెక్టు రూపంలో పోచంపాడు ప్రాజెక్టును కేంద్రం ఇదివరకే మంజూరు చేసినదనీ, కనుక త్వరలోనే పని ప్రారంభించ బడుతుందని ముఖ్యమంత్రి రాష్ట్రశాసనసభలో ప్రకటించారు.

30-7-61

రాష్ట్ర ప్రాజెక్టులకు ప్రపంచ బ్యాంకు చేసే సహాయం విషయంలో రాష్ట్ర ప్రభుత్వంతో సంప్రదింపులు జరిపే నిమిత్తం ప్రపంచ బ్యాంకు ప్రతినిధులు ఇద్దరు హైద్రాబాదుకు వచ్చారు.

1-8-61

ఆంధ్ర ప్రదేశ్ శాసన క్రోడీకరణ సంఘానికి గవర్నరు ప్రారంభోత్సవం చేశారు. రాష్ట్ర ప్రభుత్వాలచే ఇటువంటి సంఘం నియమించబడటం ఇదే మొదలు

3-8-61

తాత్కాలిక రాష్ట్రపతి డాక్టర్ ఎస్. రాధాకృష్ణన్ మచిలీపట్నం ఆంధ్ర జాతీయ కళాశాల స్వర్ణోత్సవాలకు ప్రారంభోత్సవం చేశారు.

4-8-61

దేశంలో ప్రప్రథమంగా స్థాపించబడిన బాలికల పాలిటెక్నిక్‌కు ముఖ్యమంత్రి హైద్రాబాదులో ప్రారంభోత్సం చేశారు.

6-8-61

రాయలసీను అఖిలపక్ష శాసన సభ్యుల మహాసభను రాష్ట్ర ముఖ్యమంత్రి హైద్రాబాదులో ప్రారంభించారు.

7-8-61

రాష్ట్ర ప్రభుత్వంతో గూర్చి చర్చలు జరిపే నిమిత్తం తృతీయ ఆర్థిక సంఘం సభ్యులు రాష్ట్ర రాజధానికి విచ్చేశారు. శ్రీ. ఏ. కె. చందా సంఘం అధ్యక్షుడు.

12-8-61

ప్రణాళికా సంఘం నుంచీ, ప్రణాళికా సంఘం సాంకేతిక సలహా సంఘం నుంచి వర్తమానం వచ్చే పర్యంతం, నాగార్జున సాగర్ కుడికాలువ 57వ మైలు పైన పని నిలిపి వుంచవలసిందిగా యూనియన్ ప్రభుత్వం ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వాన్ని కోరినట్టు రాష్ట్ర శాసనసభలో ఆర్థిక మంత్రి వెల్లడించారు.

17-8-61

ప్రణాళికా పథకాల ప్రగతిని, వాటి ఆర్థికస్థితి, భౌతిక లక్ష్యాల దృష్ట్యా క్షుణ్ణంగా పరిశీలించే నిమిత్తం ఆయాశాఖా మంత్రుల అధ్యక్షతన ఆరు ఉన్నతాధికార సంఘాలను నియమించడానికి నిశ్చయం జరిగినట్టు ప్రణాళికా, సమాచార శాఖల మంత్రి తెలియజేశారు.

18-8-61

హైద్రాబాదు మునిసిపల్ కార్పొరేషన్ తలపెట్టిన ఆక్ట్రియ్

మోడల్ షెడ్యూలు విధింపుపట్ల, రామ్‌కోట్ (హైద్రాబాదు) లో జరిగిన ఒక సభలో నిరసన తెలుపబడినది.

## భారతదేశంలో

25–7–61

భారత ఉపరాష్ట్రపతి డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్ రాష్ట్రపతి అనారోగ్యం దృష్ట్యా ఆయన పదవీ బాధ్యతలు తాత్కాలికంగా స్వీకరించారు.

23–7–61

ఐదు సంవత్సరాల క్రితం బెంగుళూరులో ప్రభుత్వంచే స్థాపించబడిన హిందుస్తాన్ మెషిన్ టూల్సు కర్మాగారంవారు పొదుపుచేసిన డబ్బుతో ప్రారంభించబడిన రెండవ మిషీన్ టూల్సు పరిశ్రమను "జాతీయ కానుక" గా ప్రధానమంత్రి శ్రీ నెహ్రూ స్వీకరించారు.

పడవ ప్రమాదాలను నివారించేందుకై, ప్రయాణీకుల రవాణాకు ఉపయోగించే నాటు పడవలకు ప్రభుత్వం లైసెన్సులు జారీచేయాలనీ కేంద్ర రోడ్డు రవాణా, పడవ రవాణా సలహా సంఘం సిఫార్సుచేసింది.

1–8–61

అనారోగ్యంచేత నర్సింగ్‌హోమ్‌లో చెర్చబడిన డాక్టర్ రాజేంద్ర ప్రసాద్, స్వస్థత చేకూరాక రాష్ట్రపతి భవనానికి తిరిగి వచ్చారు.

5–8–61

ప్రైవేటు రంగంలో బొగ్గు గనుల అభివృద్ధికై రు. 17 కోట్ల ఋణం మంజూరు చేయడానికి ప్రపంచ బ్యాంకు వారు అంగీకరించారని కేంద్ర ఉక్కు, గనుల మంత్రి ఢిల్లీలో అన్నారు.

7–8–61

770 పేజీలు గల తృతీయ పంచవర్ష ప్రణాళికను కేంద్ర ప్రణాళికా మంత్రి లోక్‌సభకు యీ రోజున సమర్పించారు.

8–8–61

అమెరికా స్టేటు అండర్ సెక్రెటరీ శ్రీ చెస్టర్‌బౌల్స్ ప్రధాన మంత్రి శ్రీ నెహ్రూను కలిశారు.

9-8-61

పంజాబీ సుబా ప్రతిపాదనను నిరాకరిస్తూ, మాస్టర్ తారాసింగ్‌ను నిరాహారదీక్ష ప్రయత్నం విరమించాల్సిందిగా ప్రధాన మంత్రి విజ్ఞప్తి చేశారు.

10-8-61

కుల, మత, భాషా వైషమ్యాలను ప్రోత్సహించే వ్యక్తులను శిక్షించేందుకు వీలుగా, శిక్షాస్మృతికి మార్పులు చేసే ప్రతిపాదనలను కేంద్ర దేశీయ వ్యవహారాల మంత్రి లోక్‌సభలో ప్రతిపాదించారు.

ఢిల్లిలో రాష్ట్ర ముఖ్యమంత్రుల సమావేశాలు మూడు రోజుల పాటు జరిగాయి.

11–8–61

పూర్వం పోర్చుగీసు ఆధీనంలో వున్న దాద్రా, నగర్ హవేలీలు భారతదేశంలో లీనం అయ్యాయి.

14–8–61

13 రాష్ట్ర ప్రభుత్వాలు (ఆంధ్రప్రదేశ్ కూడా) రు. 80 కోట్ల మేరకు క్రొత్త ఋణాలు పొందటానికి ప్రకటనలు చేశాయి.

పోర్చుగీసు ఆధీనం నుండి విముక్తి పొందిన దాద్రా, నగర్ హవేలీలు భారతదేశ అంతర్భాగాలుగా లోక్‌సభ ఆమోదించింది.

15–8–61

సంప్రదింపులకు అవకాశం యిస్తూ, పంజాబీ సుబా నిర్మాణానికై అకాలీ నాయకుడు మాస్టర్ తారాసింగ్ ఆమరణ నిరాహార దీక్ష ప్రారంభించారు.

16–8–61

750,000 కిలోవాట్ల విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేసే మూడు పెద్ద ప్రాజెక్టుల నిర్మాణానికి అమెరికా రు. 30.00 కోట్ల ఋణం ఇచ్చే విషయంలో భారత–అమెరికా ప్రభుత్వాలు అంగీకార పత్రాలపై ఢిల్లిలో సంతకాలు చేశాయి

17–8–61

పంజాబు రెవిన్యూ శాఖా మంత్రి శ్రీ భీరేంద్రసింగ్‌ను పంజాబు గవర్నర్ పదవీచ్యుతుణ్ణి చేశారు.

## విదేశాలలో

21–7–61

కెనవెరల్ ద్వీపం (ఫ్లారిడా) నుండి అమెరికా, కెప్టెన్ గ్రిస్సమ్‌తో రెండవ రోదసీ నౌకను అంతరిక్షంలోకి విడిచింది. యితను అమెరికా రెండవ రోదసీ యాత్రీకుడు కాగలడు.

23–7–61

బిజెర్టా సమస్యపై, పశ్చిమ, తటస్థ రాజ్యాల ప్రతిపాదనలను భద్రతా సంఘం త్రోసిపుచ్చింది. యుద్ధ విరమణ చర్యలకై విజ్ఞప్తిచేసిన తర్వాత యిది జరిగింది.

26-7-61

కాంగో కేంద్ర పార్లమెంటు సమావేశంలో శాసన సభాధ్యక్షుడు, యితర అధికార్లు యెన్నుకోబడ్డారు. ఎగువసభ అధ్యక్షులుగా ఆ ముంబా వర్గీయుడు యెన్నికైనాడు.

31-7-61

ఐరోపు సమిష్టి మార్కెటులో సభ్యదేశంగా చేరేందుకై బ్రిటన్ లాంఛనప్రాయంగా దరఖాస్తు పంపుతుందని బ్రిటిష్ ప్రధాన మంత్రి శ్రీ మాక్మిలన్ ప్రకటించారు.

2-8-61

శ్రీ సిరిల్లా అడోల్లా నెలకొల్పిన కొత్త కాంగో ప్రభుత్వాన్ని పార్లమెంటు ఉభయ సభలు బలపర్చాయి.

7-8-61

రష్యా రోదసీ నౌక వాస్టోక్ II చోదకుడు మేజరు జార్మన్ టిటోవ్ 17 సార్లు భూప్రదక్షిణం చేసి సురక్షితంగా భూమిపై దిగాడు.

13-8-61

తూర్పు జర్మనీ అధికార్లు (తూర్పు, పశ్చిమ) బెర్లిన్ సరిహద్దులపై రాకపోకలను నిషేధించారు.

19-8-61

ప్రసిడెంటు కెన్నెడి ఉత్తర్వులపై 1500 అమెరికన్ పటాలములను పశ్చిమ బెర్లిన్‌కు తరలించడం ఆరంభమైంది.

20-8-61

బెర్లిన్‌పై దాడి చేస్తే అది అణు యుద్ధంగా పరిణమిస్తుందని రష్యా ఉపప్రధాని శ్రీ అనెస్టాసుమికోయన్, పశ్చిమ రాజ్యాలను హెచ్చరించారు.



# రచయితలు

1. శ్రీ చామర్తి సుబ్రహ్మణ్యం, రాజమహేంద్రవరం, తూర్పు గోదావరిజిల్లా.
2. శ్రీ యస్. శ్రీనివాసాచార్య, వెంకటగిరి, నర్సంపేట తాలూకా, వరంగలుజిల్లా.
3. శ్రీ ఎం. వి. రమణరావు, తెనాలి.
4. శ్రీ మానేపల్లి సత్యనారాయణ, విజయనగరం.
5. శ్రీ టి. రాజేశ్వర రావు, పత్రికా రచయిత, వరంగల్లు.
6. డా. కేతవరపు రామకోటి శాస్త్రి, ఆంధ్రోపన్యాసకుడు, ప్రభుత్వ కళాశాల, వరంగల్లు.
7. శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి, తెలుగు పండితులు, రామచంద్రపురం, తూర్పుగోదావరిజిల్లా.
8. శ్రీ ముకురాల రామిరెడ్డి, తెలుగు పండితులు, కల్వకుర్తి, మహబూబ్‌నగరం జిల్లా.
9. శ్రీ చింతలపూడి సన్యాసిరావు, కార్యదర్శి, కౌముదీ పరిషత్తు, విజయనగరం.
10. "పిపాసి" హైద్రాబాదు.
12. శ్రీ భమిడిపాటి రామగోపాలం, సనత్‌నగర్, హైద్రాబాదు.
11. శ్రీ జి సత్యారావు, ఉపాధ్యక్షుడు, పంజాబు విశ్వవిద్యాలయ జర్నలిస్టు, అసోసియేషన్ కొత్తఢిల్లీ.
13. శ్రీ సామల వీరేశము, ఉపసర్‌పంచ్, గ్రామపంచాయితీ బోర్డు, శాయంపేట, హన్మకొండతాలూకా, వరంగల్లు జిల్లా

# "ఆంధ్ర ప్రదేశ్" ప్రకటన రేట్లు

'ఆంధ్ర ప్రదేశ్' పత్రికలో ఈ దిగువ రేట్ల ప్రకారం ప్రకటనలు స్వీకరించబడగలవు.

| వివరాలు | మూడు భాషల పత్రికలకు | | | ఒక భాష పత్రికకు | | |
|---|---|---|---|---|---|---|
| | పూర్తి పేజీ | సగం పేజీ | పావు పేజీ | పూర్తి పేజీ | సగం పేజీ | పావు పేజీ |
| | రూ | రూ | రూ | రూ | రూ | రూ |
| లోపలి పేజీ | 200 | 125 | 75 | 100 | 55 | 30 |
| వెనుకవైపు కవరుపేజీ | 350 | — | — | 150 | — | — |
| 2,3 కవరు పేజీలు | 250 | — | — | 125 | — | — |

ఒక సంవత్సరం కొరకు స్థలమును కంట్రాక్టు తీసుకొన్నవారికి 20 శతి రిబేటు ఇవ్వబడుతుంది.

## షరతులు

1. సాంకేతిక వివరాలు: $10\frac{3}{4} \times 8\frac{1}{2}''$ డెమ్మీ.
2. ముందరి టైటిల్ పేజీపై ప్రకటనలు వేయబడవు.
3. పావుపేజీకంటే తక్కువ ప్రకటనలు స్వీకరించబడవు.
4. ప్రకటించవలసిన విషయము, అది వేయబడవలసిన స్థలము మొదలగు వివరాలు, దానికయే మొత్తమూ ప్రతినెల 8 వ తేదీలోపుగా ఈ కార్యాలయానికి చేరినట్లయితే, ఆ ప్రకటన మరుసటి నెల పత్రికలో ప్రచురింపబడుతుంది. ప్రకటనకయ్యే మొత్తమును మనియార్డరు ద్వారాగాని, లేక క్రాస్ చేసిన డిమాండు డ్రాఫ్ట్‌ద్వారాగాని పంపవలెను డిమాండు డ్రాఫ్ట్ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సమాచార, పౌరసంబంధముల శాఖ డైరెక్టర్, హైదరాబాదు-దక్కన్ పేరిట వ్రాయబడవలెను.
5. ప్రకటన నిమిత్తమై పంపబడు బ్లాకుల విషయంలో తగుజాగ్రత్త వహింపబడుతుంది. అయితే మిషను మీద బ్లాకులు గనుక పగిలిపోయినట్లయితే అందుకు ఈ శాఖ బాధ్యత వహించదు.
6. ప్రకటన ఎంతస్థలంలో ఏవైనం ప్రకారం వేయవలసిందీ, ఒక భాష పత్రికలో వేయవలెనా, లేక మూడుభాషల పత్రికలలో వేయవలెనా అనే వివరాలను స్పష్టంగా తెలియపరచాలి. ఉత్తర ప్రత్యుత్తరాలను, పైకమును ఈదిగువ చిరునామాకు పంపవలెను.

డైరెక్టర్
సమాచార పౌరసంబంధముల శాఖ
ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం
హైదరాబాద్-1

# వ్యసనంలేని వ్యాపారం

మెట్రిక్ తూనికలు ఇప్పుడు
వాడకంలోనికి వచ్చినవి.
మెట్రిక్ తూనికలనుబట్టే ఇప్పుడు
వస్తువులధరలు చెప్పబడుతున్నవి.
అయినా బేరసారాలలెక్కలు కొంతగజి
బిజిగానే వుంటున్నవి-కారణం ఏమిటి?

మెట్రిక్ పద్ధతిలో ఆలోచించడానికి, ఆ
ప్రకారం వ్యవహరించడానికి ఇంకా అలవాటు
పడకపోవడమే కారణం. పాత తూనికల ప్రకా
రమే వస్తువుల ధరలను అడగటం తటస్థిస్తున్నది.

| | | |
|---|---|---|
| ఒక పావుకు | — | 233 గ్రాములు |
| ఒక పౌనుకు | — | 454 గ్రాములు |
| అయిదు పలాలకు | — | 175 గ్రాములు |

ఏమైనా తూనికల పద్ధతి సంస్కరణ
ప్రయోజనం ఇంకా పూర్తిగా అవగాహన కాలేదు.

ధరలను అడగవలసిన క్రమమైన పద్ధతి

**200 లేదా 300 గ్రాముల బరువు**
**400 లేదా 500 గ్రాముల బరువు**
**100 లేదా 200 గ్రాముల బరువు**

ఇలా వస్తువుల ధరలను అడిగినపుడే సంస్కరణ
పూర్తి ప్రయోజనం లభిస్తుంది. మెట్రిక్ తూనికలలో
దశాంశ నాణెముల విలువలో ధరలుకట్టడం అతితేలిక.
మీకు కావలసిన వాటిధరలు

తేలిక **మెట్రిక్** యూనిట్ లలో అడగండి



అది మీకూ ... వర్తకునికికూడా లాభం

భారత ప్రభుత్వం వారిచే జారీ చేయబడినది

DA 61/1[illegible]




# పైసల ఆదా

టెలిగ్రాం అంటే జరూరు అన్నమాట అందుచేత పూర్తి చిరునామా వ్రాసి, టెలిగ్రాం తొందరగా చేరగలిగేటట్టు చూసుకోవాలి

చిరునామా పూర్తిగా లేకపోతే, టెలిగ్రాముల బట్వాడా ఆలస్యంకావచ్చు.

పైసలు ఆదాచేస్తూకూడా మీరు పంపే టెలిగ్రాములు ఆలస్యంగా అందకుండా చేసుకోవచ్చు టెలిగ్రాం ఎవరికి పంపుతారో వారి చిరునామాకు బదులు టెలిఫోన్ నెంబరు వేస్తేసరి ఉదాహరణకు 'బెనర్జీ టియఫ్ 31670, న్యూఢిల్లీ" అని చిరునామా వ్రాస్తే, ఆ టెలిగ్రాం ఢిల్లీ చేరగానే, టెలిఫోన్‌లో ఆ టెలిగ్రాంలోని సందేశం బెనర్జీకి చెప్పబడుతుంది

*చిరునామాలోని టెలిఫోన్ నెంబరు "టియఫ్ 31670"*
*ఒకే ఒక మాటకింద పరిగణించబడుతుంది.*

**మీకు ఇతోధికంగా సేవచేయడానికి**
**మాతో సహకరించండి**

తంతి తపాలా శాఖ

DA 60/550

# ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం

| | | | |
|---|---|---|---|
| వైశాల్యం | ... | ... | 1,06,052 చదరపు మైళ్ళు |
| జనసంఖ్య | ... | ... | 35,977,999* |
| పురుషులు | ... | ... | 18,175,349* |
| స్త్రీలు | ... | ... | 17,802,650* |
| సగటు వర్షపాతం | ... | ... | 35.65" |
| అరణ్య ప్రదేశం | ... | ... | 1,40,26,000 ఎకరాలు |
| జిల్లాలు | ... | ... | 20 |
| తాలూకాలు | ... | ... | 189 |
| రెవిన్యూ సర్కిళ్లు | ... | ... | 1,000 |
| పట్టణాలు | ... | ... | 223 |
| గ్రామాలు | ... | ... | 28,945 |
| పంటలక్రింది ప్రదేశం 58_59 | ... | ... | 2,73,02,000 ఎకరాలు |
| కోళ్ళ సంఖ్య | ... | ... | 42,45,832 |
| 1958_59 లో నీటి పారుదలను పొందిన ప్రదేశం | | ... | 86,29,000 ఎకరాలు |
| 1958_59 లో వుత్పత్తి అయిన ఆహారధాన్యాలు | | ... | 61.56 లక్షల టన్నులు |
| పాల వుత్పత్తి | ... | ... | 15.5 లక్షల గాలన్లు |
| రైలు మార్గాలు | ... | ... | 3009.13 మైళ్ళు |
| జాతీయ రహదార్లు | ... | ... | 1,415 ,, |
| రాష్ట్ర రహదార్లు | ... | ... | 3593 ,, |
| జిల్లా పెద్ద రోడ్లు | ... | ... | 8220 ,, |
| జిల్లా ఇతర రోడ్లు | ... | ... | 2852 ,, |
| గ్రామాల రోడ్లు | ... | ... | 3442 ,, |
| పాఠశాలలు | ... | ... | 36,375 |
| కళాశాలలు 1959_60 | ... | ... | 113 |
| వృత్తి విద్యా కళాశాలలు | ... | ... | 36 |
| తృతీయ పంచవర్ష ప్రణాళిక ప్రమాణం | | రూ. | 305 కోట్లు |

## 1961–62 బడ్జెటు:

| | | | |
|---|---|---|---|
| ఆదాయం | ... | రూ. | 85.12 కోట్లు |
| వ్యయం | ... | ... ,, | 87.62 ,, |
| పెట్టుబడి ఖర్చు | ... | ... ,, | 34.55 ,, |

